

కృతిస్వీకర్త

కర్మయోగి

సమాజ సంఘటనా శాస్త్రవేత్త

నిరంతర సమాజ పరమేశ్వరారాధకులు

**శ్రీరామ్ శ్రీపాద సాఠే**

# "హైదరాబాదు నగర తెలుగు భాషా సాహిత్య వికాస చరిత్ర"



శా. శ. 1801 - 1872

క్రీ. శ. 1879 - 1950



డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి, యమ్.ఏ.పిహెచ్.డి.

శ్రీ బాబాసాహెబ్ ఆప్టే స్మారక సమితి
భారతీయ ఇతిహాస సంకలన సమితి
కేశవనిలయం, బర్కత్‌పుర
హైదరాబాదు - 500 027.

ప్రథమ ముద్రణ :
శా శ. 1907 = క్రీ.శ. 1985

ప్రతులు : 600

Acc No - 30932

మూల్యం : రూ. 25/-

ప్రచురణ :
డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి
సర్వస్వామ్యములు గ్రంథకర్తవి

ప్రతులకు :
డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి
8-2-46, పంజగుట్ట,
హైదరాబాదు - 500 004.

సాహిత్యనికేతన్
3-4-852, బర్కత్‌పుర,
హైదరాబాదు - 500 027.

ముద్రణ :

# భాగ్యనగర భారతి

కళాప్రపూర్ణ డా॥ దాశరథి, డి.లిట్.
ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి

"కవనార్థంబుదయించితిన్" అని ధీమాగా చెప్పుకోగలిగిన మహాకవి, శతావధాని, చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారిని తొలి ఆస్థానకవిగా నియమించే మహోత్సవంలో పాల్గొనడానికి 1949 లో నేనూ, నా మిత్రులూ విజయవాడ వెళ్ళాము. అక్కడ డాక్టర్ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారిని దర్శించుకున్నట్లు జ్ఞాపకం.

నాకు అత్యంత ప్రీతిపాత్రమైన విషయం తీసుకుని ఈ ఉద్గ్రంథం వీరు రచించారు.

కవిగారు ఈ గ్రంథాన్ని తమ రచనా ప్రణాళిక ననుసరించి అనేక విధాలుగా విడమర్చారు. పూర్వరంగం, ప్రధానరంగం, ఉత్తరరంగం అన్నదాక విశ్లేషణ. పూర్వరంగంలో ఖుతుబ్‌షాహీల పరిపాలనాకాలం, వారి సాహిత్యపోషణ; ప్రధానరంగంలో గ్రంథాలయోద్యమం, నాటకరంగం, పరిశోధనారంగం, ఆంధ్రోద్యమం, సాహిత్య సంస్థలు, విద్యారంగం, పత్రికారంగం, కవులు వారి సాహిత్యం గురించిన వివరణ; ఇక ఉత్తరరంగంలో నాటి రాజకీయపరిణామాలు, ఆంధ్రాభ్యుదయోత్సవాలు, తెలంగాణా రచయితల సంఘ కార్యకలాపాలు, కవులు-సాహిత్యం మొదలైనవి చిత్రించటం జరిగింది ప్రధానరంగంలో సాహిత్యచరిత్రను యుగసప్తకంగా విశ్లేషించారు. పేరును బట్టి, వివిధ విషయాల్ని కూలంకషంగా వివరించటాన్ని బట్టి ప్రధానరంగమే యీ గ్రంథానికి కీలకమైందని ఇట్టే అర్థమౌతుంది. ఈ రంగంలో కాలచక్రం డెబ్బైరెండు సంవత్సరాలు ప్రయాణించింది. క్రీ.శ. 1879 నుంచి 1950 వఱకు తీసుకున్నారు. ఇందులో మళ్ళీ మొదటి అరవై సంవత్సరాలు ఒక భాగంగాను మిగిలిన పన్నెండు సంవత్సరాలు మరో భాగంగాను విభజించటం జరిగింది. ఈ డెబ్బైరెండు సంవత్సరాలకు అనుబంధంగా మరో ఆరు సంవత్సరాలు చేర్చి 1956 ఆంధ్రప్రదేశ్ అవతరణ వఱకు పొడిగించి దీనికి ఉత్తరరంగమని పేరు పెట్టారు. ఇట్లా వీరు ఏర్పరుచుకొన్న రచనా ప్రణాళికనుబట్టి అనేక విధాలుగా విషయాన్ని విడమర్చి, చెప్పదలచుకొన్న దానికి సమగ్రతను సమకూర్చుకొన్నారు.

ఈ గ్రంథంలో "సాహిత్య సంస్థలు" అను ప్రకరణంలో సురవరం ప్రతాపరెడ్డి గారు గోలకొండ కవుల సంచికను ప్రకటించిన విషయాన్ని ప్రస్తావించి—"తెలంగాణ ... వలవేసి. కవిమత్స్యములను పట్టుకొని, వారి యందు గర్భీకృతములై యున్న ... గుళీయకములను వెలార్చి సాహిత్యరంగమును నిగనిగలాడించిన నిజమైన సాహిత్యధీవరుడు ప్రతాపరెడ్డిగారు"—అని ఒక గొప్పమాట చెప్పారు గ్రంథ రచయిత. ... ప్రతాపరెడ్డిగారు చేసినపని మొత్తం తెలంగాణాకు సంబంధించింది. ఆ మార్గాన్ని దృష్టిలో పెట్టుకుని కావచ్చు, ఈ రచయిత హైదరాబాదు నగరాన్ని మాత్రమే తీసుకొని ఒకవైపు భాషావికాస దృష్టితోను, మరొకవైపు సాహిత్యవికాస దృష్టితోను ఎన్నో విషయాలు పొందుపర్చారు. ఎందరో కవుల్ని గూర్చి వివరించారు. రమారమి యాభై మందికి పైగా కవులు ఇక్కడ మనకు కనిపిస్తారు. ప్రతాపరెడ్డిగార్ని గురించి ఈ కవి గారు చెప్పిన మాటల్ని వీరికి గూడా అన్వయించి— "భాగ్య నగర సాహిత్య సాగర ... మత్స్య గర్భీకృత కవితాంగుళీయక సౌందర్య ప్రదర్శన ధీవరుడు డా॥ ఓగేటి" అని ... నంటున్నాను.

వీరు ఇందులో చాలా విషయాలు చెప్పారు; పకడ్బందీగా చెప్పారు; పసందుగా చెప్పారు. ప్రధానరంగాన్ని ప్రారంభించిన తీరు మహారమ్యంగా ఉంది. రచన ఆయా సందర్భాలకు తగినట్లు సమవేగంతోను, సమతూకంతోను సాగిపోయింది. సాహిత్య గౌరవాన్ని దృష్టిలో పెట్టుకొని చక్కని శిష్టవ్యావహారికభాష నుపయోగించారు.

హైదరాబాదు, ఉత్తర దక్షిణ భారత సంస్కృతులకు స్వాగతం పలుకుతూ సమన్వయ స్వభావంతో విలసిల్లుతున్న మహానగరం ఒక విశిష్టమైన సంస్కృతికి, నాగరికతకు కేంద్రస్థానం. తెలుగు, కన్నడం, మరాఠీ, ఉర్దూ భాషలు అన్యోన్యంగా మెలగుతున్న నగరం. హిందూ ముస్లిం సమైక్యతకు చిహ్నం. శివాజీ, వివేకానందుడు, రవీంద్రుడు, మహాత్ముడు మొదలైన మహాపురుషులు, మహాకవులు విచ్చేసి విశ్రాంతి తీసుకున్న ప్రశాంతనిలయం. భారతకోకిల శ్రీమతి సరోజినీనాయుడు నివసించిన కాంచనదేహళి (Golden Threshold) ఇది.

దీన్ని గురించిన ఇతర విషయాలపై ఎవరైనా ఏదైనా వ్రాసి ఉండవచ్చు; కాని "హైదరాబాదు నగర తెలుగు భాషా సాహిత్య వికాస చరిత్ర" అను పేరుతో వెలువడుతున్న ఈ గ్రంథం ఇదివరలకు ఎవ్వరూ సాహసించని కృషి! నిజాయితీతో నిష్పక్షపాతంగా, సత్యానికి సన్నిహితంగా వ్రాసిన ఉత్తమ పరిశోధనా గ్రంథమిది. డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగార్ని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

మామిడి భోజిరెడ్డి,
అధ్యక్షుడు
నగర గ్రంథాలయసంస్థ, హైదరాబాదు

# ఆశీస్సులు

మీ పుస్తకాన్ని కండ్లఇబ్బందితో కష్టమైనా చదివాను. మీ కృషికితగ్గ ప్రతిఫలం రాదు. మరి ఎందుకు మీ కృషి? మీరంటారు; దేశ సేవ - పురాతన సంస్కృతీ సాహిత్యాల్ని కాపాడటం కొఱకు అని. ఇది ఎంతో కాలాన్ని వెచ్చించి వ్యయ పయాసలకోర్చి చేసిన అతి విలువైన పని. కాని విలువకట్టేవారెవరున్నారు? ఒక పదిరోజులు కష్టపడి ఒక నవల వ్రాస్తే డబ్బు సంచులు వచ్చి పడతయ్ మీముందర. ఎవ్వరి అతిమంచితన మన్నా నాకు ఇష్టముండదు. అనవసరంగా బాధలకు గురిఅవుతారు.

హైదరాబాద్ నగర తెలుగు భాషా సాహిత్య వికాస చరిత్ర మీరు వ్రాసినారు. మీరు పూనకుంటె ఇది మరుగునపడిపోవును. ఇది ఒక గొప్ప సేవయె. ఇది 136 పుటలు గలది. ఎంత శ్రమ! ఎన్ని పుస్తకాలు చదువవలసి వచ్చినదో! ఎన్ని రా తులు వెచ్చించారో! ఇది ఒక పిచ్చివాడు చేయగలుగుతాడు. ఒకధ్యేయము లక్ష్యము సాధించాలంటే ఆ ధ్యేయాన్ని సాధించుతాననే పిచ్చివాడే చేయగలుగుతాడు. అందుకే నేనంటాను పిచ్చివారి కొరత చాలా ఉన్నదని

నేనొక పిచ్చివాణ్ణి. పిచ్చివాని దగ్గరికి ఇంకో పిచ్చివాడు వచ్చి అభిప్రాయము వ్రాయమంటే ఎట్లా? నాకు సాహిత్యంతో ఏమాత్రం పరిచయంలేదు. రుచిలేదు-నా పిచ్చి లోకమే వేరు. భావిపౌరులను పాఠశాలలో తీర్చిదిద్దించి బాధ్యతగల పౌరులుగా తయారు చేయాలి. కష్టపడి ఉత్తీర్ణులు అయ్యేటట్లు చూడాలని నా పిచ్చి కోరిక. చదువకుండానే ప్యాసు కావాలని వారి కోరిక. ఎంత తేడా! తూర్పు, పడమర! నా పిచ్చి ముదురుతున్నది. వారు ఇంకా దిగజారుతున్నారనుకుంటాను. దీనికి ఉపాధ్యాయుల సహకారము వారికే, నాకు రాదు! అయినా మన గమ్యాన్ని చేరాలని జీవితలక్ష్యముతో వేసారక ముందుకు పోవుచున్నాను. గమ్యము చేరుతానా? అది నాకు అనవసరం. నాప్రయత్నం కొనసాగిస్తాను.

పిచ్చివారి పట్టికలో మీ చేరిక నాకు సంతోషము కలిగించింది. Guinnes Book లో ఏదో విధంగా అతిపిచ్చివానిగానైన మీ పేరు అచ్చుకావాలని భగవంతుణ్ణి ప్రార్థించుచూ మీకృషి చాలావరకు సఫలీకృతము అయినందుకు సంతోషించి, వయసులో పెద్దవాణ్ణి కావున దీవించి ఆశీర్వదించుచున్నాను.

మామిడి భోజిరెడ్డి

# శు భా కాం క్ష లు

శ్రీ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారు పండితుడుగా, ఉపాధ్యాయుడుగా నాకు చిరకాల పరిచయం. అయితే వారికి చారిత్రక పరిశోధనయందు ఆసక్తి ఉన్న సత్యం నాకు తెలియదు. ఈ పుస్తకాన్ని చదివి యీసత్యాన్ని తెలుసుకొని సంతోషించినాను. ఈపుస్తక రచనలో శాస్త్రిగారు చాల శ్రమపడినారు. విషయ సేకరణ కొరకు అనేక గ్రంథాలు పరిశీలించినారు. సారస్వత పరిషత్తు గ్రంథాలయంలో వారు చాలకాలం గడిపిన సంగతి నాకు బాగా తెలుసును —

హైదరాబాదు నగరం గోలకొండగా సుప్రసిద్ధం ప్రాచీనాంధ్ర నగరాలలో ఎన్నికగన్నది గోలకొండ. కాకతీయులకురాజధానియైన ఓరుగల్లు తరువాత ఇంచుమించు సకలాంధ్రదేశానికి గోలకొండ(హైదరాబాదు)రాజధానియైనది. మొదటినుండి గోలకొండ తెలుగు భాషావికాసానికి ఆటపట్టు అయినది. నాటినుండి నేటివరకు యీనగరంలో జరిగిన సారస్వత కృషిని శాస్త్రిగారు యీగ్రంథంలో చక్కగా సమీక్షించినారు ఈ కృషి గావించిన వ్యక్తుల పరిచయాన్ని సంస్థల పరిచయాన్ని యీ గ్రంథంలో వారు వివరించి నారు. ఇందుకు శాస్త్రిగారిని అభినందించవలసి ఉన్నది.

మరికొన్ని వివరాలను చేర్చినచో యీగ్రంథం సమగ్రం కాగలదు. అందుచేత శాస్త్రిగారు త్వరలోనే యీపని చేయగలరని విశ్వసిస్తున్నాను. ఆంధ్ర విద్యాలయం స్థాపించి దాని అభివృద్ధికి కృషి చేసిన వారిలో శ్రీ నాగులపల్లి కోదండ రామరావు - (ఎన్.కె. రావు) గారిని గురించి చెప్పవలసి ఉండెను. కాని శాస్త్రిగారికి వారిని గురించి సమాచారం అందినట్లులేదు. ఇటువంటి వివరాలు మరికొన్ని ఇందులో చేరవలసిఉన్నవి. కావుననే యీగ్రంథం సమగ్రంగా రూపొంది (ద్వితీయ ముద్రణ పొందవలెనని నా కోరిక. శ్రీ శాస్త్రిగారు మరికొంత కృషిచేసి నాకోరికను నెరవేర్చగలరని ఆశిస్తున్నాను.

మరొకమాట. హైదరాబాదు నగరానికి మాత్రమే పరిమితం చేయక యీ గ్రంథాన్ని తెలంగాణాకు విస్తరించిన బాగుండునని నా సూచన. ఎందుకనగా ఇందులో వారు పేర్కొన్న వ్యక్తులుకొందరు నగరానికి చెందినవారుకారు. జిల్లాలకు చెందినవారు.

శ్రీ శాస్త్రిగారి కృషి ప్రశంసనీయం. చరిత్రకు సంబంధించిన అనేక వివరాలను క్రోడీకరించి తేదీలను నిర్ణయించి శ్రీ శాస్త్రిగారు మంచి కృషి గావించినారు. ఇందుకు వారిని అభినందిస్తున్నాను. ఇటువంటి గ్రంథాలు మరికొన్ని వారు రచించవలెనని నా అభిలాష. శ్రీ శాస్త్రిగారి సారస్వత వ్యాసంగానికి నా సహకారం సర్వదాలభించగలదు, శ్రీ శాస్త్రిగారికి నా శుభాకాంక్షలు.

హైదరాబాదు
2-10-1985

దేవులపల్లి రామానుజరావు

# మనవి

శ్రీబాబాసాహెబ్ ఆప్టేస్మారకసమితి-భారతీయ ఇతిహాససంకలనయోజన; నిర్దేశించిన మార్గదర్శక సూత్రముల ప్రకారము నిర్మించుకొన్న రచనా ప్రణాళికననుసరించి రచింపబడిన గ్రంథమిది.

విదేశీయులు చేసిన కూహకములవల్లను, వారివలలో తగుల్కొన్న మన ప్రబుద్ధులు కొందరు వ్రాసినవ్రాతలవల్లను శతాబ్దముల తరబడిగ మన జాతి చరిత్రవక్రగతిబట్టినది. ఇప్పటికైనను ఆఊబినుండి బయటపడి దేశమునందలి అన్నిభాగములకు సంబంధించిన మన సమగ్ర జాతీయ జీవనచరిత్ర యదార్థముగను, చక్కగను తిరిగి వ్రాయింపబడవలెనన్నది యీ సమితియొక్క ప్రధానధ్యేయము.

చరిత్రయనగా రాజకీయచరిత్ర మాత్రమేకాదు; రాజకీయమన్నది సమగ్రమగు జాతీయ జీవనచరిత్రలో నొక స్వల్పభాగము మాత్రమే. కాగా. జీవనములోని అన్ని రంగములకు సంబంధించిన వివిధ విషయములను స్పృశించునంశములన్నియు చరిత్ర క్రిందకువచ్చును. భౌగోళికము, మతపరములు, తత్త్వజ్ఞాన సంబంధితములు, సామాజిక విషయములు, ఆర్థికనీతి, విద్యావిషయములు, భాషాసాహిత్యములు, కళలు మొదలైనవన్నిటికీ చరిత్ర ఉన్నది. వాటికి సంబంధించిన అంశములన్నియు సేకరింపబడవలయునన్నది సమితి సంకల్పము.

కలియుగప్రారంభమునుండి జరిగిన వివిధ చారిత్రక సంఘటనలయొక్క కాలనిర్ణయము చేయవలసియున్నదని సమితి భావించుచున్నది, అందుకొరకు "సంవత్సర చక్రముల ప్రకారము చరిత్రరచన'' అను పథకమును సిద్ధము చేసినది. కలియుగము క్రీస్తుపూర్వము 3102లో ప్రారంభమైనది. అది మొదలుకొని 60 సంవత్సరములకొక కాలచక్రముచొప్పున లెక్కగట్టినచో క్రీ.శ. 1938 నాటికి మొత్తము 84 కాలచక్రములు పూర్తియగుచున్నవి. 1939లో ప్రారంభమైన 85వ కాలచక్రము 1998నాటికిగాని పూర్తిగాదు. కావున ఈచక్రమునందలిమొదటి 12 సం॥ మాత్రమే సమితి తన కృషిలో భాగముగ స్వీకరించినది. ఇది 1939-1950 సం॥ మధ్యగల కాలఖండమన్నమాట. ఇట్లు క్రీస్తుపూర్వము 3102 నుండి క్రీ.శ. 1950 వరకు వ్యాపించిన సుదీర్ఘమగు కలియుగమునందలి చరిత్రను వ్రాయింపవలయునన్నది సమితియొక్క పూనిక.

కలియుగ ప్రారంభసంవత్సరములలో జరిగిన సంఘటనలకు కాలనిర్ణయము చేయుటకు కావలసిన ఆధారములు చాల తక్కువగనున్నవి. కావున అక్కడినుండి మొదలుపెట్టి చరిత్రను వ్రాయుట కష్టభూయిష్టమైన విషయము. ఈ 20వ శతాబ్దపు చరిత్రను సంకలనము చేయుటకు చాలినన్ని యాధారములున్నవి. అందువల్ల యిక్కడ

నుండి చరిత్రను వ్రాయుటకు ప్రారంభించి వీలయినంత వెనకకు వెళ్ళుచూ క్రమముగా కలియుగ ప్రారంభముదాక చేరవచ్చునని సమితి భావించుచున్నది. ఈపథకము ప్రకారము 85వ చక్రమునందలి 1939 నుండి 1950 వరకుగల 12 సంవత్సరముల చరిత్రను తొలుత సంకలనము చేయవలెనని సమితి నిశ్చయించినది. ఇది పూర్తియైన పిమ్మట క్రీ.శ. 1879—1938 మధ్యగల 84వ చక్రముయొక్క 60 సంవత్సరముల చరిత్ర సంకలితము చేయబడును. ఆవరుసలో పూర్వాపూర్వముగ పని సాగించుచుపోయి గమ్యమును చేరుకొనవలెనని సమితి యాకాంక్ష.

దేశమంతటను ప్రస్తుతము వాడుకలోనున్న క్రీస్తుశకమునకు బదులు దక్షిణ భారతములో శాలివాహనశకమును, ఉత్తరభారతములో విక్రమశకమును క్రమముగా వాడుకలోకి తేవలయునని సమితి నిర్ణయము.

ఇట్టివి ఇంకెన్నియో మహదాశయములు ఈసమితికున్నవి. వాటిననుసరించి కొన్ని పథకములను రూపొందించుకొని ముందుకు పోవుచున్నది. పరిశోధకులను, రచయితలను, విద్వాంసులను ఆహ్వానించి సంప్రతించుచున్నది. గ్రంథరచనలకు ప్రోత్సాహించుచున్నది. ఆవరుసలో వ్రాయబడినదే "హైదరాబాదునగర తెలుగు భాషా సాహిత్యవికాసచరిత్ర" అను గ్రంథము. సమితియొక్క ఆశయాదర్శములను, ప్రణాళికను అవగాహన చేసుకొన్నచో ఈ గ్రంథరచనా ప్రణాళిక సులభముగ నర్థమగును.

ఈగ్రంథమున పూర్వరంగము, ప్రధానరంగము, ఉత్తరరంగము అనుమూడు భాగములున్నవి. పూర్వరంగమున క్రీ.శ. 1518 నుండి 1878 మధ్యగల సుమారు 350 సంవత్సరముల సాహిత్యచరిత్ర లభించినమేరకు రేఖామాత్రముగ వ్రాయబడినది. ఇందు కుతుబ్షాసుల్తానులలో కొందరు తెలుగు సాహిత్యమును పోషించుటయు, కొందరు పోషింపకపోవుటయు, నిజాం నవాబులు అసలాజోలికే పోకపోవుటయు గమనింపవచ్చును. ప్రధానరంగమున 1879 నుండి 1950 వరకుగల 72 సం॥కాలమున ప్రవర్తిల్లిన తెలుగుభాషా సాహిత్యవికాసమును గూర్చి వివరింపబడినది. ఉత్తరరంగమున 1951 నుండి 1956 వరకుగల 6 సం॥ కాలమున ప్రవర్తిల్లిన భాషాసాహిత్య వికాసమును గూర్చి దిఙ్మాత్రముగ చెప్పబడినది.

వాస్తవమునకు ఈమూడు రంగములలో ముఖ్యమైనది ప్రధానరంగమే. తొలుత వ్రాయ తలపెట్టినదికూడా ఇది మాత్రమే. అయితే, పూర్వోత్తరరంగములను జోడించుట వలన రచనాప్రణాళికకు ఆదినుండి తుదివరకు ఏకాకృతి యేర్పడి విషయ సమగ్రత సమకూరుననను సంకల్పముతో ఈరెండింటినికూడ చేర్చుట జరిగినది.

ప్రధానరంగములో మరల రెండు భాగములున్నవి, క్రీ.శ. 1879 నుండి 1938 వరకు ఒక భాగము. ఇందు కలిశకమునందలి 84వ కాలచక్రము యొక్క 60 సంవ

త్సరములచరిత్ర పొందుపరచబడినది. 1939 నుండి 1950 వరకు మరొకభాగము. ఇందు కలిశకమునందలి 85వ కాలచక్రముయొక్క మొదటి 12 సంవత్సరముల చరిత్ర పేర్కొనబడినది. ఈరెండును కలిపి మొత్తము 72 సంవత్సరముల చరిత్ర యన్నమాట. ఈరెండు కాలచక్రముల విశ్లేషణ తేదీలువేసి చూపబడినది.

ఇందులోనే భాషావికాసచరిత్ర, సాహిత్య వికాసచరిత్ర అను మరొక విభాగమును గూడ గమనింపవచ్చును. మొదటిదానిలో భాషాభివృద్ధికి, ప్రచారమునకు ఎందరెందరో మహనీయులు చేసినకృషి పేర్కొనబడినది. రెండవదానిలో కవులు, వారిగ్రంథములు ఆయామహనీయుల కవితాసౌందర్యము మొదలగునవి సోదాహరణముగ చర్చింపబడినవి.

సాహిత్యవికాస చరిత్ర ప్రకరణము ఏడుయుగములుగా విభజింపబడుట ప్రత్యే కించి గమనింపవలసిన విషయము. ఇది ప్రధానముగ కాలసరణిని బట్టియు, కొన్ని యెడల హేతుసరణిని బట్టియు, మరికొన్నియెడల రెండింటిని బట్టియు చేయబడినది. ఇందలి సౌకర్యమును, సామంజస్యమును చదువరులు సులభముగనే గ్రహింపగలరు.

క్రీ.శ. 1875 నుండి మాకుటుంబమునకు హైదరాబాదుతో ఆత్మీయతాను బంధములున్నవి. గుంటూరుజిల్లానుండి వచ్చిన మాతాత ఓగేటి సీతారామయ్యగారు మిలటరీలో ఉద్యోగము చేసిరి. 1885 ప్రాంతమున బొలారములో నొక శివాలయమును కట్టించిరి. మరొక తాత ఓగేటి రామకృష్ణయ్యగారు సికిందరాబాదు మహబూబ్ కళాశాల హైస్కూలులో 1890 ప్రాంతమున లెక్కల టీచరుగాపనిచేసిరి. మాతండ్రిగారు కీ.శే సాంబమూర్తిగారు 1920-30 మధ్యకాలమున సికిందరాబాదులోని నల్లగుట్ట ప్రాథమిక పాఠశాలలో టీచరుగా పనిచేసిరి. నావిద్యావ్యాసంగము హెచ్. ఎస్. సి. నుండి పిహెచ్. డి. వరకు ఉస్మానియా విశ్వవిద్యాలయముతో ముడివడియున్నది. ఇట్టి ఆత్మీయతానుబంధములను పురస్కరించుకొని ఒకానొక ప్రేరణతో ఈ గ్రంథమును వ్రాసితిని.

ఈగ్రంథమును పూజ్యులు శ్రీ శ్రీ రామ్ శ్రీపాదసాఠేగారికి అంకితమిచ్చుట నా మహద్భాగ్యముగ భావించుచున్నాను. శ్రీసాఠేగారు 1920లో మహారాష్ట్రమునందలి సతారాజిల్లాలోని వాయీ క్షేత్రమున జన్మించిరి. వాయీలోను, బొంబాయిలోను విద్యాభ్యా సముచేసిరి. 1942లో బొంబాయి యూనివర్శిటీనుండి బి.ఎస్.సి. డిగ్రీ పుచ్చుకొనిరి. పిమ్మట ఆజన్మబ్రహ్మచారిగా దేశసేవచేయుటకు నిశ్చయించుకొని రాష్ట్రీయ స్వయం సేవక సంఘములో పూర్తికాలపు ప్రచారకులై (**Full-time Orgoniser**) జాతీయ పునర్నిర్మాణకార్యమునకు అంకితమై పోయిరి. తొలుత బొంబాయిలో పనిచేసిరి. 1948

లో హైదరాబాదుపై పోలీసుచర్య జరిగిన అనంతరము హైదరాబాదుకు వచ్చిరి. ఆంధ్ర ప్రదేశమునకు సన్నిహితులైరి. తెలుగువారిలో నొకరై పోయిరి.

శ్రీసాఠేగారు మహారాష్ట్రీయులైనను స్వయంకృషితో తెలుగుభాషను నేర్చుకొనుటయేగాక గ్రంథములనుకూడ వ్రాయుట ఆశ్చర్యకరమైన విషయము. "ఛత్రపతి శివాజీ" "హిందూ విజయ దుందుభి" అన్న రెండు గ్రంథములను 1970కి పూర్వమే వారు వ్రాసిరి. ఇటీవల ఆంగ్లభాషలో "మహాభారతయుద్ధ కాలనిర్ణయము" "మౌర్య చంద్రగుప్తుని కాలనిర్ణయము" అను రెండు గ్రంథములను వ్రాసిరి. ఈ గ్రంథము లన్నియు మేధావులమన్ననలనుబడసినవి. వారెచ్చటనున్నను స్థానికులతో కలిసిపోవుట, వారి భాషల నభ్యసించుట, స్థానిక చరిత్రలను అధ్యయనముచేయుట, గ్రంథరచనకు ఇతరులను ప్రోత్సహించుట వారి ప్రవృత్తి. నాకును శ్రీసాఠేగారికిని గత ముప్పదిసంవత్సరములనుండి సన్నిహిత సంబంధమున్నది: ఆబాల్యము నాలో రాజుకొనుచున్న సామాజికస్పృహను మరింత పెంచి పోషించిన ప్రముఖులలో వారొకరు. నాసాహిత్యవ్యాసంగమునుకూడ వారు ప్రోదిచేసిన సందర్భములున్నవి. వ్యక్తులకు సరియైన మార్గదర్శనముచేసి దిద్దితీర్చుటలో వారగ్రగణ్యులు.

ప్రస్తుతము గత కొన్ని సంవత్సరములుగా సాఠేగారు శ్రీబాబాసాహెబ్ ఆప్టే స్మారకసమితి తలపెట్టిన ఇతిహాససంకలన యోజనకు—ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, గోవా ప్రాంతములకు పర్యవేక్షకులుగా నున్నారు.

వారే నన్నీ గ్రంథమును వ్రాయుటకు ప్రోత్సహించిరి. హైదరాబాదు నగరముతో మాకుటుంబమునకున్న ఆత్మీయతను పురస్కరించుకొని వ్రాసితిని. వారికేఅంకిత మీయదలచితిని. నాపై వాత్సల్యముతో వారంగీకరించిరి. ఇది వారికి సమర్పితమైనది.

ఈగ్రంథమును "భాగ్యనగర భారతి"అని పేర్కొన్న ఆస్థానకవి కళాప్రపూర్ణ డా॥ దాశరథి, డి. లిట్ గారికి, ఆశీస్సులు కురిపించిన సిటీగ్రంథాలయసంస్థ అధ్యక్షులు శ్రీ మామిడి భోజిరెడ్డిగారికి, శుభాకాంక్షలు తెలిపిన ఆంధ్ర సారస్వతపరిషదధ్యక్ష సారథి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను. నాయీ గ్రంథరచనా పరిశోధనలో ఎక్కువగా నుపయోగపడిన ఆంధ్రసారస్వతపరిషత్ గ్రంథాలయసరస్వతికి నమస్కరించుచున్నాను ఈగ్రంథ ముద్రణభారమును సొంత పనిగా భావించి నిర్వహించిన బృందావన్‌ప్రెస్ యజమాని శ్రీ కె. బి. సోమయాజులు గారికి ధన్యవాదములు తెలియజేయుచున్నాను.

# అనుక్రమణిక

# హైదరాబాదు నగర తెలుగు భాషా సాహిత్య వికాస చరిత్ర

## పూర్వ రంగము

### శా.శ. 1047 — 1800 = క్రీ.శ. 1125 — 1875

అది శాలివాహన శకం. 1047 నుండి 1247 వఱకు (క్రీ.శ. 1125–1325) రమారమి రెండువందల సంవత్సరములకాలము ఓరుగల్లు రాజధానిగ సర్వోత్కర్షంతో వర్థిల్లిన కాకతీయ సామ్రాజ్యం ఈ రాజన్యులలో కడపటివాడైన ప్రతాపరుద్రుని కాలమున పతనమైన పిమ్మట తెలంగాణమాగాణము బహమనీసుల్తానుల ఏలుబడిలోనికి వచ్చినది. ఈ సుల్తానులలో చివరివాడైన షితాబుద్దీన్ మహమ్మద్ పరిపాలనా కాలములో (శా.శ. 1404–1440 = క్రీ.శ. 1482–1518) ఈ ప్రాంతమునకు గవర్నరుగా నియమింపబడిన వ్యక్తి ఇరాన్ దేశీయుడగు కులీహమ్దాని అనువాడు. ఈతడు కుతుబ్-ఉల్-ముల్క్ అను బిరుదనామముతో శా. శ. 1420లో (1498) గవర్నర్ పదవి నధిష్ఠించెను. బహమనీసుల్తాన్ షితాబుద్దీన్ శా శ. 1440లో (1518) మరణించిన వెంటనే యీతడు స్వాతంత్ర్యమును ప్రకటించుకొని గోల్కొండ రాజధానిగ రాజ్యమును పరిపాలింప దొడగెను. అది మొదలుకొని శా శ. 1609 వఱకు (1687) సుమారు నూట డెబ్బై సంవత్సరముల కాలము నిరాఘాటముగా నిచట కుతుబ్షాహీ సుల్తానుల పరిపాలన కొనసాగినది. ఈ రాజుల వరుసక్రమ మిట్లున్నది.

(1) సుల్తాన్ కులీ కుతుబ్షా, శా.శ. 1440-1465 = క్రీ. శ. 1518-1543,
(2) జమ్షిద్ కులీకుతుబ్షా[1] శా. శ. 1465-1472 = క్రీ. శ. 1543-1550.

1. రెండవ సుల్తాను జమ్షీదుకు పిమ్మట ఆతనికొడుకు సుభాన్ఖాన్ అనువాడు రెండు సంవత్సరములలోపు స్వల్పకాలము పదవికెక్కెను. కాని చరిత్రకారులు దానిని పరిగణించుటలేదు.

(3) ఇబ్రహీం కులీ కుతుబ్షా, శా. శ. 1472-1502 = క్రీ. శ. 1550-1580. (4) మహమ్మద్ కులీ కుతుబ్షా, శా. శ. 1502-1533 = క్రీ. శ. 1580-1611. (5) సుల్తాన్ మహమ్మద్ కులీ కుతుబ్షా, శా. శ. 1533-1548 = క్రీ. శ. 1611-1626. (6) సుల్తాన్ అబ్దుల్లా కులీ కుతుబ్షా, శా. శ. 1548-1594 = క్రీ. శ. 1626-1672 (7) సుల్తాన్ అబ్దుల్ హసన్ "తానీషా" శా. శ. 1594-1609 = క్రీ. శ. 1672-1687.

## గోల్కొండ కథనము

గోల్కొండ చరిత్ర చాలా ప్రాచీనమైనది. ఆదిరాజు వీరభద్రరావుగారి కథనమునుబట్టి[1] దీనికి పూర్వకాలములో 'మానుగల్లు' అను పేరుండెను. ఈ మానుగల్లొక కుగ్రామము. కాకతీయులలో నొకానొకడు మానుగల్లున నొక మట్టికోటను కట్టించెను. దానికి మానుగల్లు కోట అనియే పేరుండెను. దరిమిలా గోల్కొండ సుల్తానులలో మొదటివాడగు కులీ కుతుబ్షా ఇట రాతి కోటను కట్టించి దానికి "మహమ్మదు నగరమని" నామకరణము చేసెను. క్రీ. శ. 1578 ప్రాంతమున దీనికి మహమ్మదు నగరమని పేరుండినట్లు ఒక శాసనమువల్ల తెలియుచున్నది.

ఇదిట్లుండగా "మోతీవైర్-ఉలిమ్ గిరి" కథనమును బట్టి[2] మరొక విధమగు వృత్తాంతము తెలియుచున్నది. దీనికి మొట్టమొదట "మాంకాళి" అను పేరుండెడిది. కొండపై వెంచేసియున్న మహంకాళి దేవతను బట్టి యీ పేరు వచ్చినది. ప్రాచీనకాలము నుండియు నిచట ప్రతి సంవత్సరము అమ్మవారి కొలుపులు, జాతరలు బోనాల పండుగలు జరుగుచుండెడివి. ఇప్పటికినీ యీ దేవాలయముండుటయు ప్రతియేడు బోనాల పండుగ జరుగుటయు స్థానికులకు తెలిసిన విషయమే. దరిమిలా ఓరుగల్లు రాజులలో నొకడైన దేవరాజు మట్టిగోడలతో నిట కోటను కట్టించెను. పిమ్మట పూర్వోక్త ప్రకారము సుల్తాన్ కులీ కుతుబ్షా దృఢమైన రాతికోటను నిర్మించెను.

ఇక్కడొక చమత్కార జనకమైన మిక్కిలి ప్రచారములోనున్న కట్టుకథవంటి స్థానికగాథను గూర్చి ముచ్చటింపవలసియున్నది. సుల్తాన్ కులీ కుతుబ్షా రాజ్యమునకు వచ్చిన పిమ్మట శత్రువులకు దుర్భేద్యమైన ఒక కోటను కట్టింపదలచి తగిన

1. ''మన తెలంగాణము'' గోలకొండ కోటను గూర్చి - పుటలు 68, 69.
2. ''గోలకొండకోట'' వ్యాసము, శ్రీ కె. వి. హనుమంతరావు, 'ఆంధ్రప్రదేశ్' ప్రభుత్వ తెలుగు మాసపత్రిక, ఆగస్టు-సెప్టెంబర్ 1972.

తావునకై అన్వేషించుచుండెను. ఒక పసులకాపరి-గొల్లవాడు ఈ కొండను చూపించి యిక్కడ కట్టవలసినదని చెప్పి సదరుస్థల మాహాత్మ్యమును గూర్చిన నిదర్శనములను కూడ నిరూపించెను. సుల్తానుకు నమ్మకము కుదిరి యిప్పటి రాతికోటను కట్టించెను. గొల్లవాడు చూపించిన కొండపై నిర్మింపబడినందున దీనికి గొల్లకొండ యను పేరు వచ్చినది. అది వ్యవహారక్రమమున గోలకొండ, గోల్కొండ అయినది. ఈ కథనము చరిత్రకారుల గ్రంథములకెక్కి శంఖున బోసిన తీర్థమైనది.

## గోల్కొండ-భాగీరథీ పట్టణము

ఇదెట్లుండ మధ్యలో దీనికి భాగీరథీ పట్టణము అను పేరు కూడ వచ్చిన వైనము తెలియుచున్నది. ఈ సుల్తానులలో మూడవవాడైన ఇబ్రహీం కులీ కుతుబ్షా భాగీరథి అను పేరుగల ఒక హిందూ తెలుగు పడుచును ప్రేమించి పెళ్ళి చేసుకొనెను. ఆమెపై గల మక్కువతో గోల్కొండకు భాగీరథీ పట్టణమను పేరు పెట్టెను. శా.శ. 1502వ సం॥ (1580) ప్రాంతమువాడైన సారంగు తమ్మయ్య అను తెలుగు కవి గోల్కొండకు కరణముగా నుండెను. ఈతడు తొలుత వైజయంతీ విలాసము అను తెలుగు ప్రబంధమును వ్రాసెను. అందలి పీఠికలో నీక్రింది పద్యమునతాను గోల్కొండకు కరణమునని చెప్పుకొనెను.

> ఇన సముతేజు లౌన్నృపులనెల్ల మహమ్మదు శాహి యేలునీ
> యెసఁబరు నాల్గు దుర్గములఁ నేలిన యేలిక గోలుకొండ ప
> ట్టన నగరస్థలిన్ గరణికం బొనరించెడు దమ్మమంత్రి యా
> జనపతి రమ్మ్ర పౌమ్మన ప్రజల్ జయవెట్ట గృహస్థులౌననన్
>
> వైజయంతీవిలాసము 1-3

ఈ కవియే మరికొన్నాళ్ళకు మలుత హరిభక్తి సుధోదయమను గ్రంథమునకు భక్త సంజీవనీ అను పేరుతో సంస్కృతమున నొక వ్యాఖ్యాన గ్రంథమును వ్రాసెను. అందలి ఈ క్రింది శ్లోకమున తాను భాగీరథీ పట్టణమునకు మంత్రినని చెప్పికొనినాడు;

> యస్యోదార్యమివాకలయ్య సలిలం కుర్వంతి వాసం దివి
> స్వర్ధేను ప్రముఖా వదాన్యమణయో వ్యద్యాపి నేహాగతాః
> శ్లాఘ్యస్సాధు గుణాన్వితోబుధ జనైర్భాగీరథీ పట్టణే
> సోయం మంత్రి ధురంధరో విజయతే సారంగు తమ్మ ప్రభుః.

(ఏ సారంగు తమ్మయ్య యొక్క ఔదార్య గుణమును అర్థము చేసికొన్నవిపలె స్వర్గమునందలి కామధేనువు, కల్పతరువు, చింతామణి మొదలయినవి అప్పుడుగాని ఇప్పుడుగాని భువికిదిగిరాక దివియందే నిత్య నివాసము చేయుచున్నవో సాధుగుణ సమన్వితుడును, బుధజనులచేత శ్లాఘింపబడుచున్నవాడును, మంత్రి ధురంధరుడును అయిన ఆయీ సారంగు తమ్మయ్య ప్రభువు భాగీరథీ పట్టణమున సర్వోత్కర్షలతో వర్ధిల్లుచున్నాడు.)

తొలుత వ్రాసిన పద్యమును బట్టియు, మలుత వ్రాసిన శ్లోకమునుబట్టియు గోల్కొండకు భాగీరథీ యను నామాంతరమున్నట్లూహింపవచ్చును. ఈ రెండు గ్రంథములు వ్రాయుటకు గల మధ్యకాలమున ఇబ్రహీం కుతుబ్షా దీనికి పేరు పెట్టి యుండును. అందువలన అక్కడ గోల్కొండకు కరణమునని పేర్కొన్న కవి ఈ మధ్యకాలమున వచ్చిన మార్పును సూచించుచూ ఇక్కడ భాగీ థీపట్టణమునకు మంత్రి నని ప్రకటించుకొనినాడు ఇక కరణము మంత్రి యను మాటలను సమానార్థకము లుగా భావింపవచ్చును. లేదా ప్రభువు నన్ుగ్రహమునకు పాత్రుడైన ఈతడు పిమ్మట నొక చిన్న మంత్రి పదవిని సంపాదించుకొని యుండవచ్చును. అతని తండ్రి తాతలు కూడ మంత్రి పదవులను నెఱపినట్లు గ్రంథస్థమై యున్నది. కావున ఎట్లనుకొన్నను సమన్వయము సరిపడును. 'మహమ్మా' అను పారసీక గ్రంథమున కూడ ఈ భాగీరథీ ప్రసంగమున్నదట. సారంగు తమ్మయ్య యిచ్చిన ఈ ఆచూకీని పట్టుకొని గోల్కొండకు భాగీరథీ పట్టణమను పేరున్నట్లు కనిపెట్టి దానికి సంబంధించిన లోతులు త్రవ్వి సర్వవిషయమును మొదట వెలుగులోనికి తెచ్చినవారు ఆచార్య డా॥ బి. రామ రాజుగారు[1] అది ప్రామాణికముగా పరిగ్రహించి తమ గ్రంథమున పేర్కొన్నవారు శ్రీ ఆరుద్రగారు.[2]

## భాగీరథీ పట్టణము-భాగ్యనగరము

ఇబ్రహీం కుతుబ్షాకు భాగీరథి యను భార్యయందు జన్మించిన కుమారుడే మహమ్మద్ కులీ కుతుబ్షా. ఈతడు తండ్రి తదనంతరము సింహాసన మధిష్ఠించెను.

---

1. భాగీరథీ పట్టణము-భాగ్యనగరము—వ్యాసము. కుతుబ్షాహీ సుల్తానులు-ఆంధ్ర సంస్కృతి, పుటలు 74-75. ఇదే విషయమును 1985 లో 'ఆచార్య బిరుదురాజు రామరాజుగారి షష్ట్యబ్దిపూర్తి సన్మాన సంఘంవారు' ప్రచురించిన, శ్రీ రామరాజుగారే వ్రాసిన 'చరిత్ర కెక్కని చరితార్థులు' అన్న గ్రంథమున, 'సారంగు తమ్మయ్య' అను వ్యాసమునందు కూడ కొంత స్పృశించిరి. పుటలు 164-168.
2. సమగ్రాంధ్ర సాహిత్యం, VIII సంపుటం, నవాబులయుగం.

పదవికెక్కిన పదకొండేళ్లకు శా.శ. 1513లో (1591) ఈతడు హైదరాబాదు నగరమును, చార్మినార్‌ను కూడ నిర్మించెను. హైదరాబాదునగర నిర్మాణమునకు దారి తీసిన ఆసక్తిదాయకమైన కట్టుకథ వంటి యథార్థ చారిత్రక కథనమొకటున్నది. ఈ మహమ్మద్ కులీ కుతుబ్షా యువరాజుగా నున్నప్పుడు చార్మినార్ ప్రాంతమందు నివశించు చుండిన భాగమతి అనుపేరుగల ఒక హిందూ తెలుగు పడుచును ప్రేమించెను. ఆమెను కలుసుకొనుటకై ప్రతిరోజు గోల్కొండనుండి బయలుదేరి మూసీనదిని దాటి అక్కడికి వచ్చి పోవుచుండెడివాడు ఈ సంగతి తండ్రికి తెలిసి మొదట కొడుకును కొంత కట్టడి చేసెను. ఇట్లుండ నొకసారి మూసీనదికి వరద పొంగినది. అయినను ఆతడు లెక్క చేయక తెగించి నదిని దాటివెళ్ళి ఆమెను కలుసుకొనెను. ఇది తెలిసి తండ్రి హృదయము తల్లడిల్లిపోయెను. వెంటనే కొడుకు రాకపోకలకు వీలుగా మూసీనదిపై వంతెనను కట్టించెను. అదియే యిప్పటి పురానాపూల్ అని చెప్పుదురు. తదుపరి కొన్నాళ్ళకు భాగమతీ మహమ్మద్ కులీల వివాహమైనది. ఆతడు శా. శ. 1502 లో రాజ్యమున కొచ్చిన పిమ్మట సుమారు పదకొండేళ్ళకు 1513 లో తన ప్రేయసియు, భార్యయునైన భాగమతిపేర భాగనగరము, లేక భాగానగరము అను పట్టణమును నిర్మించెను. అది వ్యవహారమున భాగ్యనగరమైనది. గోల్కొండకుగల భాగీరథి నామమే యీ నూతన నగరమునకు కూడ వర్తించి భాగ్యనగరముగా మారినదా ? లేక భాగనగరమే భాగ్య నగరముగా మారినదా? అన్న కుతూహల భరితమైన విచికిత్స పరిశోధకుల కున్నట్లు తోచుచున్నది. చిత్రమేమన తండ్రి ప్రేయసి పేరు భాగీరథి. కొడుకు ప్రియురాలి పేరు భాగమతి రెండును అక్షరసామ్యము ధ్వనిసామ్యము, ఉచ్చారణ మాధుర్యము గలిగి సారూప్యతను సంతరించుకొన్నవి. ఇర్వురును హిందూ కుటుంబమునకు చెందిన తెలుగుపడుచులే. వీరు సుల్తానుల పాలబడుట మన యదృష్టమో, దురదృష్టమో యను విషయమును దృక్పథ భేదమునుబట్టి పాఠకుల నిర్ణయ ప్రతిభకు వదలివేయుట లెస్స. ఇర్వురూ మన తెలుగు తల్లులే యగుటయు, వారి పేరున ఈ నగర నిర్మాణము జరుగుటయు గుడ్డిలో మెల్లగ మనకు కొంత ఊరట కలిగించు విషయమనుటలో విప్రతిపత్తి లేదు.

## భాగ్యనగరము - హైదరాబాదు

మహమ్మద్ కులీ కుతుబ్షాకు భాగమతియందు జన్మించిన కొడుకులలో హైదర్ అను వాడొకడు. భాగమతి మరణించిన పిమ్మట ఈ సుల్తాను శా. శ. 1519 ప్రాంతమున భాగ్యనగరమను పేరు మార్చివేసి ఆ కొడుకుపేర దీనికి హైదరాబాదను పేరు

పెట్టినట్లు పలువురు చరిత్రకారుల వక్కాణ. శ్రీ అరుద్రగారు మూ(సీ)ము మహమ్మద్ కులీ కుతుబ్షా "రాజ్యానికి వచ్చాక తన ప్రేయసి భాగమతికి "హైదర్‌మహల్" అనే బిరుదు ఇచ్చాడు. ఆమె పేరుమీదగా భాగానగరం లేక హైదరాబాద్ అనే పెద్ద నగరం కట్టించాడు" అని పేర్కొనిరి[1] ఇదే మేత్రిమైనది. సరియైనది. ఛత్రపతి శివాజీ శా.శ. 1598లో (క్రీ.శ. 1676 ప్రారంభమున) హైదరాబాదు నగరమునకు విచ్చేసిన విషయము సుప్రసిద్ధము. అప్పుడు కుతుబ్షా రాజులలో చివరివాడైన అబ్దుల్‌హసన్ "తానీషా" గోల్కొండను పాలించుచుండెను. శివాజీ లాంఛనముగా గోల్కొండకోటను దర్శించినను అప్పటికే గోల్కొండ దర్బారు హైదరాబాదు నగరమునందే జరుగుచుండెడిది. శివాజీ సుల్తానులమధ్య జరిగిన సంప్రదింపులు హైదరాబాదు దర్బారులోనే జరిగినవి. అప్పటికే యీ రెండు నగరములేకమై పోయినవి ఆ రోజులలో ఈ రెండు నగరముల వైభవమును గూర్చియు శివాజీ రాక సందర్భమున జరిగిన కోలాహలమును గూర్చియు డెన్నిస్ కిన్‌కైడ్ అద్భుతముగా వర్ణించినాడు[2]

## హైదరాబాదు-సికిందరాబాదు

గోల్కొండకు హైదరాబాదు, హైదరాబాదునకు సికిందరాబాదు క్రమముగా వృద్ధిచెందిన అనుబంధనగరములు సికిందర్ అన్నది యోధుని పరాక్రమ సూచక పదము. సికిందరాబాదును వెనుకటి తరములవారు ఇప్పటికినీ లష్కర్ అని పిలుచుట కద్దు. ఈ రెండు పేర్లు సైనిక స్థావరమగుటకు సంకేతములు. రెండు శతాబ్దములకు పైబడుకుగా నివి కంటోన్మెంటు నగరమనుట తెలిసిన విషయమే. నిజాం నవాబులలో మూడవవాడైన సికిందర్‌ఝా శా.శ. 1724 నుండి 1750 వరకు హైదరాబాదును పాలించెను. ఈతని పేరే ఈ నగరమునకు పెట్టబడినది. అంతకు ముందు దీనిపేరు ఏదో మృగ్యము. దాదాపు రెండు శతాబ్దులకు పైగా నిది బ్రిటిషువారి స్వాధీనములో నుండినదగుటవలన హైదరాబాదు నగరసంస్కృతికంటె భిన్నమైన సంస్కృతి యిట వర్ధిల్లినది.

## కుతుబ్షాల తెలుగుభాషా పోషణ

గోల్కొండ సుల్తానుల కాలమున నిచట పార్శీ రాజభాషగా నుండెను. అయినను వారు స్థానిక భాషయగు తెలుగును గౌరవించి తగిన ప్రతిపత్తిని యిచ్చినట్లు తెలియు

1. సమగ్రాంధ్ర సాహిత్యం VIII సంపుటం, పుట 14.
2. ది గ్రాండ్ రెబెల్-ఛాప్టర్ 20.

చున్నది. కీ.శే. సురవరం ప్రతాపరెడ్డిగారు "కుతుబ్షాలు తాము వ్రాయించే సనదులు పార్సీలో వ్రాయించి యిచ్చినా ఆ విషయాలనే తెలుగులో కూడ వ్రాయించి యిచ్చేవారు. తెలుగు మండలంలో తెలుగుద్వారానే రాజ వ్యవహారాలు జరిపించారు."[1] అని పేర్కొనుట గమనింపదగినది. ఈ సుల్తానులు హిందువులకు సంబంధించిన యితర విషయములలో తక్కిన తురుష్కులందరివలె చాలా ముష్కరముగా ప్రవర్తించిన ఘట్టములు అనేకమున్నవి. కాని తెలుగుభాషా పోషణ విషయమున మాత్రము మిక్కిలి ఔదార్యముతో వ్యవహరించిరి. అయితే సుల్తానులందరు ఇట్టి ఔదార్యమును ప్రదర్శించిన వైనము కానరాదు. కొందరికి మాత్రమే ఈ గౌరవము దక్కినది. వారిని గూర్చి మాత్రమే యిట ప్రస్తావింపబడును.

## సుల్తాన్ కులీ కుతుబ్షా

మొదటి పాలకుడగు నీతడే తెలుగుభాషా పోషణకు తొలుత పునాది పెట్టినట్లు కాన్పించుచున్నది. ఈతడు ఈడూరి ఎల్లనామాత్యుడను వానికి "కోర్కొలను" అను గ్రామమును దత్తము చేసినాడు. ఈ యెల్లన "చతురవచోరచనాతి ప్రతిభా సుకవిత్వ తత్త్వ పారీణుడట." అయితే ఈతని గ్రంథములు మృగ్యములు. వీనికి శంకరకవి తన హరిశ్చంద్రోపాఖ్యానమును అంకితమిచ్చినాడు.

శంకరకవి శా.శ. 1472 (క్రీ.శ. 1550) ప్రాంతమువాడు. "హరిశ్చంద్రోపాఖ్యానము", "భవానీ మనోహర వచనములు" అను నామాంతరముగల "శంకర వచనములు" ఈతని కృతులు. శంకర వచనములు శైవ వాఙ్మయమున విశిష్ట స్థానము నాక్రమించినవి. హరిశ్చంద్రోపాఖ్యానము ప్రసిద్ధి చెందిన ప్రబంధము. ఇది సుమారు వెయ్యి పద్యగద్యములు గలిగిన అయిదాశ్వాసముల కావ్యము. ఈ కవి తాను "శశాంక మౌళి పదసేవాలబ్ధ సాహిత్య సద్ధనుడ"ననియు, "నిరాఘాట వచోధురంధరుండ" ననియు ప్రకటించుకొనినాడు. (హరి. 1-19). ఈతని శైలి రస పరీవాహమై ప్రౌఢ సుందరముగా నుండును. మచ్చునకు రెండు పద్యములు;

కాటి సుంకము చెల్లించిననేగాని తన కొడుకు లోహితుని శవదహనమునకు వీలు కాదని హరిశ్చంద్రుడు అనుమతిని నిరాకరించినప్పుడు చంద్రమతి ఏడ్చిన పద్యమిది -

---

1. అయ్యంకి వెంకటరమణయ్యగారి సన్మాన సంచికయందు 'కుతుబ్షాహీల ఆంధ్ర భాషా పోషణము' అను వ్యాసమునందు—

అకటా! చేరెడునేలకుండగడె సప్తాంభోధివేష్టితవ
త్సకలద్వీపకలాప భూపమకుటాంచత్పద్మరాగోజ్వల
ప్రకటానర్గళ నిర్గళత్కిరణ శుంభత్పాదుడైనట్టి రా
జకుమారుండని యేడ్చెగన్నుగవ నశ్రుల్కాల్వలై పాఱగన్ ఆ.5.

తాను కడు దరిద్రురాలిననియు, కాటిసుంకము చెల్లింపలేనననియు, ఎట్లయినను కరుణించి శవదహనమున కనుమతిని ప్రసాదింపుమనియు ఆమె బ్రతిమాలినప్పుడు హరిశ్చంద్రుడిచ్చిన సమాధానమిది:

హరపద పూజకుం దొలగి యంత్యజుగొల్చి కులాభిమానముల్
సరగున వెచ్చబెట్టి హరిచందన కీర్తులు వీట బుచ్చి దు
ష్కరమగు వల్లకాటి కధికారము వచ్చిన దుష్టబుద్ధికిన్
గరుణదలంప నెక్కడిది గంధగజేంద్ర సమానగామినీ (హరి-5-92)

పద్యమంతయు మంచి కట్టుబడిలో నున్నది. కాని చిట్టచివరికి చేసిన ''గంధగజేంద్ర సమాన గామినీ'' అన్న సంబోధన సందర్భమునకు తగినట్లు లేక అనౌచిత్య దోషమునకు గురియగుచున్నది. ఇంత గొప్ప పద్యములో నిట్టి జారుపాటుండుట విచారకరము![1]

ఇట్టి మంచి కవులను తాను ప్రత్యక్షముగనో, తన ఆశ్రితులయిన ఈడూరి యెల్లనామాత్యునివంటి వారిద్వారా పరోక్షముగనో ప్రోత్సహించిన పరిపాలకుడు సుల్తాన్ కులీ కుతుబ్షా.

---

1. తెలుగు నాటకరంగమున ఈ గ్రంథ రచయితకు గురువులైన నటయోగి కీ.శే. మల్లాది సూర్యనారాయణగారు ఆంధ్రదేశమున హరిశ్చంద్ర పాత్రకు పెట్టినదిపేరు. వారు ఈ ఘట్టమున బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారి హరిశ్చంద్ర నాటకములోలేని యీ శంకర కవిపద్యమును జంఝూటీ రాగములో అద్భుతముగ చదివినప్పుడు రసానందమున తడిసి ముద్దయైపోవని ప్రేక్షకులుండెడివారుకారు. కాని వారు ఈ సంబోధనను మాత్రము విడిచిపెట్టి 'కరుణతలంప ఎక్కడిది' అన్నచోట ఆపి ఆ మాటను రాగములో చిత్రముగ సుడిదిప్పి పరాకాష్ఠకు తెచ్చి శ్రోతలను పరవశులను చేసెడివారు. ఆ మహనీయునికి జోహార్లు.

## ఇబ్రహీం కులీ కుతుబ్షా

మూడవ సుల్తానగు ఈతని పరిపాలనా కాలమున తెలుగు కవులకు ఏ ముస్లిం ప్రభువు, మున్నెన్నడు ఇవ్వని గొప్ప ప్రోత్సాహము లభించినది. ఈతడింతటి గొప్ప తెలుగుభాషా పోషకుడగుటకు కారణమిది: మొదటి సుల్తానైన కులీ కుతుబ్షాకు, హైదర్‌కులీ, కుతుబుద్దీన్, జంషీద్, ఇబ్రహీం అను నలుగురు కొడుకులుండిరి. సుల్తాను తన తదనంతరము పెద్ద కొడుకు హైదర్ కులీని రాజుగా చేయదలచెను. కాని మూడవ కొడుకగు జంషీదు తండ్రిని బంధించి, అన్నలిద్దరినీ చంపించి తానే రాజయ్యెను. తమ్ముడగు ఇబ్రహీంను కూడ చంపించుటకు కుట్ర పన్నుచుండగా నాతడు తప్పించుకొని పారిపోయి విజయనగర సామ్రాజ్య పాలకుడైన అళియ రామ రాయల నాశ్రయించి యేడు సంవత్సరములు తలదాచుకొనెను. అప్పుడచ్చట తెలుగు భాషను నేర్చుకొనెను. అచటి తెలుగు కవుల సాహచర్యమున తెలుగు సాహిత్యపు రుచి మరిగెను. అన్న జంషీదు మరణించిన పిమ్మట గోల్కొండకు తిరిగివచ్చి తానే సుల్తానయ్యెను. (శా.శ. 1472-1502 = క్రీ.శ. 1550- 580) తెలుగు సాహిత్యమును పోషించెను. చిరకీర్తిని సంపాదించుకొనెను.

## అద్దంకి గంగాధరకవి

ఈతని యాస్థాన కవులలో అద్దంకి గంగాధరకవి అగ్రగణ్యుడు. ఈతడు తన తపతీ సంవరణోపాఖ్యానము''ను ఐదాశ్వాసముల ప్రబంధమును ఈ సుల్తానుకు అంకిత మిచ్చినాడు. ఒక ముస్లిం ప్రభువునకు తన గ్రంథము నంకితమిచ్చిన తొలి తెలుగుకవి యీతడేయని పలువురు పరిశోధకుల నిర్ణయము. కాని యింతకుముందే పెక్కు కృతులు తాను అంకిత మందినట్లు ఇబ్రహీం చెప్పిన మాటగా గంగాధరుడు వ్రాసిన యీక్రింది పద్యమువలన తెలియుచున్నది :

పెక్కుకృతుల్ చమత్కృతులు పెంపుగ నందితిగాని నీదుస
మ్యక్కృతి కన్యపైగల మమత్వము పత్తిలదెందు లెక్కకుం
బెక్కువగాగ గోపికలు మించిపసించిననేమి రాధపై
మక్కువ యెక్కువై మిగుల మన్ననసేయడె శౌరివేడుకన్, ఆ. 1-18

గోపికలు ఎంతమంది ఉన్నను కృష్ణునకు రాధపైనే యెక్కువ మక్కువ యున్నట్లు లోగడ తానెన్ని గ్రంథములను అంకిత మందినను గంగాధరుని తపతీ

సంవరణోపాఖ్యానము పైననే తనకు మక్కువ యెక్కువయట. కావున తనకా ప్రబంధము నంకిత మియ్యమని యాతడు గంగాధరుని కోరెను. ప్రభువు కోర్కెను ఆతడు నెరవేర్చెను. దీనిని బట్టి యింతకుముందే కొందరు కవులు తమ తమ ప్రబంధముల నీతనికంకిత మిచ్చినట్లు తెలియుచున్నది కాని యవి మఱుగున బడిపోయినవి. ఈతని యాస్థానములో దిగ్గంతులవంటి పండితులుండెడివారని మాత్రము తపతిలో గంగాధరుడు చెప్పిన యీ పద్యమునుబట్టి తెలియుచున్నది ;

> సకల వేదపురాణ శాస్త్రపారగులైన
>     యింటరి విద్వాంసు లొక్కవంక
> సప్తభాషలయందు నాధ్యంబు లేకుండు
>     హొంతకారి కవీంద్రు లొక్కవంక. ఆ. 1-14.

గంగాధరుడు తపతీ సంవరణ కృత్యారంభ పద్యమున ఇబ్రహీంను ఆశీర్వదించిన విధము నారయుడు :

> శ్రీసతిమించుగాక తులసీదళమాలిక కౌస్తుభోజ్జ్వలం
> బై సుర చాపలీల చెలువందగ వేణురవంబు గర్జితం
> బై సొబగొంద శౌరి ఘనుడై కరుణారసవృష్టిచే నిరా
> యాసత బోచుగావుత నృపాగ్రణి మల్కిభరాము శాంతిపున్ ఆ. 1-1.

శ్రీదేవి మెఱుపుగ, కౌస్తుభమణికాంతులచేత ఆప్లావితమైన తులసీమాల ఇంద్రధనుస్సుగ. వేణుగానమే ఉరుముగ. ఒప్పారుచున్న శ్రీకృష్ణుడను మేఘము కరుణారసమను వృష్టిచే మల్కిభరాముని (ఇబ్రహీంను) రక్షించుగాక। అని తాత్పర్యము.

ఈ పద్యము తరువాత వరుసగా మఱిఐదు ఆశీర్వచన పద్యములున్నవి. ఒక్కొక్క పద్యములో ఒక్కొక్క హిందూ దేవతను పేర్కొని వారందరును ఈతనిని రక్షించుగాకయని యీతడు ప్రార్థించును. దాదాపు ఈపద్యము లన్నింటిలో ఇబ్రహీం కాస్తా మల్కిభరాముడు లేదా ఇభరాముడైనాడు. చిత్రమేమన యీ ముస్లిం ప్రభువు ఈ హిందూ బిరుదనామమునుగాని, హిందూదేవతలందఱి యాశీస్సులనుగాని మహదానందమున మహాప్రసాదమని శిరసావహించుట ! ఇదిట్లుండ,

చాటుపద్య మణిమంజరిలో ఈ మల్కిభరామునిగూర్చి మన తెలుగు కవులు కొందరు శ్రుతిమించి వ్రాసిన పొగడ్త పద్యములు కొన్ని చోటు చేసుకొన్నవి. వాటిని కూడ కాస్త పలుకరింతము.

ఇభరాముడు బలరాముని, రఘురాముని, పరశురాముని, గోపికారాముని కూడ మించినవాడట! ఆతనికెవ్వరు లోకమున సరిలేరట! ఈ పద్యమును వినుడు :

రాముడు దుక్కిముచ్చు రఘురాముడు క్రోతులరాజు రేణుకా
రాముడు పోటుబంటు పటురాగ సమంచితుడైన గోపికా
రాముడు వెఱ్ఱిగొల్లడికి రాష్ట్రములందు సమానులేరయా
రాములనెంచి చూడ నిభరామ మహీధర భవ్యవైభవా!

షట్చక్రవర్తుల తరువాత నితడు ఏడవ చక్రవర్తియనియు, షోడశ మహారాజుల తరువాత పదిహేడవ మహారాజనియు కూడ వర్ణించినారు.

ఈతడు పండితులను కవులను పోషించిన విధమిట్లుండెను :

సర్వోనా సంగీతనాదభేద విధిజ్ఞ
 ధీరాత్ములకు బహుమానములిచ్చు
రమ్యమైనా సభాప్రౌఢ సత్కవివర
 జాలములకు బడివేలనిచ్చు
కూర్పుండుబుధియైనా గురుతర
 శాస్త్రజ్ఞ లక్షణవిదులకు లక్షయిచ్చు
శాబాసురాయన్న సకలాశ్రితానేక
 కోవిదులకు మెచ్చు కోటియిచ్చు.

భళిర! చతురబ్ధిమేఖలా కలితధాత్రి
చక్రినిర్వక్రపాలనా చారుకీర్తి
రమ్యముక్తాతపత్రరా రాజితుండు
చారుతరమూర్తి యిభరామ చక్రవర్తి

ఈతడు మరణించినప్పుడు కవులు సృష్టికర్తను నిందించినవైనమిది :

రారవిధాత! యోరివినరా! తగునా! తలకొట్టుమారి ని
స్సారపు లోభిరాజులను చంపక మల్కిభరాము భూవరున్
జారు యశోధరున్ సుగుణి జంపితి వర్థుల కేమిదిక్కురా!
చేరిన నింతరాజును సృజింపగ నీతరమా? వసుంధరన్.

తపతీ సంవరణోపాఖ్యానమున ప్రముఖమైన చారిత్రక విషయమొకటి సూచింపబడినది. శా. శ. 1246 లో (క్రీ.శ. 1324-25) ప్రతాపరుద్రుని మరణానంతరము కాకతీయ సామ్రాజ్యము బహమనీసుల్తానుల ఏలుబడిలోనికి వచ్చినదని పూర్వోక్తము. ఆ పిమ్మట దాదాపు నూటడెబ్బై సంవత్సరములకాలము ఓరుగల్లు మహమ్మదీయుల పరిపాలనలో మ్రగ్గిపోయినదని చెప్పుటకన్న హిందువులకు సంబంధించి యిదమిద్ధముగా తెలియవచ్చు చారిత్రకాంశము కాన్పింపదు. కాని షితాబ్‌ఖాన్ అను ముస్లిం బిరుదాంచితుడైన సీతాపతిరాజు అను హిందూ వీరుడు క్రీ.శ. 1500 సం॥ ప్రాంతమున ముస్లిం సుల్తానులకడ వరంగల్లుకు సుబేదారుగా నుండెను. ఈతడు శా. శ. 1425 మాఘ శుద్ధ పంచమినాడు (క్రీ. శ. 21 జనవరి 1503-4) సుల్తానులను జయించి స్వాతంత్ర్యమును ప్రకటించుకొని ఓరుగల్లుకు రాజై మూడు నాలుగు సంవత్సరములు హిందూ ధర్మమును పునః ప్రతిష్ఠించి ఒక్క వెలుగు వెలిగి తిరిగి పతనమయ్యెను. ఈషితాబ్‌ఖాన్ అను నామాంతరముగల సీతాపతిరాజు మల్కిభరామ్ అను నామాంతరముగల ఇబ్రహీం కుతుబ్షాకు సమకాలికుడు. "తారీఖీ కుతుబ్షాహి" అను క్రైఫీయతులో వీరిద్దరు సమకాలికులని సూచింపబడినది. అయితే వీరిద్దరు పరస్పరము బద్ధ శత్రువులు. వీరిద్దరికీ సమకాలీనుడు అద్దంకి గంగాధర కవి. ఈతడు తపతీ సంవరణ కావ్యమున ఇబ్రహీం పరాక్రమమును వర్ణించు పట్టున సీతాపతి రాజును పిరికివానినిగా చిత్రించి వ్రాయుట విధి విలాసము. ఈ విషయమును గూర్చి చెప్పిన ఒకేఒక వాక్యమిది :

"కంపమందె చితాపుఖానుడు గౌతమీతటిని లంఘించిపోఁబుటము వెట్టె"[1]
(ఆ-1-25)

ఈ ప్రబంధము యొక్క ముద్ర ఉర్దూ కవులపైకూడ పడినట్లు తెలియుచున్నది. కులీ కుతుబ్షాకడ "వజ్హీ" అను నాస్థాన కవి యుండెను. ఆతడు వ్రాసిన "ఖుత్బ ముష్తరీ" అను గ్రంథముపై నీ తెలుగు ప్రబంధ ముద్ర ఉన్నదట. మల్కిభరాముని ప్రణయగాథకూడా తపతియందు సూచితమైయున్నదని పరిశోధకుల అభిప్రాయము.[2]

1. సీతాపతిరాజును గూర్చి తెలిసికొనుట కొఱకు, చూ. 'షితాబుఖాను అను సేనాపతి రాజు' శాసనము, రచయిత ఆదిరాజు వీరభద్రరావు, ప్రచురణ లక్ష్మణరాయ పరిశోధక మండలి, హైదరాబాదు.
2. ఆచార్య డా॥ బి. రామరాజుగారు ఆరుద్రకు వ్రాసిన ఉత్తరములో ఈ యభిప్రాయమును వెలిబుచ్చినట్లు ఆరుద్రగారు పేర్కొనిరి. సమగ్రాంధ్ర సాహిత్యం 8వ సంపుటం పుట 139.

ఆంధ్ర మహాభారతము, ఆదిపర్వము, సప్తమాశ్వాసములో నన్నయగారు 23 పద్య గద్యలతో వ్రాసిన కథ ఈ తపతీ సంవరణోపాఖ్యానము. దీనిని అష్టాదశ వర్ణనలతో పెంచి అయిదా శ్వాసముల ప్రబంధముగా వ్రాసినాడు అద్దంకి గంగాధరుడు. ఇది గోల్కొండ గనిలో మెల్సిన మంచి కావ్యరత్నములో నొకటి.

## పొన్నిగంటి తెలగన్న

మల్కిభరాముని కాలమున గంగాధరుని తరువాత పేర్కొనవలసిన ప్రముఖ కవి పొన్నిగంటి తెలగన్న. ఈతడు శా. శ. 1497 (1575) సం॥ ప్రాంతమువాడు. "యయాతి చరిత్రము" అను అచ్చతెనుగు కబ్బమును వ్రాసిన మొట్టమొదటి కవి. దీనిని యీతడు ఇబ్రహీం కడ కొలువులోనున్న అమీన్‌ఖాన్ అను సర్దారునకు అంకితమిచ్చెను. అమీన్‌ఖానుడు తానే స్వయముగా మరింగంటి అప్పలాచార్యులను మరొక కవి ద్వారా అడిగించి కోరికోరి యీ కబ్బమును కృతినొందెనని ఇందులో చెప్పబడినది. వ్యాకర్తలు తెలుగు భాషను ముఖ్యముగ మూడు తెఱగులుగా విభజించిరి. ఒకటి - సంస్కృత ప్రాకృత పదములతో సమానములగు పదములుగల భాష "తత్సమభాష" యనబడును, రెండు - సంస్కృత పదముల నుండియు, ప్రాకృత పదముల నుండియు పుట్టిన పదములు "తద్భవములు" మూడు - తెలుగువాడునందు నిత్యవ్యవహారమున - జనులవాడుకలో నుండు భాష "దేశ్యము". వీనిలో సంస్కృత సమ (తత్సమ)పదముల కంటె వేఱైనది "అచ్చతెనుగు భాష" అనగా సంస్కృత భవములు, ప్రాకృత సమములు ప్రాకృత భవములు, దేశ్యములుగలది అని యర్థము. ఇట్టి భాషలో వ్రాయబడిన కబ్బము యయాతి చరిత్ర. నన్నయ నుండి చిన్నయ వఱకు వెలసిన తెలుగు గ్రంథము లలో నూటికి అరవై పాళ్ళు సంస్కృత శబ్దములు, నలభైపాళ్లు తెలుగు పదములు ఉండును. ఆ పద్ధతిని త్రోసిరాజని అచ్చతెనుగులో వ్రాయబడిన తొలి పొత్తమిది. దీనికి కారణము సునీతికుమార్ ఛటర్జీ చెప్పిన[1] మాటలనుబట్టి యూహింపవచ్చును:

"He (Ibraheem Qutub Shah) appears to have prefered a pure Telugu diction (Acca Tenugu, or Acca Telugu) rather the highly Sanskritised mixed Language of the day"

---

1. 'Languages and Literatures of modern India' Page 281. శ్రీ ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యం 8వ సంపుటం 143వ పుట ఫుట్‌నోట్‌లో ఉట్టంకించిన వాక్యములివి.

యయాతి చరిత్ర సుమారు 775 పద్యగద్యములుగల అయిదాశ్వాసముల ప్రబంధము. సరళమైన అచ్చతెనుగుల హొయలింపుతో నిగనిగలువోవు రెండు పద్యములు మచ్చునకుదాహరింపబడుచున్నవి :

చతుర్థాశ్వాసమునందలి కథాంశమిది : యయాతిని పెండ్లికొడుకునుచేసి ముత్తైదువలు మంగళహారతి పట్టిన వర్ణన మిది :

ఉ॥ కారుమెఱుంగులంటెగడు కైపున నొప్పనెలంతలంత బం
గారపుఁ బళ్ళెరంబుల పగన్ నునుముత్తెపు ముగ్గులోన నిం
పారెడు కెంపు దివ్వియల నందపు గెందొడపుల్ చెలంగగా
నారతులిచ్చి రప్పుడు యయాతికి లేనగవొప్పు నర్మిలిన్.

ఆమని వర్ణనలోని ఒక పద్యము :

వ్రేలుంగొమ్మలు నేలదారసిలినన్ వెళ్ళంగ రాకుంశగా
లోలో ద్రిమ్మరునాలి గాడ్పులు పగళ్లన్ రేలు బూఁదావులన్
జాలన్ గ్రుచ్చిలి ప్రోవ బట్టుకొని పజ్జన్ బచ్చగండార్లలో
సోఁకన్ గావలిబెట్టె నామనియనన్ జూపట్టె లోదోటలన్.

మన సాహిత్యమున అచ్చ తెనుగు కావ్యములు అయిదారుకంటెలేవు. వానిలోనిది తొలికబ్బము. పొన్నిగంటి తెలగన్న ఈ విషయమున నాదికవి.

## సారంగు తమ్మయ్య

ఈ క్రమములో పిమ్మట పేర్కొనవలసిన కవి సారంగు తమ్మయ్య. ఈతనిని గూర్చి కొంత పూర్వోక్తము. వైజయంతీ విలాసమను పేర ఈతడు వ్రాసిన ప్రబంధమును ప్రభువు, సన్నిహితుడునయిన ఇబ్రహీం కుతుబ్షాకు గాక తన యిలవేల్పగు శ్రీరాముని కంకితమిచ్చెను. సమారమి ఆరునంపల పద్య గద్యములుగల నాలు గాశ్వాసముల ప్రబంధ మిది. శృంగారమయము. పన్నిద్ద రాళ్వారులలో శ్రీ తొండరడిప్పొడియాళ్వారొకడు. ఈతడే విప్రనారాయణుడు. శ్రీ మహావిష్ణువు మెడలోనుండు వనమాలికాంశ సంభూతుడు. ఈ వనమాలికకు వైజయంతి అను పేరుగలదు. ఆ పేరుమీదుగా కవి దీనికి వైజయంతీ విలాసమను పేరు పెట్టినాడు. విప్రనారాయణుడు పరమనిష్ఠాగరిష్ఠుడు. పరస్త్రీ పరాఙ్ముఖుడు. ప్రారబ్ధకర్మ శేషమువలన 'దేవదేవి' అను వేశ్యా

సంపర్కమున సాంసారిక క్లేశముల ననుభవించినాడు. దేవదేవి ఈతనిని విటుడుగా మార్చునని తన చెల్లెలు మధురవాణితో ప్రతినబూని, ఏమియు తెలియని సంగనాచివలె నాతనికడ ప్రవేశించి దాసియై సేవలు చేయుచు మెల్లగా వశపఱచుకొన్నది. చివరికి శ్రీరంగనాథుల దివ్యకటాక్షమునకు పాత్రుడై ఆ వలయమునుండి బయటపడి తరించిన మహనీయుడు. దేవదేవి ఈతనిని క్రమముగా వశపరచుకొనుచున్న సమయమున నీతని మనస్సు చలించి యెట్టి వికారమునకు గురియై సుడులు తిరిగినదో ఆ వివిధ క్రమదశలను ఈ క్రింది పద్యమున రమణీయముగా చెప్పినాడు కవి.

ఆ విప్రోత్తము వజ్రపంజర నిభంబై నిశ్చలంబైన స
ద్భావం బంగన సాహచర్య గుణ సంపర్కంబునన్ లోహమై
గ్రావంబై దృఢదారువై తరుణవృక్షంబై ఫలప్రాయమై
పూవై తన్మకరందమై కరగె బోబో నీళ్ళకుంబల్చనై.

వైజ 2-139.

ఈ పద్యమును తరువాతి కవులు కొందరనుకరించినట్లు తోచుచున్నది. బలిజేపల్లి లక్ష్మీకాంతంగారి సత్యహరిశ్చంద్ర నాటకంలోని యీ క్రింది పద్యమున ఆ పోకడను కొంత గమనింపవచ్చును. హరిశ్చంద్రుడు స్మశానమున చంద్రమతిని తలచుకొని "నా చిత్తమునకు శాంతి ఎప్పటికో, అయ్యో! ఇంక శాంతి గాకేమున్నది?" అని యిట్లనుకొనును.

నానాటన్ బరిపాటి నామది దురంతంబైన చింతాహతిన్
మానై రాయయి వజ్రమై స్వగుణ ధర్మం బైన చైతన్య లీ
లానై జంబు ద్యజించి నిర్వికృతి మేళ్ళన్ గీళ్ళనొక్కుమ్మడిన్
బూనున్ యోగిమనంబు రీతి యపుడే పో శాంతి నా చింతకున్.

హరి. షష్ఠాంకము.

సందర్భము భిన్నమైనది. రసము భిన్నమైనది. కాని మానసిక స్థితియొక్క ఉత్తరోత్తర బలీయమైన క్రమదశలను వర్ణించుటలో కొంతసామ్యమున్నది గోల్కొండ నవాబుల కాలమున వెలసిన కావ్యములలో వైజయంతీ విలాసమొక చక్కని కావ్యము. ఈతడు హరిభక్తి సుధోదయమను గ్రంథమునకు భక్త సంజీవని యను సంస్కృత వ్యాఖ్యాన గ్రంథమును కూడ వ్రాసినటు పూరోక్తము.

## మరింగంటి సింగరాచార్యులు

ఈతని యాస్థాన కవులలో పేర్కొనవలసిన మఱొక పండితకవి మరింగంటి సింగరాచార్యులు. ఇతనితోసహ మొత్తము ఎనిదిమంది సోదరులు వీరు. అందరు సంస్కృతాంధ్ర పండితకవులే. ఇభరాముని యాశ్రితులే. సింగరాచార్యులు ఇభరాముని వలన మడిమాన్యములను పొందినట్లు ప్రతీతి. దశరథరాజనందన చరిత్ర, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము ఈతని సుప్రసిద్ధ గ్రంథములు. దాదాపు ఇరవై పైచిలుకు అముద్రిత గ్రంథములున్నట్లు పరిశోధకుల వక్కాణ.

## నేబతి కృష్ణయామాత్యుడు

నేబతి కృష్ణయామాత్యుడు కూడ నీకాలమువాడే. ఈతడు పంచతంత్రమును రాజరత్నాకరమను పేరుతో ఆరాశ్వాసముల గ్రంథముగా వ్రాసెను తెలుగు సంప్రదాయ ముద్రను సంతరించుకొన్న వైష్ణవ ప్రబంధమిది.

## మహమ్మద్ కులీకుతుబ్షా

నాల్గవ నవాబును. మన భాగ్యనగర నిర్మాతయునగు మహమ్మద్ కులీకుతుబ్షా (శా.శ. 1501-1532) కూడ మంచి సాహిత్య ప్రియుడు. ఈతనిని గూర్చి డా॥ బూరుగుల రామకృష్ణరావుగారిట్లు వ్రాసిరి.[1] "ఇతడు పారశీభాషలోను, దక్కనీ ఉర్దూలోను తెలుగు భాషలోను కావ్యములను రచించెనట. తెలుగు కవిత లభ్యముకాలేదు. కాని ఉర్దూ భాషాచరిత్రకారులితడు తెనుగుకవి యని యు వ్రాసినారు '' దశరా మొదలయిన హిందూ పండుగులనుగూర్చియు, తన ప్రియురాలు భాగమతిని గూర్చియు నీతడు సరసమైన కవితల్లినాడు, ఈయన వ్రాసిన ఫార్సీ, ఉర్దూ గ్రంథములలో తెలుగు పదములు విరివిగా దొర్లినట్లు పలువురు పరిశోధకులు పేర్కొనిరి.

తన తండ్రి ఇబ్రహీం కాలమున ఆస్థానకవిగానున్న సారంగు తమ్మయ్యను తండ్రి తదనంతరము ఈతడు కనిపెట్టుకొనియుండెను. ఈతడుగా పోషించిన యాస్థాన కవులలో ప్రత్యేకించి పేర్కొనదగిన కవి రాజమల్లారెడ్డి. ఈతడు "శివధర్మోత్తరము" "పద్మపురాణము'' మొదలయిన గ్రంథములను వ్రాసెను. గణేశపండితుడు అను మరొక కవిగూడ ఈతని యాస్థానమందుండెను. ఈతని గ్రంథములు మృగ్యములు.

1. 'సారస్వత వ్యాస ముక్తావళి' 'ఉర్దూ భాషా సారస్వతములు' అన్న వ్యాసము. పుట 59

## సుల్తాన్ అబ్దుల్లా కులీకుతుబ్షా

ఆరవ పరిపాలకుడగు సుల్తాన్ అబ్దుల్లాకులీకుతుబ్షా (శా.శ. 1548-1594) మంచి విజ్ఞానప్రియుడు. ఈతడు తెలుగును ప్రత్యేకించి పోషించిన దాఖలా కానరాదు. సంస్కృతమును కొంత యభిమానించినట్లు తోచుచున్నది. సంస్కృతమునందలి శుక సప్తతిని "యాతీనామా" అను పేరుతో ఫారసీలో తర్జుమా చేయించెను. దానినేమరల "సబ్రస్" పేరుతో (కామరూపకళాకథలు) ఉర్దూలో అనువదింపజేసెను.

## అబ్దుల్ హసన్ తానీషా

ఏడవ పాలకుడగు అబ్దుల్ హసన్ 'తానీషా' (శా శ. 1594-1609) తెలుగును పోషించిన వైనము కానరాదు. మాదన్న, అక్కన్న అను సోదరులు, ఒకరు మహామంత్రిగా మరొకరు మహాసేనానిగా విశ్వాసపాత్రనుగ వ్యవహరించి యీ సుల్తాను రాజ్యమునకు శ్రీరామరక్షగా నిలిచినవారు. ఈతెలుగుసోదరుల మేనల్లుడు రామదాసు బిరుదాంచితుడైన కంచెర్ల గోపన్న, భద్రాచల రామాలయ నిర్మాణమునకై ప్రభుత్వ ద్రవ్యమును కైంకర్యము చేసిన నేరమునకు కఠినమైన రాజదండనకు గురియై గోల్కొండ కోటలో చీకటికొట్టు జైలులో పన్నెండు సంవత్సరములు మ్రగ్గిపోయిన మహనీయుడు, చివరికి సీతాలక్ష్మణ సమేతుడైన రాముడితనికి ప్రత్యక్షమగుటయేగాక, ఆతడెంతటి పుణ్యాత్ముడోగాని తానీషాకుకూడ ప్రత్యక్షమై ఆతనిద్వారా రామదాసుని బంధవిముక్తి చేసినగాథ సుప్రసిద్ధమే. రామదాసు ఖమ్మంజిల్లావాడు. దాశరథీశతకము వంటి యాతని రచనలన్నియు కాలాంతరమున ఎక్కడనో వ్రాయబడియుండునుగాక. బందిఖానాలోనున్నప్పుడు తన బాధలను రాముని దృష్టికి తెచ్చుటకు వ్రాసిన యీపాట మాత్రము గోల్కొండలోనే యుద్భవించినది. అచ్చటి కోహినూరు వజ్రపు ధగద్ధగలకు దీటుగ వెలుగొందుచున్న కీర్తన యిది:-

"ఇక్ష్వాకుకులతిలక యికనైన పలుకవే రామచంద్రా!
నన్ను రక్షింపకున్నను రక్షకులెవరింక రామచంద్రా!
చుట్టు ప్రాకారములు సొంపుతోకట్టితి రామచంద్రా!
ఆప్రాకారమునకు పట్టెపదివేల వరహాలు రామచంద్రా!
గోపుర మంటపాల్ కుదురుగ గట్టితి రామచంద్రా!

నన్నుక్రొత్తగ జూడక నిత్తరి ప్రోవుము రామచంద్రా!
భరతునకు చేయిస్తి పచ్చలపతకము రామచంద్రా!
ఆపతకమునకు బట్టె పదివేల వరహాలు రామచంద్రా!
శత్రుఘ్ననకు నేజేయిస్తి బిళ్ళలమొలత్రాడు రామచంద్రా!
ఆమొల తాటికి పట్టె మొహరీలు పదివేలు రామచంద్రా!
లక్ష్మణునకు జేయిస్తి ముత్యాలపతకము రామచంద్రా!
ఆపతకమునకు పట్టె పదివేల వరహాలు రామచంద్రా!
సీతమ్మకు జేయిస్తి చింతాకుపతకము రామచంద్రా!
ఆపతకమునకు పట్టె పదివేల వరహాలు రామచంద్రా!
వాహనములు మీకు సరుసతో జేయిస్తి రామచందా్రి!
కలికితురాయిని పొలుపుగ జేయిస్తి రామచందా్రి!
ఇన్ని చేయించిన నాకు కాళ్ళకు సంకెళ్ళు వేయించి
నీవు కులుకుచు తిరిగెదవె దబ్బసొమ్మని రామచందా్రి!
అడుగుదాటి కదలనివ్వను నాకభయమియ్యక నిన్ను విడువను
రామచందా్రి!''

## తెనాలిరామలింగము

తానీషాకాలమున గోల్కొండ హైదరాబాదు నగరము లొకటిగా రూపొందినవని వెనుక చెప్పబడినది. గోల్కొండ పట్టణమందనుడు, హైదరాబాదు నగరమునందనుడు అక్కన్న మాదన్నలకాలమున (శా.శ. 1594-1609) ఇచట నివసించిన మరొకకవి తెనాలి రామలింగము. ఇతడు తెనాలి రామకృష్ణుడుకాదు. అచ్చముగా హైదరాబాదు వాడు, స్థానికుడు. ఏప్రభువునకుగాని ఆశ్రితుడైనట్లు కానరాదు. స్వయంకృషితో వర్ధిల్లిన కవి. విశ్వబ్రాహ్మణుడు. ''ధీరజనమనోవిరాజితము'' అన్నది యితని గ్రంథము. ఇందు విశ్వబ్రాహ్మణుల గొప్పతనము చెప్పబడినది. వారిని నిందించినచో వచ్చు కష్టములను గూర్చి వివరింపబడినది. అమరసింహుడను వాడు విశ్వబ్రాహ్మణులను నిందించెను. కష్టములపాలయ్యెను. అన్నదొకకథ. ఇట్టికథలే మరికొన్నిగలవు. ఈగ్రంథము అలబ్ధము. ఇంతకుమించిన వివరములు ఈకవినిగూర్చి తెలియరావు. ఈతని తరువాత అనగా శా.శ. 1609 నుండి 1800 వరకు (క్రీ.శ. 1686-1878) దాదాపు రెండు వందల సంవత్సరముల మధ్యకాలమున హైదరాబాదు నగరమున నివసించిన కవి శబ్దవాచ్యుడు కలికమునకైనను కానరాడు. ఇదొక విచారకరమైన విచిత్రవిషయము.

## గోల్కొండ కుతుబ్షాహీ రాజ్యపతనము

గోల్కొండ వైభవము కు కన్ను కుట్టిన మొగల్‌పాదుషా ఔరంగజేబు శా.శ. 1609 (క్రీ.శ. 1687)లో దీని ముట్టడించి స్వాధీనము చేసికొనెను. తానీషాను, అక్కన్న మాదన్నలను బంధించి కొంతకాలమునకు చంపించెను. ఔరంగాబాదు రాజధానిగా ఈ ప్రాంతమును పాలించుటకు సుబేదారులను నియమించెను. శా.శ. 1635 (క్రీ.శ. 171 )లో అట్లు సుబేదారుగా నియమింపబడిన వ్యక్తి కమ్రుద్దీన్ నిజాం ఉల్-ముల్క్-ఆసిఫ్‌ఝా అనునాయన. ఈతడు క్రమముగా బలపడి మొగల్‌సామ్రాజ్య ప్రక్షీణ దశలో స్వాతంత్ర్యము ప్రకటించుకొని శా.శ. 1646 (క్రీ.శ. 1724)లో దక్కన రాజ్యాధినేతగా సింహాసన మధిష్టించెను. మహారాష్ట్రవీరుల దాడులధాటికి భయపడి రాజధానిని ఔరంగాబాదు నుండి హైదరాబాదుకు మార్చుకొనెను. ఇంతటితో హైదరాబాదు సంస్థానమేర్పడి నిజాం నవాబుల పరిపాలన ప్రారంభమయ్యెను. ఆసిఫ్‌ఝా వంశ నామముతోను, నిజాం అను బిరుద నామముతోను హైదరాబాదును పాలించిన నిజాం నవాబుల వరుస క్రమ మిది :

## హైదరాబాదు సంస్థానము-నిజాం నవాబుల పరిపాలన

1. కమ్రుద్దీన్ నిజాం-ఉల్-ముల్క్-ఆసిఫ్‌ఝా శా.శ. 1646-1670 (క్రీ.శ. 1724-1748)
2. నిజాం ఆలీఖాన్, శా.శ 1683-1725 (క్రీ.శ. 1761-1803)
3. నిజాం సికిందర్‌ఝా. శా.శ. 1725-1751 (క్రీ.శ. 1803-1829).
4. నిజాం నాసిరుద్దౌలా, శా.శ. 1751-1779 (క్రీ.శ. 1829-1887).
5. నిజాం అఫ్జల్ ఉద్దౌలా. శా.శ. 1779-1791 (క్రీ.శ. 1857-1869).
6. నిజాం మీర్ మహబూబ్ ఆలీఖాన్, శా. శ. 1791-1833. (క్రీ. శ. 1869-1911).
7. నిజాం మీర్ ఉస్మానాలీఖాన్, శా. శ. 1833-1870. (క్రీ. శ. 1911-1948).

మొదటి నిజాం మరణించిన పిమ్మట వారసత్వమునకై జరిగిన పెనుగులాటలో నాసిర్‌జంగ్, ముజఫర్‌జంగ్, సలాబత్‌ఖాన్ అనువారలు వరుసగా ఒక్కొక్కరు తలా కొన్ని సంవత్సరముల చొప్పున గదెనెక్కిరి. ఇవంతయు మొత్తము 14 ఏండ్లు.

శా. శ. 1670 నుండి 1683 వఱకు (క్రీ.శ. 1748-1761) మధ్యగల కాలమన్న మాట. కాని ఆసిఫ్‌ఝా వంశ నియమము ప్రకారము ఈ ముగ్గురు నిజాం నవాబులుగా గుర్తింపబడలేదు. శా.శ. 1683 నుండి 1725 వఱకు (క్రీ శ 1761-1803) పరిపాలించిన నిజాం అలీఖాన్ అనువాడు మా తమే రెండవ నిజాంగా పరిగణింపబడినాడు. ఇట్లు నిజాం నవాబుల పరిపాలన కచ్చితముగా 225 సం॥ సుదీర్ఘకాలము ఎదురు లేకుండ కొనసాగినది.

శా.శ. 1246 నుండి 1870 వఱకు (క్రీ శ. 1924 నుండి 1948 వఱకు) రమారమి 625 సంవత్సరముల సుదీర్ఘ కాలము ముస్లిముల యేలుబడిలోనున్న ప్రాంతమిది. దక్షిణభారతమున ఇంతకాలము ముస్లిముల క్రింద నలిగిన ప్రాంతము మరొకటి లేదు. ఇందులో మొదటి 550 సం॥కాలము ఫారశీ రాజభాషగా అధికారము చలాయించినది. చివరి 75 సం॥కాలము ఉర్దూ రాజభాష అయినది ఆరవ నిజాం మీర్ మహబూబ్ అలీఖాన్ శా.శ. 1805లో (క్రీ.శ. 1883) పారసీ స్థానే ఉర్దూను రాజభాష చేసినాడు. ఈ క్రొత్త అధికార భాషను అతివేగముగా, మిక్కిలి బలాత్కారముగా ప్రజలపై రుద్దుటకు తండ్రీ కొడుకులైన చివరి ఇద్దరు నిజాం నవాబులు, మహబూబ్‌అలీఖాన్, ఉస్మానాలీఖాన్‌లు చేసిన ప్రయత్నములలో తెలుగు పూర్తిగా అణగారిపోయినది.

గోల్కొండ సుల్తానుల కాలమున క్రొన్ననలు వేసిన తెలుగుభాషా సాహిత్య లత నిజాం నవాబుల కాలమున క్రమముగా వాడి వత్తయై చివరికి ఎండిపోయినదన్న నతిశయోక్తికాదు. అక్కన్న మాదన్నల కాలమున తెనాలి రామలింగమనునొక కవి యుండెను. అతని తరువాత హైదరాబాదు నగరమున దాదాపు రెండువందల సంవత్సరముల కాలము కవిశబ్దవాచ్యుడైన తెలుగువాడు కలికమునకైనను కానరాడను విషయము పూర్వోక్తము. పంధొమ్మిదవ శతాబ్ది తొలిపాదమునుండి కొందరుద్భవిల్లిరిగాని వారిలో నొక్కడు గూడ నిజాం ప్రభువుల మన్ననలతోను పోషణతోను వచ్చినవారు మాత్రము కానేకాదు. వారి దమన నీతిని ప్రతిఘటించుటకు ప్రతిక్రియాత్మకముగా బయలుదేరిన మహనీయులే. ఆ మాటకొచ్చిన నవాబులు ఉర్దూ కవులను సైతము పోషించినవైనము కానరాదు. వీరు తాము ఔరంగజేబు వారసులమని పేర్కొనిరి. ఆ కాఠిన్యము వీరిలో కన్పించును.

ఇప్పటికి చెప్పినదంతయు పూర్వరంగము, శా.శ. 1047 నుండి 1800 వరకు (క్రీ.శ. 1125 నుండి 1878 వరకు) మధ్యగల 750 సంవత్సరముల సుదీర్ఘ తెలుగు భాషా సాహిత్య చరిత్రకు రేఖామాత్ర చిత్రణమన్నమాట.

ఇక రాబోవు గ్రంథభాగము ప్రధాన రంగము. శా.శ. 1801 నుండి 1872 వరకు (క్రీ.శ. 1879 నుండి 1950 వరకు) మధ్యగల 72 సంవత్సరముల తెలుగు భాషా సాహిత్య వికాస చరిత్ర సమగ్ర స్వరూపమట చిత్రింపబడును. అయితే ఈ 72 సంవత్సరముల చరిత్ర మరల రెండుభాగములుగా విశ్లేషింపబడును. మొదటి భాగము నందు శా.శ. 1801 నుండి 1860 వరకు (క్రీ శ. 1879 నుండి 1938 వరకు) గల 60 సం॥ కాలచక్రము యొక్క చరిత్ర వ్రాయబడును. రెండవ భాగమునందు శా.శ. 1861 నుండి 1872 వరకుగల (క్రీ శ. 1939 నుండి 1950 వరకు) 12 సంవత్సరముల కాలచక్రము యొక్క చరిత్ర వ్రాయబడును. అట్లే భాషా వికాస చరిత్ర, సాహిత్య వికాస చరిత్ర అను మరొక విశ్లేషణ కూడ చేయబడినది.



# ప్రధానరంగము

## శా.శ. 1801 - 1872 = క్రీ.శ. 1879 - 1950

హైదరాబాదు నైసర్గిక సౌందర్యమును సంతరించుకొన్న మహానగరము. సమశీతోష్ణస్థితికి, చక్కని వాతావరణమునకు పేరెన్నికగన్నది. చుట్టునుపర్వతముల పంక్తులు, సరస్సులవంటి అందమైన చెఱువులుగలిగి నగరమునకు నగరమే ఉద్యానవనముగ పేరు పడసినది. ఒకప్పుడిది పన్నెండువందల పైచిలుకు తోటలతో నొప్పారుచుండినట్లు చారిత్రకుల కథనము. బాగ్ అనగా ఉద్యానవనమని యర్థము. సీతారాంబాగ్' జాంబాగ్, బషీర్‌బాగ్, బీర్‌బల్‌బాగ్, బాగ్‌లింగంపల్లి బాగ్‌అంబర్‌పేట్ మొదలైన పేర్లన్నియు ఈవిషయమునే ధృవపరచుచున్నట్లు భావింపవచ్చును. ఈ ఉద్యానవనము లన్నింటికి తలమానికమైనది "పబ్లిక్‌గార్డెన్స్". ఇది శా.శ. 1847 (క్రీ.శ. 1925) నాటికే నెలకొని యున్నట్లు తెలియుచున్నది. దీనిని గూర్చి గోల్కొండకవులసంచికలో[1] "భాగ్యపురోపవనము" అన్న శీర్షికన శ్రీచెన్నమరాజు వేంకటేశ్వరరావుగారు వర్ణించిన పద్యములిట్లున్నవి :

సీ॥ మాధవీపున్నాగమాలతీవల్లికా
మాగధీశోభిత మండపములు
తాపిఞ్ఛసాల దాడిమనారంగ
కుంచితవైచిత్ర్యకుంజగుహలు
సహకారపల్లవాస్వాదనాదరశుకా
లాపకోకిల రవాలంకృతంబు
కలహంస కలకంఠ ఖంజరీట రథాంగ
సారస కలరవసంకులంబు

1. గోల్కొండ కవుల సంచిక-1934 లో ప్రచురింపబడినది. సంపాదకులు సురవరం ప్రతాపరెడ్డిగారు.

గీ॥ జరపిరతర పరిపూరిత పటుమరంద
పానఘూర్ణితబంభర భర్జితంబు
పూర్ణసంశోభితానేక పుష్పరజము
భాగ్యనగరోపవనము సుపర్వవనము

గీ॥ అభినవలతాంతిక పరంపరాఢ్యయగుచు
తతసుమాయుధ తూణీరతావిలాస
గరిమఁజెన్నొంది శుకకలకంఠమధుప
లలితరవములు పాంథులఁకలచునౌర

గీ॥ నిబిడతరుశాఖ లెసగియునింగిబ్రాకఁ
బ్రావృడంబుద విభ్రాంతిబకెడవిల్లఁ
గాంచి పురివిచ్చి సరినీలకంఠమాడు
వేసవిని నిమ్మహారామ వీధులందు

ఇట్లు భాగ్యనగర ఉద్యానవన వీధులలో తేటుల పాటలు. కోయిల కూతలు. కల హంస కూజితములు వినబడుచుండినూ భాగ్యనగర వీధులలో మాత్రము తేట తెలుగు మాటల పొలుపులు మాత్రము వినబడేవికాదు. ఎక్కడ చూసిన పారసీ, ఉర్దూ భాషల ప్రభావమే కనిపించెడిది. ఆ కూతలే వినిపించెడివి. తెలుగువారుసైతము, ముస్లిములతో మాట్లాడునప్పుడటుంచి, తమలో తాము కూడినప్పుడు కూడ ఆ భాషలలోనే మాట్లాడు టకలవాటుపడిరి. పాయజమాలు. షేర్వాణీలు ధరించుట చేతులలో ఉర్దూ పత్రికలు పట్టుకొనుట మొదలైనవి మనవారి కలవాటుపడిన మామూలు ధోరణి. తెలంగాణ జిల్లా లలో నింత కాకపోవచ్చును. రాజధానియగుటవలన నిట విపరీతముగ ప్రబలినది. ఇక్కడ ముస్లిముల జనాభా గుమిగూడినట్లుండుట దీనికి ప్రధాన కారణము. క్రైస్తవుల కార్యకలాపములు కూడ నిచట చురుకుగా సాగి ఆంగ్లభాషా వాతావరణము కూడ ప్రబ లము గాజొచ్చినది. ఇది సికిందరాబాదునందెక్కువగా నుండెడిది. దీనికితోడు హైదరా బాదునందు హిందూ సోదరులయిన మహారాష్ట్రిలు, కన్నడిగులు, తదితరులు, సికిందరా బాదునందు కొంతవరకు తమిళులు అధిక సంఖ్యలో నుండిరి. వాస్తవమునకు హైదరా బాదు తెలంగాణ జిల్లాలచే చుట్టబడియున్న నగరము. తెలుగు వారధిక సంఖ్యలో నుండ వలసిన సంగతి. ఉండిరనుకొందమన్నను, ఈ తక్కిన వారందరి ధాటికి తట్టుకొనలేక అన్నివిధముల వెనుకబడిపోయిరి. శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారన్నట్లు ఆంధ్రిడిట్లు

తౌరక్యాంధ్రుడుగా మారిపోయినాడు. అది శా.శ. 1801 నుండి 1920 వరకు (క్రీ.శ. 1979-1950) ఈ మధ్యగల మొత్తము డెబ్బైరెండు సంవత్సరముల కాలఖండమునకు వర్తించిన సాధారణ విషయము. ఆనాటి పరిస్థితుల నద్దము పట్టిన ఈ క్రింది పద్యములు నరయుడు :

❋ "ఏ భాషరా ? నీది ఏమి వేషమురా ?
ఈ భాష యీ వేషమెందుకోసమురా ?"

❋ "హాలీయంచును, గాలిబంచును సదా ఎక్బాలెహో షాయరిన్
చాలా చాల నఫీసులుట్టిపడ మాషాల్లా రచించెన్‌గదా"

❋ "ఒకవంక నాంగ్లేయసుకుమారి యిచ్చగిం
పులతోడ వలపింపడలచుచుండ
ముసుగులో దాగిలి మూతలాడుచు ఉర్దు
భాషా వనిత వలన్ బరచుచుండ
అప్సరో భామిని నంచు సంస్కృతకాంత
పాలిండ్లు పొంగార పైబడంగ
తగుదునమ్మా యంచు వగలాడి గ్రామ్యంపు
కులకుమిటారి తళుక్కులు నటింప

హిందికన్యను పెండ్లాడుమీయటంచు
పెద్దలందరు బలవంతపెట్ట నకట!
చిన్నతనమునినుండి నెచ్చెలిగనున్న
తెలుగుకన్నియ ముద్దులుతీర్చుటెపుడొ[1] ॥

ఇదొక్క తెలుగువారి విషయమేగాదు, నగరమునందు నివసించిన అన్నిభాషలకు చెందిన హిందూసోదరులందరూ ఇట్టిస్థితిలోనే ఉండిరని భావించుట లెస్స. నవాబుల పాలనలో భారతీయ సంస్కృతికి కలిగిన హానిని భంగ్యంతరముగ తెలుపుచు గోల్కొండ కవులసంచికలో "శివాజీప్రశంస" అన్న శీర్షికన కో, క, అణ్ణన్

1. చుక్కలుగల యీ మూడు పద్యములు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి "యాభై సంవత్సరాల జ్ఞాపకాలు" అన్న గ్రంథమునుండి గ్రహింపబడినవి. పుట. 9. కవులపేర్లు అనుక్తములు.

సంపత్కుమారాచార్యులుగారు అయిదు పద్యములు వ్రాసిరి. ఇచ్చటిపరిస్థితులను మార్చి బాధలను మాన్పుటకు మఱల శివాజీని పంపుమని యీ కవి భగవంతుని వేడుకొనెను. అందలి చివరిపద్యముమాత్రము ఉట్టంకింపబడుచున్నది :

చ॥ నరపతిలేనిరాజ్యమటు నాధునిబాసిన నాతికై వడిన్
వరశశికాంతివీడిన విభావరిచందముగాగనేడు దు
ర్భరమగుశోకవార్ధిఁబడివందురుచున్నది భారతాంబ శ్రీ
వరదుడ! వేగబంపుము శివాజినిఁగ్రమ్మఱ దుఃఖమారెడిన్.

ఈపరిస్థితులలో తొలుత నగరమునందలి తెలుగుప్రజలను మేల్కొల్పి, తద్ద్వారా క్రమక్రమముగ తెలంగాణమును మేల్కొల్పి, యిచ్చటతెలుగుభాషా సాహిత్యసాంస్కృతిక పునరుజ్జీవనమును కలిగించుటకు కొందరు మహనీయులు నడుముకట్టిరి. వీరిలో కొమర్రాజు లక్ష్మణరావు, మాడపాటి హనుమంతరావు, సురవరంప్రతాపరెడ్డి, ఆదిపూడి సోమనాధరావు, ఆదిరాజు వీరభద్రరావు, బూరుగుల రామకృష్ణరావు ప్రభృతులు అగ్రగణ్యులు. వీరిలో ఒక్కరుకూడ మొదట హైదరాబాదు నగరమునకు చెందినవారుకారు. అందరు తెలంగాణములోని వివిధ జిల్లాలకు చెందినవారే. శా.శ. 1822-1842 (క్రీ.శ. 1900-1919-20)మధ్యకాలమున ఒక్కొక్కరు క్రమముగానగరమునకు చేరుకున్నవారే. వీరిలో దైవికముగ మొట్టమొదట వచ్చినమహనీయుడు కొమర్రాజు లక్ష్మణరావుగారు. వారిననుసరించినవారు మాడపాటివారు, పిమ్మట సురవరంవారు. ఇదీవరుస.

కొమర్రాజువారు గ్రంథాలయోద్యమమునకు శ్రీకారముచుట్టిరి, మాడపాటివారు ఆంధ్రోద్యమమునకు మూలపురుషులైరి. సురవరంవారు పత్రికారంగమునకు ప్రవర్తకులైరి. ఆదిపూడివారు సాంస్కృతిక రంగమున పనిచేసిరి. ఆదిరాజువారు పరిశోధనారంగమును చేపట్టిరి. బూర్గులవారు రాజకీయరంగమున ప్రవేశించిరి. ఎవరు ఏ రంగమున పనిచేసిననూ, అందరియొక్క ప్రధానలక్ష్యము తెలుగుభాషను పునరుజ్జీవింపజేయుట. సాహిత్యమును ప్రోదిచేయుట. వీరందరూ రచయితలే, కవులే. ఈ తెలుగువైతాళికులద్వారా నగరమున వర్ధిల్లిన తెలుగుభాషాసాహిత్య వికాసచరిత్రను తెలుసుకొందముగాక.

## గ్రంథాలయోద్యమము

### శా.శ. 1801 - 1860 = క్రీ.శ. 1879 - 1938

శా.శ. 1801 నుండి 1823 వరకు (క్రీ.శ. 1879–1900) ఈమధ్యగల ఇరవై రెండుసంవత్సరముల కాలములో హైదరాబాదునగరమున గ్రంథాలయములుండినవైనముకానరాదు. ఇచ్చట నెలకొల్పబడిన మొట్టమొదటి గ్రంథాలయము శ్రీకృష్ణదేవ రాయాంధ్రభాషానిలయము. ఇది శా.శ. 1823 (క్రీ.శ. 1901 సెప్టెంబరు 1 వ తేదీనాడు) ప్లవనామసంవత్సర శ్రావణబహుళ భానువారమునాడు సుల్తానుబజారులో స్థాపింపబడినది. మునగాలసంస్థానాధీశ్వరులైన శ్రీరాజానాయని రంగారావు, వారికడ దివానుగా నుండిన కొమర్రాజులక్ష్మణరావు ఎంఏ., రావిచెట్టు రంగారావు, ఆదిపూడి సోమనాథరావు మైలవరపు నరసింహశాస్త్రి, కర్పూరం పార్థసారధిగారలు ఈనిలయముయొక్క సంస్థాపకసభ్యులు. కొమర్రాజువారు దీనికి ప్రధాన సూత్రధారులు. అటు రాజావారి అండదండలతోను ఇటు సహచరుల సహకారముతోను ఈనిలయమును నెలకొల్పిన మహనీయుడాయన. స్థాపింపబడిననాటినుండియు ఇప్పటివరకు అదేస్థలమున మూడు పువ్వులారుకాయలుగ వర్ధిల్లుచున్న సంస్థయిది. నెలకొల్పబడిననాడిది రావిచెట్టు రంగారావుగారి యిల్లు. అది గ్రంథాలయమునకు దానమైనది. రంగారావుగారు. శా.శ. 1832లో (క్రీ.శ. 3-7-1910) దివంగతులైరి. శా.శ. 1839 లో (క్రీ. శ. 1921) పాతయింటిస్థానమున నూతనభవనము నిర్మింపబడినది. అదే యిప్పటిభవనము. భవన నిర్మాణములో భర్తతరపున ఆర్థికముగ తనవంతు బాధ్యతను చెల్లించిన మహనీయురాలు శ్రీరంగారావుగారి సతీమణి. కొమర్రాజువారు శా.శ. 1844లో (క్రీ.శ. 1922) స్వర్గస్థులై ... క్రమమున తక్కిన స్థాపకసభ్యులుకూడ ఒక్కొక్కరు రాలిపోవుచున్నకాలమున నిలయముయొక్క కార్యకలాపములు కుంటుపడనీక మరల నూతనోత్తేజమును ప్రోదిచేసి సంస్థను నిర్వహించినవారిలో అగ్రగణ్యులు మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, ఆదిరాజువీరభద్రరావు, బూర్గుల రామకృష్ణరావు ప్రభృతులు.

ఈ గ్రంథాలయమునకు శా.శ. 1847లో (క్రీ.శ, 25) కావ్యకంఠగణపతిశాస్త్రిగారి అధ్యక్షతన రజతోత్సవములు జరిగినవి. అప్పుడు నిలయమునకు కార్యనిర్వాహక

అధ్యక్షులుగనున్నవారు బూరుగుల రామకృష్ణరావుగారు. శా.శ. 1823-73 (క్రీ.శ. 1901-1950) మధ్యగల యీ యాభై యేళ్ళలో నగరమునందలి తెలుగువారి సమస్త కార్యకలాపములకు కేంద్రస్థానమై విరాజిల్లిన గ్రంథాలయమిది. ఆనాటి ప్రభుత్వదమన నీతిని యెదుర్కొనుటకిదొక ప్రచ్ఛన్న రాజకీయ శిక్షణ శిబిరమై నిల్చినదన్నచో నతి శయోక్తిలేదు. ఈసంస్థ నిర్వహణలో కార్యకర్తలుగ పనిచేసిన వారెందరో పిమ్మట గొప్పనాయకులై ఉన్నత పదవులనలంకరించిరి. కొన్నివేల సంస్కృతాంధ్రాంగ్ల గ్రంథ ములకు నిలయమై, స్వయముగ అనేక గ్రంథములను ప్రచురించినదై తెలుగువారి సమస్త కార్యకలాపములకు చైతన్యకేంద్రమై, కాలక్రమమున గ్రంథాలయోద్యమము నకు మూలమై నేటికినీ వర్ధిల్లుచున్న శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము భాగ్యనగ రమున కొకవరప్రసాదము, దీనిప్రభావమున కాలక్రమమున వెలసిన గ్రంథాలయ ముల వివరములు లభించినమేరకు నిటపేర్కొనబడుచున్నవి.-

ఆంధ్ర సంవర్ధనీ గ్రంథాలయము-ఇది శా.శ. 1827లో (క్రీ.శ. 30-9-1905) సికిందరాబాదులోని ఇమాం బావిడీ వీధిలో స్థాపింపబడినది. అప్పటి నిర్వాహకులు వారణాసి శేషగిరిరావుగారు.

సంస్కృత కళావర్ధినీ గ్రంథాలయము - ఇది శా.శ. 1835లో (3-8-1913) సికింద్రాబాదులోని ఇమాం బావిడీలో నెలకొల్పబడినది. అప్పటి స్థాపక నిర్వాహకులు అడుసుమిల్లి దత్తాత్రేయశర్మగారు.

భాషా కల్పవల్లీ గ్రంథాలయము-శా.శ. 1842లో (1920) హైదరాబాదులోని ఘన్సీబజారులో ప్రారంభింపబడినది. అప్పటి నిర్వాహకులు సాల్వేరు రామయ్యగారు.

బాల సరస్వతీ గ్రంథాలయము—ఇది శా.శ. 1844లో (1922) అఫ్జల్‌గంజిలో స్థాపింపబడినది. అప్పటి స్థాపక నిర్వాహకులు నాగులపల్లి కోదండ రామారావుగారు. ఆనాటి ప్రజారంగమున ఎన్. కె. రావుగారు సుప్రసిద్ధులు. భాగ్యనగరమందలి అనేక సంస్థలతో వీరికి సన్నిహిత సంబంధముండెడిది. పోలీసుచర్య అనంతరము హైదరా బాదుకు భారత ప్రభుత్వ ఏజెంట్ జనరలుగా నుండిన కె. యమ్. మున్షీగారికి అప్పటి స్టేట్ కాంగ్రెస్ ప్రముఖ నాయకుడు స్వామీ రామానందతీర్థకు లైజాన్ ఆఫీసరుగా నుండినారట. భాషానిలయము తరువాత అంతటి కేంద్రముగా పనిచేసిన గ్రంథాలయమిది.

వేమన ఆంధ్రభాషా నిలయము - శా.శ. 1845లో (1-10-1923) మొదట సిద్ధియంబర్ బజారు రోడ్డున ఉస్మాన్‌గంజికి సమీపమునగల ఒక అద్దె యింటిలో

కొండా వెంకటరంగారెడ్డిగారిచే, తెలుగులో తాత్త్వికకవి, ప్రజాకవి అయిన వేమన పేరు మీద నిది స్థాపింపబడినది. దరిమిలా దీనిని శా.శ. 1849లో (1927 జనవరి 1వ తేదీనాడు) నాంపల్లికి తరలించిరి. అది అద్దె భవనము. పిమ్మట శా.శ. 1852లో (1930) స్వంత స్థలమును సంపాదించి నూతన భవనములను నిర్మించిన తరువాత అక్కడికి మార్చబడినది. ఆ రోజులలో ప్రతి సంవత్సరము, కార్తీక బహుళ సప్తమి నాడు వేమన జయంతి వైభవముగా జరుపబడుతుండెడిది. అప్పటి తెలుగు వైతాళికులు, మాడపాటి, సురవరము, రాజాబహదూర్ వెంకట్రామరెడ్డి, బూరుగుల, అడవిబాపిరాజు కురుగంటి సీతారామయ్య ప్రభృతులు ఈ సంస్థను నిత్యకల్యాణము పచ్చతోరణముగా నుంచిరి. గ్రంథముల సంఖ్య కొద్దిగనే యున్నను, అమూల్యములయిన గ్రంథములుండుట దీని ప్రత్యేకత. చిరకాలము దీనికి అధ్యక్షులుగానో, కార్యదర్శిగానో ఉండి దీని అభివృద్ధికి కృషిచేసినవారు అక్కినేపల్లి జానకిరామారావుగారు. ఇది ఇప్పటికినీ నడచు చున్నది. ఇటీవలనే స్వర్ణోత్సవములు కూడ జరిగినవి.

రెడ్డి హాస్టలు గ్రంథాలయము—శా.శ. 1840లో (1918) రాజాబహద్దూర్ వెంకటరామరెడ్డిగారు దీనిని స్థాపించిరి. శా.శ. 1846 నుండి 55 వరకు. (1924 నుండి 32 వరకు) దీనికి కార్యదర్శిగా పనిచేసినవారు సురవరం ప్రతాపరెడ్డిగారు. ఇచ్చటనొక గ్రంథాలయము కూడ నెలకొల్పబడినది. సురవరంవారు రాక పూర్వము ఇక్కడ సుమారు వెయ్యి పుస్తకములుండెడివి. వారిక్కడ పనిచేసిన తొమ్మిది, పది సంవత్సరములలో వానిసంఖ్య పన్నెండువేలకు పెరిగినది. సురవరంవారు గ్రంథాలయమునకు క్రొత్త పుస్తకములతోపాటు పాత పుస్తకములను కూడ కొనుట కద్దు. ఒక సందర్భమున కొన్ని పాత పుస్తకముల కట్టలో వీర సావర్కార్ వ్రాసిన **"The war of Independence"** అను పుస్తకము కూడ వచ్చినది. ఆ రోజులలో ప్రభుత్వము నిషేధించిన పుస్తకమది. ఈ గ్రంథమిచట ఉండవచ్చునో లేదో అను విచికిత్సతో వారీ విషయమును రాజాబహద్దూర్ వారి దృష్టికి తెచ్చిరి. ఏ పరాకుననో వారది పట్టించు కొనలేదు. సురవరం వారుకూడ తూష్ణీం భావమును వహించిరి. ఆ పుస్తకము గ్రంథాలయములోనే ఉండిపోయినది. కొన్నాళ్ళకది చిత్రముగా మాయమైపోయినది. ఈ విషయమెట్లో పోలీసువారి దృష్టి కెక్కినది. వారు విచారణచేసి సురవరం వారు ఇది బుద్ధిపూర్వకముగా చేసిన పనియని నేరమారోపించిరి. తక్కిన వసతిగృహ కార్యనిర్వాహక సభ్యులు ఆ యభిప్రాయమును సమర్థించిరి. సురవరంవారు జంకుగొంకుల నెరుగని ఆత్మాభిమానముగల గొప్ప దేశభక్తులు. అది వారు బుద్ధిపూర్వకముగా చేసిన పని

యైనచో సత్యము నంగీకరింపగల ధీరుడు. కాని వాస్తవమది కాదుగదా! ఇట్లు నిష్కారణముగా తమపై బడిన నిందకు బాధపడి వారు రెడ్డి హాస్టలు పదవీ బాధ్యతలకు రాజీనామా యిచ్చిరి. రాజాబహద్దరు వారు కొత్వాలు గావున చేయునదిలేక ఆమోదించిరి. దేశభక్తి పూరితులయిన సురవరము వారి కార్యకలాపములకు కసిబూనిన ప్రభుత్వము, వారిని చిక్కులపాలు చేయుటకు పన్నిన కుహక మిదియని ఊహించుట సుళభము. ఇందువలన కార్యదక్షుడైన ఉత్తమ ప్రజాసేవకుని సేవలను రెడ్డి హాస్టలు కోల్పోవలసి వచ్చినది. ప్రభుత్వమునకీపాటి లాభమైనను చాలినది కాబోలు!

ఆంధ్ర విద్యార్థి సంఘ గ్రంథాలయము—ఇది శా.శ. 1845లో (6-7-1923) నెలకొల్పబడినది. అప్పటి నిర్వాహకులు మా. రామచంద్రరావుగారు.

ఆంధ్రసోదరీ సమాజ గ్రంథాలయము—ఇది శా.శ. 1847లో (12-4-1925) స్థాపింపబడినది. నిర్వాహకురాలు పం. వీరరాఘవమ్మగారు.

శ్రీ వైష్ణవ గ్రంథ నిలయము—దీని స్థాపన శా.శ. 1848లో (22-2-1948) హైదరాబాదులోని సీతారామ్‌బాగ్‌లో జరిగినది. అప్పటి స్థాపక నిర్వాహకులు శృంగారం వేంకటనరసింహాచార్యులుగారు.

దక్కను వైశ్యసంఘ గ్రంథాలయము— దీనిస్థాపన శా. శ. 1848లో (23-6-1926) హైదరాబాదులోని స్టేషన్‌రోడ్డునందు జరిగినది. నిర్వాహకులు మందిళ్ళ జగదీశ్వరయ్యగారు.

ఆంజనేయాంధ్ర భాషానిలయము— ఇది శా.శ. 1848లో (1-12-1926) స్థాపింపబడినది. అప్పటి నిర్వాహకులు నెమలికంటి వేంకటకృష్ణారావుగారు.

పెద్దమంగళారం గ్రంథాలయము— ఇది శా.శ. 1852లో (1930) వేమన ఆంధ్రభాషానిలయము యొక్క పుత్రికగా వెలసినది. ఈ భాషానిలయము వారు తమ గ్రంథములను కొన్నింటిని యీనూతన గ్రంథాలయమునకు బహూకరించుట జరిగినది.

## గ్రంథాలయోద్యమము

శా.శ. 1861—1872 = క్రీ. శ. 1939—1950

ఈ పన్నెండు సంవత్సరముల కాలఖండములోను నగరమున కాస్త ఎన్నదగిన పెద్ద గ్రంథాలయములు స్థాపింపబడిన దాఖలా కానరాదు. ఆయాబస్తీలలో లోలోపలి

చోట్ల కొన్ని చిన్నచిన్న గ్రంథాలయములు వెలసియుండవచ్చును. వాటిని పేర్కొనుట, కొంత కష్టముకూడ. పైపెచ్చు ఈపన్నెండేళ్ళు హైదరాబాదు చరిత్రలో మున్నెన్నడు లేని గడ్డుకాలము దాపురించినది. ఏడవ నిజాం దమననీతి హెచ్చినది. ఇత్తెహాదుల్ ముస్లిమీన్ కార్యకలాపములు విజృంభింప జొచ్చినవి. క్రొత్త గ్రంథాలయములను స్థాపించుటకుగాని, సభలను ఏర్పాటు చేసుకొనుటకుగాని నిజాం ప్రభుత్వ మెన్నో అడ్డంకులు కలిగించుచుండెడిది. శా.శ. 1830లో (1948 సెప్టెంబరు 13వ తేదీనాడు) జరిగిన పోలీసుచర్య అనంతరము మరల గ్రంథాలయోద్యమము పుంజుకొనజొచ్చినదని మాత్రముచెప్పి విరమించుటలెస్స.

ఆ రోజులలో గ్రంథాలయముల నిర్వహణనుగూర్చి మాడపాటి హనుమంతరావు గారు చెప్పిన మాటలను శ్రీ దేవులపల్లి రామానుజరావుగారొకచోనిట్లు పేర్కొనిరి [1]

"ఏగ్రంథాలయమైనా బాగానడిచిందంటే కీర్తి ప్రతిష్ఠలు ఎవరికి వచ్చినప్పటికిని దాని వెనుక దేశానికొఱకు పరితపించే ఒక త్యాగమూర్తి ఉన్నాడని మనము తెలిసికో వలెనని మాడపాటి హనుమంతరావుగారు చెప్పుతుండేవారు".

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ స్థాపనతో ప్రారంభమైన యీగ్రంథాలయోద్యమము హైదరాబాదు నగరమునందేగాక తెలంగాణ మందంతట వ్యాపించి తెలుగు వారిలో గొప్పచైతన్యమును కలిగించినది.



1. "యాభైయేళ్ళ జ్ఞాపకాలు" పుట. 16.

# నాటక రంగము

శా.శ. 1801 - 1960 = క్రీ.శ. 1879 - 1938

శా.శ. 1823లో (క్రీ.శ. 1901) శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము స్థాపింపబడినదని పూర్వోక్తము. అదే సమయమున దీనికనుబంధముగ వెలసిన మఱొక సంస్థ "ఆంధ్రభాషోజ్జీవనీ నాటక సంఘము". పేరునుబట్టి యీ సంఘమును స్థాపించుటలోగల ప్రధానోద్దేశము స్పష్టము. నాటక రచనల ద్వారా లేక ప్రయోగములద్వారా నగరమున ఆంధ్రభాషను పునరుజ్జీవింపజేయుట దీని ముఖ్యలక్ష్యము. అది ఆంధ్రభాషా నిలయము, ఇది ఆంధ్రభాషోజ్జీవని! ఒకటి విజ్ఞాన నిలయము! మఱొకటి కళానిలయము. పండితులతోబాటు పామరులనుసైతమాకర్షించి మనోరంజనమును కలిగించి, చిత్తసంస్కారమును ప్రోదిచేయగల సాధనములలో బలీయమైనది నాటకరంగమనుట జగమెఱిగిన సత్యము. అందుకనే కాబోలు ఈరెండు సంస్థలు ఒకదానివెంట మఱియొకటిగా నెలకొల్పబడినవి! అయితే, ఈ నాటకరంగ నిర్మాణములో స్థాపకులాశించినంతగా, నాటక రచనలు వెలువడిన వైనము కానరాదు. ప్రయోగములు మాత్రము విరివిగా సాగినట్లు చెప్పవచ్చును. మఱొక విషయమేమన ఈ ఆంధ్రభాషోజ్జీవనీ నాటక సంఘము ఆంధ్ర భాషానిలయమువలె చిరకాలము వర్ధిల్లినసంస్థకాదు. కొద్దికాలమునకే అంతరించిపోయినది. అసలు నాటక సంఘముల చరిత్రయే అంత! అవి కొంతకాలము చుఱుకుగా పనిచేయును. పిమ్మట పడిపోవును. కాని, యీనాటక సంఘము ననుసరించి ఆస్ఫూర్తితో క్రమముగా అనేక సంఘములు వెలువడినవి. ఆ విషయమును పరామర్శింతము.

"ఆంధ్రభాషోజ్జీవనీ నాటక సంఘము" స్థాపనాకాలము శా.శ. 1823 క్రీ.శ. 1901. స్థాపకుల పేరు తెలియదు. ప్రోత్సాహకులు మాత్రము కొమర్రాజు లక్ష్మణ రావుగారు. నాలుగైదు సంవత్సరములు మాత్రము పనిచేసినది. చెదురుమదురుగా కొన్ని తెలుగునాటకములను ప్రదర్శించినది. అభివృద్ధికి రాలేదు.

కృష్ణవిలాసినీ సభ—ఇది శా.శ. 1828లో (క్రీ.శ. 1903) హైదరాబాదులో స్థాపింపబడినది. స్థాపకులు ధర్మవరం గోపాలకృష్ణమాచార్యులుగారు. వీరు ఆంధ్ర

నాటక పితామహ, ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారి సోదరులు. ఇది కొంతకాలము చక్కగా పనిచేసి ఆగిపోయినది.

హైదరాబాద్ అమెచ్యూర్స్—ఇది శా.శ. 1832 (1910)లో హైదరాబాదులో స్థాపింపబడినది. స్థాపకులు భారతకోకిల శ్రీమతి సరోజినీనాయుడుగారి మేనల్లుడు ఇనుగంటి అనునాయన. వీరు ఇంగ్లీషు హిందీ, నాటకములతోపాటు కొన్ని తెలుగు నాటకములనుకూడ ప్రదర్శించిరి. ఈతడు స్వయముగా మంచినటుడు.

ఫ్రెండ్స్ యూనియన్—ఇది శా.శ. 1837లో (1915) హైదరాబాదులో నెలకొల్పబడినది. స్థాపకుడు నారాయణదాసు. దర్శకుడు, నటుడు, పైన పేర్కొనబడిన "హైదరాబాద్ అమెచ్యూర్స్" నుండి చీలిపోయిన వ్యక్తులే యీ సంస్థగా నేర్పడిరి. వీరు ప్రధానముగా ఆంగ్లనాటకములనే ప్రదర్శించుచుండెడివారు. క్వాచిత్కముగా మాత్రమే తెలుగు నాటకముల నాడుచుండెడివారు.

సంఘ సంస్కార నాటకమండలి—ఇదికూడ శా.శ. 1837లో (1915) హైదరాబాదులో స్థాపింపబడినది. స్థాపకులు భాగ్యరెడ్డివర్మ. హరిజనులు, హైదరాబాదు నగరమున సంఘ సంస్కర్తగా, హరిజనోద్ధారకుడుగా పేరు మోసిన వ్యక్తి. ఇందలి నటులందరు హరిజనులే. ఎన్నో తెలుగు నాటకములను ప్రదర్శించి హరిజనుల కొరకు సంఘ సంస్కారోద్యమమును నిర్వహించిరి. కళ కళకోసము కాదు. ప్రజల కొరకు, వారి జీవితమును చైతన్యవంతము చేయుటకొరకు అని నిరూపించిన వ్యక్తి.

వాణీ విలాస సభ—ఇదియును శా.శ. 1837లో (1915) సికిందరాబాదులో స్థాపింపబడినది. స్థాపకులు సి.టి. మోహనరంగం పిళ్ళే. ఈతడు నాయకపాత్రధారి. కె. శేషయ్య అనువ్యక్తి నాయికా పాత్రలను ధరించుచుండెడివారు. సికిందరాబాదులోని రాజా నాగన్న దేవిడీలో (ఇప్పటి అంజలి సినిమా టాకీసు ప్రాంగణము) తరచు వీరి నాటకములు ప్రదర్శింపబడుతుండెడివి. ఎ.టి. రామానుజులు అను పేరు పొందిన వ్యక్తి యీ సభకు హార్మోనిష్టు. ఈతడు ఆంధ్రప్రాంతమున ప్రసిద్ధిచెందిన మైలవరం నాటకం కంపెనీలో చాలాకాలము హార్మోనిష్టుగా పనిచేసెను. రసానుగుణమైన రాగములో పద్యమును కట్టుటలో అందెవేసిన చేయి. ఈ వాణీ విలాస సభవారు ఒక్క హైదరాబాదులోనేగాక యావదాంధ్రములోని ముఖ్యపట్టణములన్నింటిలో తమ నాటకములను ప్రదర్శించి యుండిరి.

సరస్వతీసభ — ఇది శా.శ. 1842లో (1920) సికిందరాబాదులో వెలసినది. ఇది సి టి. మోహనరంగంపిళ్ళేగారి వాణీవిలాస సభకు పోటీగా బయలుదేరిన సంస్థ.

శ్రీకృష్ణమనోల్లాసినీసభ — దాదాపు ఇదే సమయమున సికిందరాబాదులోనే వెలసిన మరొక సంస్థ యిది.

ఈ రెండు సంస్థలు శా.శ. 1851 ప్రాంతమున (1929) ఒకటిగా కలిసిపోయి చాలకాలము వివిధ తెలుగు నాటకములను ప్రదర్శించిరి. పి.యమ్. వేణుగోపాలస్వామి అనునాయన యీ సంస్థలో పేరు పొందిన నటుడు, దర్శకుడు.

ఆంధ్ర మిత్రమండలి — ఇది శా.శ. 1852లో (1930) ఆడిక్‌మెట్‌లో నెలకొల్పబడినది. ఇది చాల కొద్దికాలమే పనిచేసి మాసిపోయిన సంస్థ, తక్కిన వివరములు తెలియరావు.

కళామండలి — ఇది శా.శ. 1854లో (1932) హైదరాబాదులో స్థాపింపబడినది. వివరములు తెలియవు.

జగదీశనాట్యమండలి — ఇది శా.శ. 1854లో (1932) సికిందరాబాదులో స్థాపింపబడినది. స్థాపకులు బుచ్చయ్యగారు. వీరు నటులు, దర్శకులుకూడ. లాలాగుడా రైల్వే ఉద్యోగులు. వీరి నాయకత్వమున స్థాపించుకొన్న సంస్థ యిది. బుచ్చయ్యగారు సురవరం ప్రతాపరెడ్డిగారికి మిత్రులు. సురవరంవారు వ్రాసిన భక్తతుకారామ్ నాటకమును ఈ సంఘమువారు ప్రదర్శించుచుండెడివారు. సురవరంవారు తొలుత ఈనాటకమును మూడంకములుగా మాత్రమే వ్రాసిరి. దరిమిలా ఈ నాటకసంఘమువారి కోరికపై అయిదంకములుగా పెంచి వ్రాసిరి. ఈసంస్థవారీ నాటకమును హైదరాబాదులోనేగాక యావదాంధ్రదేశములోని ప్రధానపట్టణములలోను,మద్రాసునగరమునందుకూడ ప్రదర్శించిరి. భక్తి, శాంతరసప్రధానమైన తుకారామ్ పాత్రను బుచ్చయ్యగారే నటించెడివారు. ఈ నాటకమును ఈ సంస్థవారు మొత్తము పన్నెండుసార్లు ప్రదర్శించినట్లు డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారు పేర్కొనిరి.[1] ఇది సురవరం వారి నాటకము. దీనిని ప్రదర్శించుటవలన జగదీశ నాట్యమండలికి నాటకరంగ చరిత్రలో విశిష్టస్థానము దక్కినది.

ఇక్కడొక విషయమును ప్రస్తావించుట అప్రస్తుతముకానేరదు. క్రీ.శ. 1936 ప్రాంతమున విజయవాడవైపునుండి కొన్ని సుప్రసిద్ధ నాటకకంపెనీల వారొచ్చి ఈ నగరమున నాటకములను ప్రదర్శించుచుండెడివారు. హైదరాబాదునందు వివేకవర్ధనీ థియేటర్‌లోను, సికిందరాబాదునందు రాజానాగన్నదేవిడీలోను ఇవి జరుగుచుండెడివి

1. "తెలుగునాటక వికాసం" పుటలు 547.

హైదరాబాదునందుకంటె సికింద్రాబాదులో ఇట్టి నాటకములకు గిరాకీ యెక్కువ. క్రీ.శ. 1936 లో గుంటూరునుండి బలిజేపల్లి లక్ష్మీకాంతముగారు తమ సభ్యులతో వచ్చి సికిందరాబాదులో తాము వ్రాసిన సత్యహరిశ్చంద్ర నాటకమును ప్రదర్శించిరి. అందు స్వయముగ వారే నక్షత్రకపాత్రను ధరించిరి. ఈ నాటకమును చూసిన వారిలో శ్రీ దేవులపల్లి రామానుజరావుగారొకరు ఈవిషయమును ప్రస్తావించి వారు-తాము చిన్నతనములోనే తెలుగు సాహిత్యమువైపు ఆకర్షితులగుటకు ఈ నాటక ప్రదర్శనలుకూడా కారణమని పేర్కొనిరి।

## నాటకరంగము

శా.శ. 1861-1872 = క్రీ.శ. 1939-1950

హైదరాబాదుకు సంబంధించినంతవరకు ఈ పన్నెండేళ్ళ కాలఖండము రాజకీయముగ చాలగడ్డుకాలము. 1948లో జరిగిన పోలీసుచర్యకు ఈవల అవలకూడ భీతావహ పరిస్థితి యేర్పడుటవలన ఒక్క రాజకీయరంగము చురుకుగా పనిచేసినదిగాని తక్కిన రంగములన్నియు కుంటుపడినవి. గ్రంథాలయోద్యమ విషయము పూర్వోక్తము. నాటక రంగ విషయముకూడ నంతే. అయిననూ కొన్ని చిన్నచిన్న నాటకసంస్థల వివరములు లభించుచున్నవి. అవిదిఙ్మాత్రముగ పేర్కొనబడుచున్నవి.

ఆదర్శ నాట్యకళా పరిషత్తు స్థాపన శా.శ. 1871 (1949) హైదరాబాదు.
దుర్గాకళానాట్యమండలి-స్థాపన శా.శ. 1871 (1949) హైదరాబాదు.
నాట్యకళాసమితి—స్థాపన శా.శ. 1871 (1949) సికిందరాబాదు.
నవ్యకళాసమితి-స్థాపన శా.శ. 1872 (1950) సికిందరాబాదు.

స్థాపకులు భట్టిప్రోలు జయరామారావు, శిష్ట్లం సత్యనారాయణగుప్త. జూలూరు వీరేశలింగం, చిల్లర భావనారాయణ, చిల్లర ఆంజనేయులు మొదలైనవారు. కింగ్స్‌వేలో నాలా బజారునందున్న నరసింహస్వామి దేవాలయంలో వీరి రిహార్సల్సు జరుగుచుండెడివి. అక్కడే ఒక చిన్నగదిలో ఈ సంస్థ కార్యాలయము కూడ ఉండెడిది. "కన్యకా పరమేశ్వరి" "కళాభిరుచి" అను నాటకములను వీరు ప్రదర్శించుచుండెడివారు.

నవకళాకేంద్రము—స్థాపన శా.శ. 1873 (1951) సికిందరాబాదు.
విస్తృతి నాట్యమండలి—స్థాపన శా.శ. 1874 (1952, సికిందరాబాదు.
సన్మిత్ర నాట్యమండలి—స్థాపన శా.శ. 1875 (1953) హైదరాబాదు.
లలితకళానికేతన్—స్థాపన శా.శ. 1875 (1953) హైదరాబాదు.

# పరిశోధనా రంగము

శా.శ. 1801 1860 = క్రీ.శ. 1879–1938

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయము, ఆంధ్రభాషోజ్జీవనీ నాటకసంఘముల తరువాత వెంటనే పేర్కొనవలసినది పరిశోధనారంగమునుగూర్చి. ఇదికూడ భాషా నిలయములోనే ప్రారంభింపబడినది. దీనికికూడ శ్రీకారము చుట్టిన మహనీయుడు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారే. భాగ్యనగరమున పరిశోధనారంగమున మొట్ట మొదట వెలసిన సంస్థ "విజ్ఞాన చంద్రికా గ్రంథమాల". ఇది శా.శ. 1828లో (1906) స్థాపింపబడినది. స్థాపకులు లక్ష్మణరావుగారని చెప్పుట చర్విత చర్వణము. ప్రోత్సాహకులు మునగాలరాజా శ్రీ నాయని రంగారావుగారు. ఈ గ్రంథమాల ద్వారా పదార్థ విజ్ఞాన - పారిశ్రామిక - ప్రకృతి - భౌతిక - రసాయన - వృక్ష - జీవ-వైద్య శాస్త్రగ్రంథములును, దేశచరిత్రములును, మహాపురుషుల జీవిత చరిత్రములును ప్రకటింపబడినవి. వీటిలో శ్రీ కొమర్రాజువారు స్వయముగా వ్రాసిన గ్రంథములలో ప్రత్యేకించి పేర్కొనవలసినది శివాజీచరిత్ర. ఒకటి రెండటు ఇటు ఈ గ్రంథములన్నియు తొలి రెండు మూడు సంవత్సరములలో హైదరాబాదునందే ప్రచురింపబడినవి. పిమ్మట ఈసంస్థ శా.శ. 1870లో (1908) హైదరాబాదు నుండి మద్రాసునకు తరలింపబడినది. భాగ్యనగరమున అనంతరకాలమున వెలువడిన ఆయాపరిశోధనా భాషాసంస్థల కిదొక ఒజ్జబంతియైన "నమూనా" సంస్థగా విలసిల్లినదనుట ఏపాటిమాట !

దరిమిలా నెలకొల్పబడిన మఱొక పరిశోధనాసంస్థ "లక్ష్మణరాయ పరిశోధక మండలి". లక్ష్మణరావుగారు శా.శ. 1844లో (1922) కీర్తిశేషులైరి. అదే సంవత్సరము వారి స్మారకార్థము ప్రముఖ పండితులచే స్థాపింపబడిన సంస్థయిది. దీనికి చిరకాలము కార్యదర్శిగ పనిచేసిన మహనీయుడు కీ. శే. ఆదిరాజు వీరభద్రరావుగారు. తెలంగాణమునందలి తెలుగువారి చరిత్ర, సంస్కృతి మొదలైన విషయములకు సంబంధించిన మౌలికాంశములను సేకరించి ప్రచురించుటయన్నది యీ మండలి ప్రధాన లక్ష్యములలో నొకటి. ఆమేరకు మండలి సభ్యులు ఊరూర వాడవాడ పర్యటించి

గలిగిరి. ఇందువలన తెలుగువారి సంస్కృతీ చరిత్రలకు చెందిన అమూల్య విషయము లెన్నో వెలికివచ్చినవి. అవన్నియు అక్కడపడు మేఱకు గ్రంథరూపమున ప్రకటింపబడినవి. అట్లు ప్రకటింపబడిన మూడు గ్రంథములలో "షితాబ్ ఖాన్ అను సీతాపతి రాజు" శాసనము చాల ముఖ్యమైనది. దీనినిగూర్చి లక్ష్మణరావుగారే కొంత సేకరించి పెట్టిరి. వారి మరణమునకు పిమ్మట దానికొక సమగ్రతను సమకూర్చి పుస్తకరూపమిచ్చినవారు ఆదిరాజువారు. ఈ మండలికి తరువాతి కాలమున ఆంధ్రసారస్వత పరిషత్తు కార్యస్థానమైనది ఇప్పుడిది నామమాత్రావశిష్టమైనది. ఈ అస్తినాస్తివిచికిత్సలో అస్తి యని మాత్రము చెప్పుటలెస్స.

"ఆంధ్ర పరిశోధక సంఘము"అను మఱొక పరిశోధనా సంస్థ శా.శ. 1846లో (1924) వెలసినది. ఇది "ఆంధ్ర జనకేంద్ర సంఘము"న కనుబంధముగ నేర్పడినట్లు తెలియుచున్నది. కాలక్రమముననిది లక్ష్మణరాయ పరిశోధక మండలిలో విలీనమైనది. పనిచేసిన యీ కొద్దికాలములో పరిశోధనా రంగమున నిది కావించిన కృషిమృగ్యము.

## పరిశోధనా రంగము

శా.శ. 1861—1872 = క్రీ శ. 1939—1950

ఈ పన్నెండేళ్ళ కాలఖండములో వెలసిన ప్రధానమైన పరిశోధనా సంస్థ "విజ్ఞాన వర్ధినీ పరిషత్తు" ఇది శా.శ. 1863లో (1941 నవంబరు 27వ తేదీ) స్థాపింపబడినది. స్థాపకులు సురవరం ప్రతాపరెడ్డిగారు. గోల్కొండ పత్రికా కార్యాలయమున స్థాపింపబడి ఒక దశాబ్దముపాటు వర్ధిల్లిన సంస్థయిది. ప్రతాపరెడ్డిగారు "విజ్ఞాన వర్ధినీ" అన్న శీర్షికన గోల్కొండ పత్రికలో తఱచుగ క్రొత్త క్రొత్త విషయములనుగూర్చి వ్రాయుటయో వ్రాయించుటయో చేయుచుండెడివారు. పిమ్మట నాపేరుతోనే యీ పరిషత్తు ప్రారంభింపబడినది. భాగ్యనగరమున మంచి రచయితలను, కవులను తయారు చేయుటయు, పరిశోధనాత్మక గ్రంథములను ప్రచురించుటయు ఈ పరిషత్తు యొక్క ప్రధాన లక్ష్యములు. ఇందులో సభ్యులుగా చేయుటకు ప్రతివారికిని అవకాశము లేకుండెను. విజ్ఞాన పిపాసగలిగి, కొంతరచనా పాటవముగల వారికే అవకాశముండెను. వీరికి మార్గదర్శనము చేయుటకు పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి, ఆదిరాజు వీరభద్రరావు, ఖండవల్లి లక్ష్మీరంజనం [illegible]

రెండు సార్లు సమావేశమై తాము వ్రాసి తెచ్చిన వ్యాసములు చదువుట, దానిపై తక్కిన సభ్యులు చర్చించుటయను కార్యక్రమము తప్పక జరుగుచుండెడిది.

ఈ సంస్థ పక్షమున అమూల్యములైన గ్రంథములు కొన్ని ప్రచురింపబడినవి. "రామాయణ విశేషములు" (ఇది సురవరంవారి సుప్రసిద్ధ రచనలలో నొకటి) మృత్యు సిద్ధాంతము. అలంకార వతంసము, ప్రతాపరుద్రయశోభూషణము, ఆంధ్రలిపి సంస్కరణము. గంగాపురమాహాత్మ్యము, యువజన విజ్ఞానమువంటి విషయ వైవిధ్యముగల గ్రంథములివి. వీనిలో పరిమాణమున కొన్ని ఉద్గ్రంథములున్నవి. ప్రచురించుట వ్యయప్రయాసలతో కూడినపని. అయినను ఈ పరిషత్తు తట్టుకొని పదేళ్ళు పనిచేయుట ప్రశంసనీయము. భాగ్యనగరమున ఆనాడు పండితశబ్దవాచ్యుడైన ప్రతివ్యక్తిని కూడగట్టుకొని ఒక వేదిక మీదకుతెచ్చి, కృషిచేయించి పరిశోధనా రంగమున క్రొత్త మలుపును తెచ్చినవారు సురవరమువారు.



# ఆంధ్రోద్యమము

శా.శ. 1801-1860 = క్రీ శ. 1879-1938

శా.శ. 1343 లో (క్రీ.శ. 1921 నవంబరు 12) నగరమున జరిగిన ఒకానొక సంఘటనను పురస్కరించుకొని ఈ ఉద్యమము బయలుదేరినది. ఆకథానకమిది:

ఆనాటి రాత్రి వివేకవర్ధినీ థియేటరునందు హిందూ మతసంస్కార సభ యేర్పాటు చేయబడినది. తెలుగు, కర్నాటక, మహారాష్ట్ర ప్రముఖులందరు సమావేశమైరి. సభకు అధ్యక్షత వహించిన మహనీయుడు పూనాకు చెందిన కార్వేపండితుడు. వక్తలందరు ఎవరి మాతృభాషలో వారు మాట్లాడిరి. తెలుగువారి వంతు వచ్చినప్పుడు మొదట మాడపాటి హనుమంతరావుగారు ప్రసంగించిరి. సభ్యులందరు ప్రశాంతముగ వినిరి. పిమ్మట చేక్‌మాల్ రంగారావు అనే న్యాయవాది ప్రసంగించుటకు ప్రారంభించెను. ఆంధ్రేతరులు అవహేళన చేసిరి. వెంటనే తెలుగువారు తమ తీవ్రనిరసనను తెలియజేసి సభనుండి నిష్క్రమించిరి. వెంటనే అదే రాత్రి అందరూ త్రూపుబజారులోని చేకుమాల్ రంగారావుగారింటిలో, వారి అధ్యక్షతన సమావేశమై "ఆంధ్రజన సంఘము'' అను సంస్థను స్థాపించిరి, బారిష్టర్ ఆర్. రాజగోపాల్‌రెడ్డి అధ్యక్షులుగ, మాడపాటి హనుమంతరావు కార్యదర్శిగ కార్యనిర్వాహకవర్గమేర్పడి, చురుకుగా కార్యకలాపములను సాగించుచుండెను.

నగరమున నడచుచున్న ఈసంఘముయొక్క కార్యకలాపములనుండి స్ఫూర్తిని పొంది తెలంగాణములో పలుతావులందు దాదాపు యాభై జనసంఘము లేర్పడినవి. శా.శ. 1845లో (1923) ఈశాఖలన్నిటికీ కలిపి నగరమున "ఆంధ్రజన కేంద్ర సంఘమవతరించినది. మాడపాటివారే మరల దీనికి కార్యదర్శిగ ఎన్నుకోబడిరి. వారు ప్రజలలో మాతృభాషాభిమానమును రేకెత్తించుటకు విశేష కృషిచేసిన మహనీయుడు. ఆంధ్రజనకేంద్రసంఘ నియమావళిలోని ప్రధానాశయములివి :

ఆంధ్రుల అభివృద్ధికొఱకు సంఘములు స్థాపించుట, సమావేశములు జరుపుట, గ్రంథాలయములను, పఠనాలయములను నెలకొల్పుట పాఠశాలలు స్థాపించుట, విద్యా

ర్థులను ప్రోత్సహించుట, విద్వాంసులను గౌరవించుట, తాళపత్రగ్రంథములను సేకరించుట, శాసనములను సేకరించుట, ఆంధ్రవాఙ్మయ ప్రచారమునకై పరీక్షల నేర్పాటు చేయుట, ఆంధ్రభాషాప్రచారమునకు పలయి యత్నములు సలుపుట, కళలను ప్రోత్సహించుట, మొదలైనవి.

ఆశ్చర్యమేమన యీ అన్నివిషయములలోను విజృంభించి పనులు సాగినవి. ప్రజాచైతన్య మువ్వెత్తుగ పైకిలేచినది. ప్రతిసంవత్సరము ఆంధ్రమహాసభలు అన్న పేరుతో తెలంగాణ జిల్లాలలో వార్షిక సభలు ప్రారంభమైనవి, ప్రథమాంధ్ర మహాసభ శా.శ. 1852లో (1930) జోగిపేటలో జరిగినది. సప్తమాంధ్ర మహాసభలు శా.శ. 1860లో (1938 ఏప్రిల్‌నెల) హైదరాబాదు సమీపమందలి మల్కాపురములో జరిగినవి. ఈ మహాసభ నాటికి తెలుగుభాషా సమస్య నిరాదరింపబడి ఆర్థిక రాజకీయ సమస్యలు తలయెత్తినవి. ఇంతకుముందు నిజామాబాదులో జరిగిన మహాసభలోనే ఈ ధోరణిని పసిగట్టిన సుప్రసిద్ధ భాషాసేవకులైన సురవరం ప్రతాపరెడ్డిగారు ఆంధ్రోద్యమమునుండి చీలిపోయి యువకుల సహకారముతో "అభివృద్ధి పక్షమును" స్థాపించిరి. ఆంధ్రోద్యమము భాషాసాహిత్యోద్యమముగానే కొనసాగవలయునుగాని రాజకీయముల జోలికి పోరాదని వీరి ఉద్దేశము. ఆ ఉద్దేశముతోనే ఈ అభివృద్ధి పక్షమునుస్థాపించిరి. కాని మల్కాపురములో జరిగిన ఏడవ మహాసభలో రాజకీయములకు ప్రాధాన్యము హెచ్చుటచేతను, రావి నారాయణరెడ్డిగారి నాయకత్వమున కమ్యూనిష్టు ధోరణికూడ ప్రవేశించుటచేతను ఆంధ్రోద్యమము తన మార్గము నుండి పట్టుతప్పుచుండెను. అభివృద్ధి పక్షము ఏమియు చేయలేకపోయెను. దీనికితోడు ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థ ఉగ్ర రాజకీయ ప్రచారమునకు పూనుకొనుటయేగాక హిందూమత సంస్కృతులనే తుద ముట్టించుటకు ప్రారంభించెను. సరిగ్గా ఈ సమయముననే, 1938లో స్టేట్ కాంగ్రెస్ స్థాపింపబడినది. దానికి సమావేశకర్త బూరుగుల రామకృష్ణరావు. 1939లో "నిజాం రాష్ట్ర కమ్యూనిస్టుపార్టీ యేర్పడినది. రావినారాయణరెడ్డిగారిందులో సభ్యులు. ఇది మొదట రహస్యము. కాలక్రమమున వారే బైటపెట్టిరి. ఆంధ్రోద్యమములోని నాయకులు కూడ కొందరటు కొందరిటు ఈరెండురాజకీయ పక్షములకు నాకర్షితులయిరి. కాని ఆంధ్రమహాసభల నాయకత్వము చేతినుండి జారిపోనీకుండుటకు వీరు, చేజిక్కించుకొనుటకు వారు ముసుగులో గ్రుద్దులాటలుగ ప్రయత్నించుచుండిరి.

# ఆంధ్రోద్యమము

శా.శ. 1861-1872 = క్రీ శ. 1939-1950

దశమాంధ్రమహాసభ శా.శ. 1865లో (1943) మరల హైదరాబాదునగరమున జరిగెను. మితవాదుల పక్షమున కొండా వెంకటరంగారెడ్డిగారు, కమ్యూనిస్టుల పక్షమున బద్దం ఎల్లారెడ్డిగారు అధ్యక్షపదవికి పోటీచేసిరి. రంగారెడ్డిగారు గెలిచిరి. కమ్యూనిస్టులు సూర్యాపేటలో జరిగిన భూమి సత్యాగ్రహములో పాల్గొన్నందువలన ఆంధ్రమహాసభలో సభ్యులుగనున్న అట్టివారినందరినీ సభనుండి తొలగించిరి. ఈసమావేశములో హైదరాబాదు సంస్థానమున తాత్కాలిక ప్రభుత్వస్థాపనకు సంబంధించిన విషయములు చర్చింపబడినవి. ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థయొక్క ఫాసిష్టుధోరణులు నిరసింపబడినవి.

ఆంధ్రోద్యమముయొక్క చిట్టచివరి మహాసభ శా.శ. 1868 లో [1946] మెదక్‌జిల్లా కందిగ్రామమున జరిగినది. ఇది పదమూడవసభ. ఇప్పటికే రెండువర్గములుగా తన్నుకొనుచున్న వీరు, ఈ సభ తరువాత ఒక వర్గమువారు కాంగ్రెస్‌లోను మరొకవర్గమువారు కమ్యూనిస్టుపార్టీలోను చేరిపోయిరి. ఇట్లుఆంధ్రోద్యమముక్షీణించినది.

సారాంశ మిది : శా.శ. 1843లో (1921) ఆంధ్ర జనసంఘము ఏర్పడినది. అది శా.శ. 1845లో (1923) ఆంధ్రజన కేంద్ర సంఘముగా మారినది. పిమ్మట శా.శ. 1852లో (1930) ఆంధ్రమహాసభగా మార్పు చెందినది. ఇప్పటివరకు ఇదొక దశాబ్దము. ఈ దశాబ్దిలో దీని యాదర్శములన్నియు తెలుగుప్రజల భాషా సాహిత్య సాంస్కృతిక అదర్శములే. నిర్వహింపబడిన కార్యకలాపములన్నియు తదనుసారముగా సాగినవే. శా.శ. 1852 నుండి (1930) 1860 వరకు (1938) మొత్తము ఏడు వార్షిక మహాసభలు నిర్వహింపబడినవి. ఇదొక ఎనిమిదేళ్ళు. ఈ ఎనిమిదేళ్లలో కూడ ప్రధానముగ తన సాంస్కృతికాదర్శములను విడనాడక, వీటితోపాటు ప్రజల హక్కులకొరకు పోరాడే సంస్థగా రూపుదాల్చి రాష్ట్రములో బాధ్యతాయుత పరిపాలన సాగవలెనని ప్రకటించి పోరాటమును సాగించినది. ఈ యేడు మహాసభల సందర్భములలో గ్రంథాలయ సభలు, సాహిత్య సభలు, మహిళాసభలు, ఇవన్నియుగాని, ఏదో ఒకటిగాని తప్పకుండా జరుగుతూ వచ్చినవి. విద్యా పునర్నిర్మాణము, నిర్బంధ ప్రాథమికవిద్య, బాలబాలికలకు మాతృభాషద్వారా ఉన్నతవిద్య గరపుట మొదలగు విద్యా, భాషా, సాహిత్య

విషయములకు సంబంధించిన తీర్మానములు చేయుచూ వచ్చినవి. ఈ విధముగా నిది భాషా సాహిత్య సాంస్కృతికోద్యమముగానే ముమ్మూర్తులా వర్ధిల్లినది. దాదాపు ఈ 18, 19 సం॥ కాలములో సదరు ఉద్యమము యొక్క మూల విరాట్టు మాడపాటి హనుమంతరావుగారే. ఆ పిమ్మట దశలో పోరాటము తీవ్రమై, రాజకీయములు ప్రవేశించి దాదాపు రాజకీయ సంస్థగా మారజొచ్చినది. ఈ దశలో మాడపాటివారు చురుకుగా పాల్గొన్నవారు కారు. తూష్ణీంభావము వహించిరి.

రాజకీయములకు దూరముగానుండిరేగాని తదితర వివిధరంగములందును, విద్య భాష-సాహిత్యము-పత్రికలు-మొదలైన వాటియందు ఎన్నో కార్యక్రమములు చేబట్టి తెలంగాణమును జాగృత మొనరించిరి. ఆయా సందర్భములలో తక్కిన విషయములు వివరింపబడును.



# సాహిత్య సంస్థలు

శా.శ. 1801–1860 = క్రీ.శ. 1879–1938

శా.శ. 1856లో (క్రీ.శ. 1934) సురవరం ప్రతాపరెడ్డిగారి సంపాద కత్వమున గోల్కొండ కవుల సంచిక వెలువడినది. ఇంతటితో హైదరాబాదు నగర మున పెద్ద సాహిత్య కోలాహలము చెలరేగినది. ఇంతకుముందు నగరమున సాహిత్య వ్యాసంగము లేదనికాదు. భాషానిలయము, నాటక సంఘములు, పరిశోధనా సంస్థలు, పత్రికలు, ఆంధ్రోద్యమము మొదలగు వానిద్వారా సాహిత్యపరమైన వాతావరణము కొంతయేర్పడినది. ఆ సునువెచ్చని సాహిత్య వాతావరణపువేడిలో రివ్వున పచ్చిపడిన యీ కవుల సంచికవలన అసలైన సాహిత్య రంగము నిర్మింపబడినదనుట నిస్సం దేహము. తెలంగాణ మంతట వలవేసి కవి మత్స్యములను పట్టుకొని వానియందు గర్భీకృతములైయున్న కవితాంగుళీయకములను వెలార్చి సాహిత్య రంగమును నిగనిగ లాడించిన నిజమైన సాహిత్యధీవరుడు ప్రతాపరెడ్డిగారు. మొత్తము 354 మంది కవుల యొక్క 1418 పద్యములిందు పొందుపరుపబడినవి. వీనిలో హైదరాబాదు జిల్లాకు చెందిన 33 కవులున్నారు. నగరమునకు చెందినవారు సుమారు పదిహేనుమంది. ఈ సురవరుని యొక్క కార్య ప్రతాపమునకు ముగ్ధులైన దూపాటి వెంకటరమణా చార్యులుగారు వారినిట్లు ప్రశంసించిరి.

గోలకొండ కవుల కుసుమముల్ సమకూర్చి
దండగుచ్చె మాప్రతాపరెడ్డి
అందుతావులీను అలరు సమర్పింప
బడయమైతి మకట భాగ్యరేఖ.

ఈ సంచిక ప్రభావమున వెనువెంటనే కొన్ని గ్రంథమాలలు, సాహిత్య సంస్థలు భాగ్యనగరమున వెలసినవి. చక్కని సాహిత్యరంగ మేర్పడినది.

"ఆంధ్రకేసరి సంఘము – ఇది శా.శ. 1856లో (క్రీ.శ. 1934) నెలకొల్ప బడినది. ఇది తొలుత "ఆంధ్రకేసరి" పేరుతో లిఖిత మాసపత్రికను నడిపినది. తరు వాత సాహిత్య సంస్థగా మారినది. పిమ్మట గ్రంథమాలగా పనిచేసినది. గుండవరపు

హనుమంతరావు బూరుగుల రంగనాథరావు, కే.సి. గుప్త మొదలైనవారిందు సభ్యులు. వివిధ రూపములలో ఈ వ్యవస్థ కొంతకాలము నడచినది. ఇది స్థాపింపబడిన నాటి కార్యాలయము చిరునామా 178, సుల్తాన్‌బజారు, హైదరాబాదు.

దేశోద్ధారక గ్రంథమాల—ఇది శా.శ. 1860లో (1938) సికిందరాబాదులోని ఇమాంబావిడీ వీధిలో స్థాపింపబడినది. స్థాపకులు వట్టికోట ఆళ్వారుస్వామి. వీరి ఇల్లే దీని కార్యస్థానము. ప్రచురణలు : "హైందవధర్మ వీరులు, ప్రాథమిక స్వత్వములు గ్రంథాలయోద్యమము, కెమాల్‌పాషా జీవితము, ప్రజలు ప్రభుత్వము, బొందు సంస్థానము "నాభారతదేశయాత్ర" గాంధీమహాత్ముడు, కాంగ్రెస్ - సంస్థానములు, సంస్థాన ప్రజల సమస్యలు మొదలైనవి.

అణా గ్రంథమాల- ఇది శా.శ. 1861లో (1939) స్థాపింపబడినది. స్థాపకులు వెల్దుర్తి మాణిక్యరావు, కే సి. గుప్త ప్రభృతులు. దీని ఆనాటి చిరునామా : 3619, తురుపుబజారు, హైదరాబాదు - దక్కన్. వెలువడిన పుస్తకములు : హైదరాబాదు రాజ్యాంగ సంస్కరణలు, రైతు, ఆంధ్రవీరులు, అణాకథలు, స్వామిదయానంద సరస్వతి జీవితము, వినాయకదామోదర్ సావర్కార్, కాంగ్రెస్ చరిత్ర రెండు భాగములు, జాగీర్లు, మొగలాయీ కథలు, ఆంధ్రగేయములు, ఆంధ్రవాఙ్మయము, స్త్రీల సమస్యలు, మాడపాటి హనుమంతరావుగారి కథలు మొదలైనవి. ఈ గ్రంథము లన్నియు వార్షిక చందా పథకము క్రింద ఒక అణాకు ఒక గ్రంథము చొప్పున లభించెడివి. అందుకే దీనికీ పేరు పెట్టబడినది.

## సాహిత్య సంస్థలు

శా.శ. 1861—1872 = క్రీ శ, 1939—1950

సాధన సమితి — ఇది శా.శ. 1861లో (1939) స్థాపింపబడినది. స్థాపక సభ్యులు : బూర్గుల రంగనాథరావు, భాస్కరభట్ల కృష్ణారావు, నెల్లూరి కేశవస్వామి వెల్దుర్తి మాణిక్యరావు, జమ్మలమడక పూర్ణచంద్రరావు, జమ్మలమడక ప్రకాశరావు, ప్రభృతులు. ఆనాటి చిరునామా : 195 బి. 3. ఈసామియాబజారు. హైదరాబాదు, దక్కన్. ముఖ్యోద్దేశము—ఆంధ్ర సాహిత్యసేవ. యువకవులను, నవ్యకవులను ఆంధ్ర వాచక ప్రపంచమునకు పరిచయము చేయుట. సాహిత్యములో వచ్చుచున్న నూతన ప్రక్రియలను- వ్యాసములు, కథలు, నవలలు, గేయములు, వచన కవితలు, సగం

కవితలు- అన్నింటిని యాహ్వానించి ప్రోత్సహించుట. ప్రాచీన నవీన సాహిత్యముల సమన్వయాత్మక భావప్రపంచమును నిర్మించుట మొదలగునవి వీరి ఆశయాదర్శములుగ కాన్పించును. ఆ మేఱకు వీరు కృతకృత్యులైనట్లు భావింపవచ్చును. ఈ సమితివారు గ్రంథరచనలతో సంతృప్తినందక రచయితలను ప్రోత్సహించుటకై కథానికలకును, ఏకాంకికలకును పోటీనేర్పరచి వానిలో ఉత్తమమైన వానికి తగిన బహుమతుల నిచ్చియున్నారు. ఈ సమితిని స్థాపించిన వెంటనే వీరు "ప్రత్యూష'' అను పేరనొక లిఖిత మాసపత్రికను 6 సం॥ నిర్విఘ్నముగ నడిపినారు. ఆపిమ్మట "ప్రత్యూష" ప్రచురణలు అను పేరుతో ఎన్నో పుస్తకములను ప్రచురించినారు.

శా.శ. 1872లో (1950, ఫిబ్రవరి, 2వ తేదీ) విడుదలచేసిన "ప్రత్యూష" పద్యసంకలనము వీరి కృషికి పరాకాష్ఠ. దీనిలో నవ్యులయిన 28 మంది కవులయొక్క పద్యకవితలు, గేయకవితలు, వచనకవితలు ప్రచురింపబడినవి. ఇందులో ముగ్గురు కవయిత్రులుకూడనున్నారు. 1950 నాటికి వీరు మొత్తం 18 పుస్తకములను ప్రచురించినారు 1. అంజలి-గేయములు [వివిధరచయితలు] ప్రేమ్‌చంద్ అనువాదాలు-కథలు నెల్లూరి కేశవస్వామి 3. పరీక్షచదువు-నాటిక-భాగినారాయణమూర్తి, 4. నిర్మాణము-వ్యాసములు-'శ్రీసాధక', 5. పాలవెల్లి-కథలు-వివిధ రచయితలు, 6. భోజరాజు-పద్యకావ్యము-గాడిరాజు వేంకటరమణయ్య, 7. మధుకణములు గేయాలు-పిల్లలమఱ్ఱి వేంకటహనుమంతరావు, 8. సాంధ్యగీతి-నాటిక "సూర్యచంద్రులు" 9. వాహ్యాళి-కథలు-బూర్గులరంగనాథరావు, 10. భగ్నహృదయుడు-నాటిక-భండారు చంద్రమౌళీశ్వరరావు, 11. అనుక్రమాల్యద పర్యాలోకనము-వ్యాసములు—వెల్దండ ప్రభాకరరావు 12. సాహితీవిపణి—గద్యపద్యాత్మికము-వివిధ రచయితలు, 13. నిర్మాణగానము-గేయాలు, శేషుబాబు 14. రంగవల్లి-పోటీకథలు-వివిధ రచయితలు, 15. నవ్య కవితానీరాజనము-వ్యాసాలు—దేవులపల్లిరామానుజరావు, 16. మాయింట్లో-కథలు-ధరణికోట శ్రీనివాసులు, 17. అశోకరాజ్యము-నాటిక-శేషుబాబు, 18. ప్రత్యూష-కావ్యసంకలనము-వివిధ కవులు.

ఈ గ్రంథముల వైవిధ్యమునుబట్టి ఈసమితియొక్క నూతన భావావిష్కారమును గమనింపవచ్చు. నగరమున వెలసిన సంస్థలలో నిదొక ఉత్తమమైన సాహిత్య సంస్థ.

ఆంధ్ర సాహిత్యపరిషత్తు— ఇది శా.శ. 1862లో (1940) స్థాపింపబడినది. స్థాపకులు : ఆచార్య రాయప్రోలు సుబ్బారావు, ఆచార్య కురుగంటి సీతారామయ్య,

మహమ్మద్ ఖాసింఖాన్‌గారలు. ఈ పరిషత్తులో ఈముప్పురే సభ్యులట. దీని ఆనాటి కార్యస్థానము-89, బి, నాంపల్లి, హైదరాబాదు-దక్కన్. ఈపరిషత్తుపక్షమున నిజాం నవాబు జీవితచరిత్ర, ఖురాన్‌షరీఫ్ ఆంధ్రానువాదము ప్రచురింపబడినవి. మఱియు ఆచార్య కురుగంటి సీతారామయ్యగారి యీక్రింది కృతులుకూడ ప్రచురింపబడినవి: 1. అలంకారతత్త్వ విచారము, 2. తంజాపురాంధ్ర నాయకరాజ చరితము, 3. ఆదర్శప్రభువు, 4. నవ్యాంధ్రసాహిత్యవీధులు, 5. కథాత్రయి, 6. కొందరు తంజావూరు కవులు-పండితులు, 7. వ్యాసహారి 4 భాగములు। 8. దాక్షిణాత్య దార్శనికులు-మొదలయినవి.

నిజాంకు వ్యతిరేకముగ ఉద్యమము జరుగుచున్న ఆరోజులలో వీరు నిజాం నవాబు జీవితచరిత్రను, ఆదర్శప్రభువు అన్న పేరుతో ప్రచురించుట నచ్చని, సుర వరం ప్రతాపరెడ్డిగారు ఈ పరిషత్తును నిరసించిరి. ఈ పరిషత్తుకు ప్రారంభోత్స వము చేయుటకు డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు హైదరాబాదుకు విచ్చేసిరి.

వైతాళిక సమితి— ఇది యువకులు నడిపిన సాహితీసంస్థ. నూతన పద్ధతిలో రచనలుచేసే వారికి కూడలిగా నుండినది. దీని పక్షమున ప్రతినెలా ఒక సాహిత్య సమావేశము జరుగుచుండెడిది. దేవులపల్లి రామానుజరావు తమ యాభై సంవత్సరాల జ్ఞాప కాలు' అన్న గ్రంథమున ఈ సమితినిగూర్చి పేర్కొనిరి. వివరములు అలభ్యములు.

ఆంధ్ర సారస్వత పరిషత్తు— ఇది శా.శ. 1885లో (1943 మే 26వ తేదీనాడు) హైదరాబాదులో స్థాపింపబడినది. రెడ్డి హాస్టలులో బూర్గుల రంగనాధరావు, భాస్కరభట్ల కృష్ణారావు సమావేశ కర్తలుగ లోకనంది శంకరనారా యణరావు అధ్యక్షతన జరిగిన తొలి సమావేశములో నిది యేర్పడినది. ఆంధ్ర భాషా సంస్కృతుల పరిరక్షణము. ప్రచారము ఈ పరిషత్తు యొక్క ప్రధాన లక్ష్యము. దీనికొక నియమావళిని, కార్యప్రణాళికను సిద్ధముచేయుటకు మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, బూర్గుల రామకృష్ణారావు. ఆదిరాజు వీరభద్రరావు ప్రభృతులతో నొక ఉపసంఘము నియమింపబడినది. ఈ ఉపసంఘమువారు నిర్ణయించిన ఉద్దేశములు సాధనములు ఇవి :

1. ఉద్దేశములు — (అ) రాష్ట్రేంద్రియులలో మాతృభాషాభిమానమును పెంపొం దించి తద్వ్యాప్తికై పాటుపడుట. (ఆ) ఆంధ్ర భాషాభివృద్ధికై సర్వవిధముల కృషి

2. సాధనములు— (అ) రాష్ట్రము నందలి వివిధ ప్రదేశములందు వాఙ్మ
యము యొక్క వివిధశాఖలతో కూడిన సమావేశములు జరిపి ప్రబోధమును కలిగించుట.
(ఆ) పాఠ్యప్రణాళికను సిద్ధపరచి పరీక్షలు జరుపుట. (ఇ) రాష్ట్రమందలి సారస్వత
సంస్థలను, సారస్వతోపాసకులను ప్రోత్సహించుట. (ఈ) ఉత్తమ గ్రంథములకు
పారితోషికము లిచ్చియు, సమావేశములలో రచయితలను సన్మానించియు, ఇతర
విధముల వారిని ప్రోత్సహించియు, సాహిత్యము, ప్రకృతివిజ్ఞానము, సాంఘికశాస్త్రము
మున్నగు విషయములపై గ్రంథములు వ్రాయించి ప్రకటించుట.

శా.శ. 1885లోనే (1-6-1943 నాడు) రెడ్డి విద్యార్థి వసతి గృహమున
ఈ పరిషత్తు ప్రథమ మహాసభలు జరిగినవి. ఇందులో దీనితొలి కార్యనిర్వాహకవర్గము
ఎన్నుకొనబడినది. అధ్యక్షులు : లోకనంది శంకరనారాయణరావు, ఉపాధ్యక్షులు :
చక్కపట్టణం రామానుజాచారి, శ్రీమతి రంగమ్మ ఓబులరెడ్డి, ప్రధాన కార్యదర్శి :
బిరుదురు వేంకటశేషయ్య, సహాయ కార్యదర్శి : బూర్గుల రంగనాధరావు, కోశాధిపతి ;
గాడపాటి హనుమంతరావు, మరి పదమూడు మంది సభ్యులుకూడ ఎన్నుకొనబడిరి.
పరిషత్తుయొక్క తాత్కాలికకార్యస్థానము గోల్కొండ పత్రికా కార్యాలయము. పిమ్మట
హనుమాన్ టేకిడీకి మార్చబడినది.

సాహిత్య కార్యక్రమములు— పరిషత్తు స్థాపింపబడిన తరువాత హైదరాబాదు
నగరమున ప్రప్రథమముగ శా.శ. 1896లో (14-1-1944) సంక్రాంతి సమావేశములు
జరుపబడినవి. అదే సంవత్సరమున (30-3-44) ఉగాది సమావేశము జరుపబడినది.
శా.శ. 16-4-44నుండి 23-4-44వఱకు నగరములోని ఎనిమిదిస్థానములలో సారస్వత
సప్తాహము నిర్వహింపబడినది. 13-7-44నాడు కొమర్రాజు లక్ష్మణరావుగారి జయంతి
జరుపబడినది. 29-9-44 నుండి 6-10-44 వఱకు ఆంధ్రమహాకవి జయంతి సప్తా
హము సంపన్నమైనది. హైదరాబాదు నందు పింగళిసూరన జయంతి నిర్వహింపబడినది.
తెలంగాణ మందలి యితర జిల్లాలలో మఱియేడుగురు కవుల జయంతులు జరుపబడినవి.

నిజాముపాలనమున గ్రామములయందు పాఠశాలలులేని రోజులు. తాలూకా
కేంద్రములందుసైతము ఉర్దూబోధనాభాషగాగల మాధ్యమిక పాఠశాల ఒకటుండెడి
కాగాని తెలుగు విద్యాలయములు బొత్తుగా లేకుండెను. అందుకొరకు వివిధవృత్తు
లతో జీవించుచున్న తెలుగువారికి ఆబాలగోపాలము తెలుగుభాషలో సులభముగ నుండు
నట్లు పరీక్షలు నిర్వహించు ప్రణాళిక ఒకటి వేయబడినది. దానిప్రకారము ప్రవేశ
పరీక్షలు శా.శ. 1864లోను (జులై 1944), ప్రాథమిక పరీక్షలు అమరుసటి సంవత్స
రము శా.శ 1865లోనూ (అక్టోబరు 1945) హైదరాబాదు, సికిందరాబాదులలో నిర్వ
హింపబడినవి. అట్లే తెలంగాణములోగూడ జరుపబడినవి. పిమ్మట మాధ్యమిక పరీ

క్షలుకూడ పెట్టబడినవి. గ్రామములలో రాత్రి పాఠశాలలు నడిపిన ఘనతకూడ పరిషత్తువారిదే! పరిషత్తుయొక్క కార్యకలాపములు విస్తరించుచున్నకొలది అవసరమగు మార్పులతో చేర్పులతో తిరిగి ఒకటి రెండుసార్లు నూతన నియమావళిని రూపొందించుట జరిగినది. కార్యక్రమములు ముమ్మరముగా జరుగుచున్నకొలది ఇత్తెహాదుల్ ముస్లిమీన్ద్వారా ప్రభుత్వము సాగించుచున్న దమనసీతి పెచ్చుపెరిగిపోయినది. గూండాలు వీరి కార్యకర్తలను కొట్టుట. కార్యక్రమములకొరకు వేసిన పందిళ్ళను తగులబెట్టుట. వార్షిక సభలను నిర్వహించుకొనుటకు అనుమతిని నిరాకరించుటవంటి దారుణకృత్యములు మితిమీరినవి. శా.శ. 1870లో (1948 సెప్టెంబరు 13 వ తేదీ నాడు) హైదరాబాదుపై పోలీసుచర్య జరిగినప్పుడు దాదాపొక సంవత్సరము పరిషత్కార్యక్రమములు స్తంభించిపోయినవి. పరిషత్తు స్థాపింపబడిన నాటినుండి శా.శ. 1873 వరకు [1951] మొత్తం ఆరు వార్షికమహాసభలు నిర్వహింపబడినవి. మొదటిది హైదరాబాదులో జరిగినదని పూర్వోక్తము. తక్కినవన్నియు జిల్లాలలో జరుపబడినవి. ఆరవ మహాసభలు మంచిర్యాలలో నిర్వహింపబడినవి. దీనితరువాత తెలంగాణమందంతట విశారద పరీక్షలు నిర్వహింపబడినవి. ఈపరీక్షలలో ఉత్తీర్ణులైన అభ్యర్థులే బూర్గుల రామకృష్ణరావు ముఖ్యమంత్రి అయిన పిమ్మట తెలంగాణ మండలి పాఠశాలలలో తెలుగు ఉపాధ్యాయులుగా నియమింపబడిరి. స్వేచ్ఛావాతావరణములో తెలుగుభాష క్రమాభివృద్ధి నొందజొచ్చినది.

పరిషత్తుద్వారా పండితసారస్వతము, ప్రజాసారస్వతము, బాలసారస్వతము అను మూడు విధముల సాహిత్యగ్రంథములు ప్రచురింపబడినవి, క్రీ శ. 1950 సం॥ వరకు ఇది ప్రచురించిన గ్రంథములలో ఖండవల్లి బాలేందుశేఖరంగారి "ఆంధ్రుల చరిత్ర", సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి "కావ్యాలంకారసంగ్రహము", సురవరం ప్రతాపరెడ్డిగారి "ఆంధ్రుల సాంఘిక చరిత్ర" ముఖ్యమైనవి. ఆంధ్రుల సాంఘిక చరిత్రకు 1955లో కేంద్రప్రభుత్వము ఉత్తమ గ్రంథరచన పేరుమీద 5000 రూపాయలు బహూకరించినది. ఇది పరిషత్తుకు గర్వకారణము. ఇది తెలుగువారికి లభించిన మొదటి జాతీయ బహుమతి.

ఆంధ్రోద్యమము బీటలువారుతున్న దశలో దాని ఆశయాదర్శముల కనుగుణముగ రూపాంతరముగ నవతరించిన సంస్థ ఆంధ్ర సారస్వత పరిషత్తు. ఈనాటివరకు సర్వోత్కర్షలతో వర్ధిల్లుచున్న ఏకైక సంస్థ. ఆంధ్రోద్యమమునకు మాడపాటివారు మూలపురుషులైనట్లు, దాని రూపాంతరమగు సారస్వత పరిషత్తుకు మూలపురుషులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు. 1943 లో స్థాపింపబడిన నాటినుండి యీనాటి వరకు దాదాపు వారే దానికి శ్రీరామరక్ష. అని చెప్పుట అనాలోచితమైనఅతిశయోక్తికాదు.

# విద్యారంగము-తెలుగు

శా.శ. 1801-1860 = క్రీ.శ. 1879-1938

భాగ్యనగరమున తెలుగు విద్యారంగమునకు సంబంధించి మొట్టమొదట పేర్కొనవలసిన విద్యాసంస్థ సికిందరాబాదులోని మహబూబ్ కళాశాల (హైస్కూల్). ఇది శా.శ. 1784లో (క్రీ.శ. 1862) స్థాపింపబడినది. స్థాపకులు సోమసుందర మొదలియార్. ఇది ఇంగ్లీషు మీడియమ్ స్కూలు. మద్రాసు రాష్ట్ర విద్యావిధానము ననుసరించి పాఠ్యప్రణాళిక అమలులో నుండెను. దాని ప్రకారము శా.శ. 1806లోనే (క్రీ.శ. 1884) ఇచట తమిళభాషతోపాటు తెలుగు ద్వితీయ భాషగా బోధింపబడు చుండెను. క్రీ.శ. 20-6-1884 లో ఇచట శ్రీమహాదేవ అయ్యర్ అను పేరుగల తెలుగు పండితుడు పనిచేయుచుండెను. ఆనాడితని జీతము 35—50 రూపాయలు. ప్రఖ్యాత ఆంధ్రమహనీయుడు రఘుపతి వేంకటరత్నం నాయుడుగారు ఈ స్కూలుకు శా.శ. 1821 నుండి 1826 వఱకు (క్రీ.శ. 11-4-1899 నుండి 1904 వఱకు) అయిదారు సంవత్సరములు ప్రిన్సిపాలుగా (హెడ్‌మాష్టరుగా) పనిచేసిరి. ఆసమయ మున వారు అప్పుడప్పుడు సరదాగా కొన్ని తరగతులకు తెలుగు బోధించుచుండెడివారు. క్రీ.శ. 1914-21 వఱకు ఆదిరాజు వీరభద్రరావుగారు తెలుగుపండితులుగా పనిచేసిరి. పిమ్మట అడుసుమిల్లి దత్తాత్రేయశర్మ అనువారు 1938 వఱకు అచట తెలుగును బోధించిరి. వీరు విద్యార్థులకు తెలుగులో చక్కని కథలు చెప్పుటద్వారాను, ఆటపాటల ద్వారాను వారిని బాగా ఆకర్షించెడివారు. వీరి శక్తిసామర్థ్యములను గూర్చిన ప్రశంసలు ఈ హైస్కూలు పాతరికార్డులలో లభించుచున్నవి. వీరికి పిమ్మట శా.శ. 1872 వఱకు (1954) సుప్రసిద్ధ సంస్కృతాంధ్ర విద్వాంసులు సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు ఇచట తెలుగు ఉపాధ్యాయులుగ పనిచేసిరి. ఈస్కూలు ప్రారంభింపబడి నప్పుడు సికిందరాబాదు నందిదొక్కటే స్కూలు. అంతకుముందు ఒక చిన్న ప్రైవేటు స్కూలుండెడిది. అది క్రైస్తవులది. సికిందరాబాదులో అప్పటికి, ఇప్పటికి మహబూబ్ కాలేజి హైస్కూలొక్కటే పెద్దది. ఆతొలిరోజులలో తెలుగుభాషావ్యాప్తిలో తనవంతు సేవను చెల్లించిన ఈ స్కూలు చరిత్ర ప్రశంసనీయము.

ఆది హిందూబాలికల పాఠశాల— ఇది శా శ. 1828లో (1906) హైదరాబాదు, చాదర్‌ఘాట్ ప్రాంతమున నెలకొల్పబడినది. స్థాపకుడు భాగ్యరెడ్డివర్మ, ఈతడు పేదహరిజన కుటుంబమున జన్మించినవ్యక్తి. బాలబాలికలను విద్యావంతులను చేసి నైతికమార్గమున నడిపించు నుద్దేశముతో జగన్మిత్రమండలిని స్థాపించి దాని పక్షమున ఈ స్కూలును నిర్వహించిన వ్యక్తి. తెలుగుభాషను బోధించుటద్వారా చంద్రునకొక నూలుపోగువలె విద్యారంగమున కృషిచేసిన వీరు ప్రశంసార్హులు. ఆస్కూలు ఈనాటికీ వారి కుమారులు శ్రీ గౌతమ్‌గారి ఆధ్వర్యమున పనిచేయుచున్నదని తెలియుచున్నది.

ఆంధ్ర బాలికా పాఠశాల— ఇది శా.శ. 1850లో (1928 జూన్) నారాయణగుడాలో స్థాపింపబడినది. స్థాపకులు తెలంగాణ వైతాళికుడు మాడపాటి హనుమంతరావుగారు. స్త్రీ విద్యా ప్రచారము, తెలుగు భాషావ్యాప్తి అను రెండు లక్ష్యములతో స్థాపింపబడినది. తెలుగు బోధనా భాషగా నెలకొన్న మొట్టమొదటి పాఠశాల యిది. ఈనాటికీ సర్వోత్కర్షతో వర్ధిల్లుచున్నది. 1978 ప్రాంతమున స్వర్ణోత్సవములు వైభవోపేతముగ జరిగినవి. ఇటీవల మాడపాటి హనుమంతరావు స్మారక బాలికల పాఠశాలగా పేరు మార్చుకొన్నది. 1948 ప్రాంతమున శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారిచట ఆంధ్రోపాధ్యాయులుగా పనిచేసిరి. పిమ్మట 1949 నుండి 1953 వఱకు ఆదిరాజు వీరభద్రరావుగారు పనిచేసిరి. ఈనాడు నగరమున సుప్రతిష్ఠితలైన మహిళామతల్లులెందరో యీ విద్యాలయమున విద్య నభ్యసించినవారే.

## విద్యా రంగము - తెలుగు

శా.శ. 1861–1872 క్రీ.శ. 1939—1950

ఆంధ్ర విద్యాలయము— దీని స్థాపన శా. శ. 1866. [1944 మే నెల] సురవరం ప్రతాపరెడ్డిగారి కృషితో నెలకొల్పబడినది. తొలుతనిది మాధ్యమిక పాఠశాల. పిమ్మట శా.శ. 1869లో (1947) ఉన్నత పాఠశాలగా మారినది. తరువాత రెండు విద్యాలయములైనవి. ఒకటి - చిక్కడపల్లిలోని ఆంధ్ర విద్యాలయము, రెండు-ఆబిడ్స్ లోని ఆంధ్ర విద్యాలయము. శా.శ. 1872 తరువాత [1950] కాలాంతరమున ఆంధ్ర విద్యాలయ కాలేజి పేరుతో డిగ్రీ కళాశాలగా మూడవ విద్యా సంస్థ అవతరించినది. ఇది

దోమల్‌గూడాలో నెలకొని యున్నది. స్థాపింపబడిన తొలి రోజులలో దీనికి అధ్యక్షులుగ రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారు, కార్యదర్శిగ సురవరం ప్రతాపరెడ్డిగారు, కోశాధికారిగా మాడపాటి హనుమంతరావుగారు వ్యవహరించిరి. దీని స్థాపనా విషయములో సురవరం వారికి మంచి అండగా నిలిచినవారు, ఆర్. దామోదరరెడ్డి బారిష్టరుగారు. తెలుగు బోధనా భాషగా నెలకొన్న విద్యాలయమిది. ఇప్పటికినీ యీ సంస్థ మూడు పువ్వులారు కాయలుగా విరాజిల్లుచున్నది.

<u>రాజాబహద్దర్ వేంకటరామరెడ్డి మహిళాకళాశాల</u>— దీని స్థాపన శా.శ. 1876. [1954]. స్థాపక నాయకులు మాడపాటివారు తెలుగు బోధనా భాషగా ఆ రోజులలో వెలసిన తొలి కళాశాల. మాడపాటివారికి శా.శ. 1864లో [1942] షష్ఠిపూర్తి జరిగినది. ఆ సందర్భమున అప్పటి నైజాం రూపాయి నాణెములతో (హాలీ నాణెములు) వీరికి తులాభారము జరిపించిరి. ఆదంతయు కలపి 7 వేల రూపాయల నగదు వచ్చినది. అదివారు సొంతమునకు వాడుకొనక బ్యాంకులోవేసిరి. పోలీసుచర్య జరిగిన పిమ్మట ఆ డబ్బుతో "ఆంధ్ర చంద్రికా గ్రంథమాల'' అను ప్రచురణ సంస్థను నెలకొల్పిరి. కొన్ని గ్రంథములను ప్రచురించిరి. అవి చెల్లిపోగా వచ్చిన డబ్బును 20 వేలకు పైగా పెంచి యీ మహిళా కళాశాలా స్థాపనా సందర్భమున దానికి మూలధనముగా నిచ్చిరి. అది ప్రజల సొమ్ము, తిరిగి ప్రజల ఉపయోగార్థమే వినియోగపడవలెనన్నది వారి ఆదర్శము. ఇట్టిదీ, వారి నిస్వార్థసేవాదీక్ష. ఈ కళాశాల యిప్పుడు సర్వోత్కర్షలతో వర్ధిల్లు చున్నది.



# ప్రభుత్వవిద్యారంగము-తెలుగు

# ఛాదర్‌ఘాట్ హైస్కూల్

శా.శ. 1801-1860 = క్రీ.శ. 1879-1938

ఆరవ నిజాంమీర్ మహబూబ్ ఆలీఖాన్ పాలనాకాలమున శా.శ. 1805 లో (1883) అప్పటివరకు రాజభాషగానున్న పారశీస్థానే ఉర్దూ రాజభాషగా ప్రకటింపబడినది. దీనిని ప్రజలలో వేగిరమే వ్యాప్తిచేయుటకై ప్రభుత్వము వెంటనే నగరమున అయిదు ఉర్దూమీడియమ్ పాఠశాలలను నెలకొల్పినది :- 1. దారుల్-ఉల్-మూమ్. 2. సిటీ హైస్కూల్, 3. ఛాదర్‌ఘాట్ హైస్కూల్, 4, మదర్‌షా ఆలియా, 5, మదర్ ఐజా. కాలక్రమమున పెక్కు పాఠశాలలు వెలసి నగరమంతయు ఉర్దూభాషామయమైపోయినది. కేవలము విదేశీభాషయైన పారసీకంబె ఈదేశమున పుట్టి, దేశీయభాష యనదగిన ఉర్దూ కొంత మేలేయని కొందరు భావించినను, తెలుగును దెబ్బకొట్టుటలో రెండూ రెండేయనుట నిర్వివాదాంశము. ఈపరిస్థితులలో ప్రజల వత్తిడిని తప్పించుకొనలేక ప్రభుత్వము ఈ ఐదు పాఠశాలలలో కొన్నింటియందు ఐచ్ఛికభాషగా తెలుగును ప్రవేశపెట్టినది. అందు చాదర్‌ఘాట్ హైస్కూలొకటి. ఇదొక 'నమూనా'గా తీసికొని దీనిని గూర్చి దిఙ్మాత్రముగ ప్రస్తావింపబడుచున్నది.

ఈ పాఠశాలలో శా.శ. 1842లో ('920) ఐచ్ఛికభాషగా తెలుగు ప్రవేశపెట్టబడినది. విద్యార్థుల సంఖ్య ఒక చేతివ్రేళ్ళమీద లెక్కపెట్టుటకు సరిపోయెడిది. ఇచ్చట క్రీ.శ. 1921 నుండి 1948 వరకు తెలుగు అధ్యాపకులుగా పనిచేసిన మహనీయుడు తెలంగాణ వైతాళికులలో నొకరైన కీ శే. ఆదిరాజు వీరభద్రరావుగారు. అంతకు ముందు వీరు సికిందరాబాదు మహబూబ్ కళాశాలలో 1914 నుండి 1921 వరకు పనిచేసియుండిరి. చాదర్‌ఘాట్ స్కూలును విడిచిపెట్టిన పిమ్మట 1949 నుండి 1953 వరకు నారాయణగుడ ఆంధ్రబాలికల పాఠశాలలో పనిచేసిరి వీరు పనిచేసిన పాఠశాలలన్నియు అదృష్టవంతములనుట ఏపాటిమాట!

# ఛాదర్‌ఘాట్ హైస్కూల్

శా.శ. 1861-1872 = క్రీ.శ. 1939-1950

శా.శ. 1865లో (1943) నగరమున ఛాదర్‌ఘాట్ కళాశాల ప్రారంభింపబడినది. అక్కడ వెంటనే తెలుగు లెక్చరరుగా నియమింపబడి 1956 వరకు పని చేసినవారు కీ. శే. పల్లాదుర్గయ్యగారు. పిమ్మట వీరు నిజాంకళాశాలలో మూడేళ్ళు, దరిమిలా ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆర్ట్సుకళాశాలలో పదమూడేళ్ళు పనిచేసిరి.

అటు ఆదిరాజు, ఇటు దుర్గయ్యగారల వ్యక్తిత్వము కారణముగనిట తెలుగుభాష కొంత చక్కని ప్రతిపత్తి చేకూరినదనుట మామూలుమాట.



# నిజాంకళాశాల

శా.శ. 1801-1860 = క్రీ.శ. 1879-1938

హైదరాబాదునగరమున ప్రభుత్వ విద్యారంగములో ఒక ప్రత్యేక స్థానమును సంతరించుకొన్న విద్యాకేంద్రము నిజాంకళాశాల. ఇది శా.శ. 1805లో (1883) సాలార్‌జంగ్ I చేత[1] దివాన్‌దేవిడీలో మొదట నొక చిన్న స్కూలుగ ప్రారంభింప బడినది. శా.శ. 1809లో (1887) సాలార్‌జంగ్ II కాలమున[2] కళాశాలగా మారినది. కొంతకాలమున కిప్పటి ఆవరణమునకు తరలింపబడినది. తొలుత నిది మద్రాసు విశ్వవిద్యాలయమున కనుబంధముగ నుండెను. పాఠ్యప్రణాళికగూడ సదరు విశ్వవిద్యాలయమువారి ప్రణాళిక ననుసరించియుండెను.

ఈకళాశాలలో తెలుగుశాఖ శా శ. 1832 నుండి (1910) పనిచేయుట ప్రారంభించెను. మొట్టమొదట ఆంధ్రోపన్యాసకులుగా పనిచేసినవారు శ్రీరాయప్రోలు వేంకటరామ సోమయాజులుగారు. వీరిఫొటో ఒకటి యిప్పటికీ యిచ్చటి తెలుగు డిపార్ట్‌మెంటు గదిలో గోడను అలంకరించియున్నది. వీరు శా.శ. 1852 వరకు (1930) పని చేసిరి. ఆచార్య శ్రీఖండవల్లి లక్ష్మీరంజనంగారు క్రీ.శ. 1927, 28 సంవత్సరములలో ఇక్కడ విద్యార్థిగా నున్నప్పుడు తెలుగు చెప్పినది సోమయాజులుగారే. వారి తరువాత దాదాపు శా.శ. 1864 వరకు (1942) తెలుగును బోధించినవారు శ్రీ కురుగంటి సీతారామయ్యగారు. క్రీ శ. 1934-43 మధ్యకాలమున ఇక్కడ చదివిన దేవులపల్లి రామానుజరావు, బూర్గుల రంగనాథరావు ప్రభృతులకు తెలుగు చెప్పినది శ్రీ కురుగంటివారే. ఈకాలమున తెలుగు చదువు విద్యార్థుల కొరకు "తెలుగు సారస్వత సమితి" యను సంస్థ యేర్పడినది. దీనికి హితవరిగా శ్రీ కురుగంటివారే వ్యవహరించిరి. ఈ సమితి పక్షమున ఎన్నో సాహిత్యసభలు జరుగుచుండెడివి. వీరి ఆహ్వానముపై శా.శ. 1858 లో (1936) బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారు, శా.శ. 1859 లో పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు విచ్చేసి యిట సాహిత్యోపన్యాసములు గావించిరి.

---

1, & 2. ఈ యిద్దరు ఆరవ నిజాం మహబూబ్ ఆలీఖాన్ కడ అయా సంవత్సరములలో

## నిజాం కళాశాల

శా.శ. 1861-1872 = క్రీ.శ. 1939-1950

ఈ కాలమున నిచ్చట తెలుగుశాఖను నిర్వహించినవారు కీ.శే గరికిపాటి లక్ష్మీకాంతయ్యగారు. పిమ్మట ఆచార్య డా॥ కె. గోపాలకృష్ణారావుగారు. ఈ కళాశాల యందు విద్యార్థులుగనో అధ్యాపకులుగనో సంబంధము కలిగియుండిన వారిలో డా॥ పల్లాదుర్గయ్య, ఆచార్య డా॥ బి. రామరాజు, డా॥ దాశరథి. డా॥ సి. నారాయణరెడ్డి, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం ప్రభృతులు ముఖ్యులు.



# ఉస్మానియావిశ్వవిద్యాలయము

శా.శ. 1801-1860 = క్రీ.శ. 1879-1938

శా.శ. 1840 (క్రీ.శ. 19.8 సెప్టెంబరు 22 వ తేదీనాడు) ప్రకటింపబడిన రాజశాసనముతో అదేరోజు ఉస్మానియావిశ్వవిద్యాలయము స్థాపింపబడినది. శా.శ. 1841-42 విద్యాసంవత్సరము [1919-20] పూర్తియైన పిమ్మట ఒక ప్రథమ వార్షిక కార్యనివేదిక విడుదల చేయబడినది. అందులో తెలుగుభాష చదువుతున్న విద్యార్థు లున్నట్లు పేర్కొనబడినది. కాగా తెలుగుశాఖ శా.శ. 1841 [1919 ఆగస్టు] నుండి పనిచేయుట ప్రారంభించినదని భావింపవలెను. ఈశాఖ ఆచార్య పదవికి మొట్టమొదటి అభ్యర్థిని యెంపికచేయుటకు శా.శ. 1841-42లో [1919- 920] ఇంటర్వ్యూ జరిగి నది. దానికి నవ్యకవితా వైతాళికులు రాయప్రోలు సుబ్బారావు, అప్పటికి నిజాం కళా శాలలో తెలుగు ఆచార్యుడుగా నుండిన రాయప్రోలు వేంకటరామసోమయాజులు, మఱి 16 మంది అభ్యర్థులు, హాజరైరి. వీరిలో సుబ్బారావుగారు ఎంపిక చేయబడిరి. అయితే వారికి నియామక పత్రము చాల నాలస్యముగ పంపబడినది. దాని ప్రకారం 4 తేది జులై 1922 లో (శా శ 1844) మొట్టమొదటి ఆంధ్రోపన్యాసకులుగా ఉద్యోగమున చేరిరి. ఆ జులైలోనే ఇంటర్‌మీడియట్ తరగతులు ప్రారంభమైనవి. అప్పుడే తెలుగు శాఖ కచ్చితముగ ప్రారంభమైనదని భావించుట లెస్స. 1919-20 వార్షిక కార్యనివే దిక ప్రకారం అప్పటికే తెలుగు విద్యార్థులుండిరి. అధ్యాపక పదవికి నియామకము, తరగతులు ప్రారంభమగుటమాత్రము 1922 జులైలో జరిగినది. ఈమధ్యగల రెండు సంవత్సరములు వృధా అయినవి. దీనికి కారణమేమిటన్నదొక విచికిత్స. ఇక్కడ కొన్ని రాజకీయములు జరిగినట్లు తెలియుచున్నది. అవి ప్రస్తుతమున నప్రస్తుతముగాన ఆజోలిపోకుండుటమేలు.

రాయప్రోలు సుబ్బారావుగారు లెక్చరర్ తరువాత 1934లో రీడరైరి. 1942-43లో ఆచార్యులైరి. (**Professor**). వీరికాలముకో తెలుగు చదువు విద్యార్థులు చాలా తక్కువ మంది ఉండెడివారు. ఇంటరు తరగతిలో ఒకరిద్దరు, బి. ఏ. లో ఇద్దరు ముగ్గురు, ఇదీవరుస. 1938లో డా॥పల్లాదుర్గయ్యగారు బి.ఏ. చదువుతున్నప్పుడు ఆరుగ్గ

రామచంద్రారెడ్డిగారితో సహా మొత్తం ఇద్దరే తెలుగు చదువు విద్యార్థులు. ఇదిట్లుండ 1938 సం॥ ప్రాంతమున తెలుగు విద్యార్థులు వందేమాతరం 'స్ట్రైక్'లో పాల్గొనుటవలన విశ్వవిద్యాలయమునుండి బహిష్కరింపబడిరి. మరికొందరు ఏ నాగపూర్ యూనివర్సిటీ లోనో చదువులకు వెళ్ళిరి, అప్పుడు తెలుగులో విద్యార్థులులేక, ఎవరికి పాఠములు చెప్పవలెనో తెలియక శ్రీ సుబ్బారావుగారు విశ్వవిద్యాలయ గ్రంథాలయమున కూర్చొని తీరికగా కార్డులో ఏవో వ్రాసుకొనుచుండెడివారట. ఇదీపరిస్థితి.

అప్పటిలో తెలుగు ఐచ్ఛికభాషగా మాత్రమే (Optional) ఉండెడిది. ద్వితీయ భాషగా చేయించుటకు శ్రీరాయప్రోలువారు ప్రయత్నించిరిగాని అది యెక్కిరాలేదు. భాషాధ్యయనమన్నది కేవలము వ్యాకరణదృష్టితోగాక సాహిత్యదృష్టితో చేయవలెను. సాహిత్యమునకు, సమాజమునకు, మానవులకుగల సంబంధానుబంధములను గూర్చి గ్రహించి సామాజిక దృష్టితో చూడవలెనని వారి ఉద్దేశము. ఆదిశలో ఆయన కొంత ప్రయత్నించిరి. అందుకుగాను నిర్ణయించిన పాఠ్యగ్రంథములు— ఆంధ్ర మహాభారత భాగములు కొన్ని, శృంగారనైషధము, జైమినీభారతము మొదలయినవి. విశ్వ విద్యాలయములో వ్యావహారికభాషకు సముచిత స్థానముండవలెననియు వారి యభిప్రాయము. అందుకుకూడ వారు కొంత ప్రయత్నించిరి.

## ఉస్మానియావిశ్వవిద్యాలయము

శా.శ. 1861- 872 = క్రీ.శ. 1939-1950

ఉస్మానియావిశ్వవిద్యాలయమున శా శ. 1862 లో (1940) తెలుగులో మొట్ట మొదట ఏంఏ తరగతులు ప్రారంభమైనయి. అంతవరకూ ఏ యితర ప్రాంతీయ భాషల్లోకూడ ఎం. ఏ తరగతులు లేవు తెలుగు, కన్నడ, మరాఠీ తమిళభాషలన్నింటి లోనూ అప్పుడే ప్రారంభమయినవి. ఆచార్యఖండవల్లి లక్ష్మీరంజనంగారు మరొక తెలుగు లెక్చరర్‌గా అప్పుడే ఉద్యోగములో ప్రవేశించిరి. అప్పటికి నిజాంకాలేజీలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేస్తున్న కురుగంటి సీతారామయ్యగారు యూనివర్సిటీలో ఎం. ఏ. తరగతులకు బోధించుటకు పార్ట్‌టైమ్ లెక్చరరుగా వచ్చి వారానికి రెండు రోజులు పాఠములు చెప్పేవారు. ఇట్లు రాయప్రోలు, ఖండవల్లి, కురుగంటి ఈముగ్గురు అక్కడ ఎం. ఏ. తరగతులకు బోధించుచుండిరి. చిత్రమేమన తెలుగు ఎం ఏ తర గతిలో ఒకేఒక విద్యార్థి ఉండేవాడు. వారు డా॥ పల్లా దుర్గయ్యగారు 1948 సెప్టెం

బరులో హైదరాబాదుపై పోలీసుచర్య జరిగి, పరిస్థితులు ఒక కొలిక్కి వచ్చేవరకూ దాదాపు అన్ని తరగతుల్లోనూ తెలుగు, తదితర ప్రాంతీయభాషల స్థితి ఇలాగేఉండేది. 1942 లో ఎం. ఏ. తరగతులకు మొదటిసారి పరీక్షలు నిర్వహింపబడినవి.

రాయప్రోలువారు "ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి" అన్న విషయమును వంద మార్కుల పేపరుగా ఎం. ఏ. తరగతి పాఠ్యప్రణాళికలో చేర్చిరి. అప్పటికి ఈవిషయము ఆంధ్ర, మద్రాసు విశ్వవిద్యాలయములలో కూడ లేకుండెను. ఈవిషయమును విద్యార్థులకు బోధించినవారు కురుగంటి, ఖండవల్లిగారలు. ఆనాటి పాఠ్యప్రణాళికలో పద్యము, గద్యము, నాటకము, ప్రాచీనాధునిక కవితలు, ఆంధ్రులచరిత్ర, ఆంధ్ర భాషాచరిత్ర, ప్రాచీనాధునికాంధ్ర సాహిత్యచరిత్ర, అలంకారశాస్త్రము, వ్యాకరణము అను విషయాలు ఎనిమిది పేపర్లుగా ఉండేవి. ఆంధ్రశబ్ద చింతామణి మాత్రమే ఉండేది. బాలప్రౌఢవ్యాకరణములు చేర్చబడలేదు. రెండేళ్ళు పూర్తి అయిన తరువాత ఒక్కసారే పరీక్షలుండేవి.

శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు శా.శ. 1868 లో (1943) పదవీవిరమణ చేయగా వారిస్థానే శ్రీఖండవల్లి లక్ష్మీరంజనంగారు ఆంధ్రశాఖాధ్యక్షులై శా.శ. 1885 వరకు (1963) ఆచార్యతను నిర్వహించిరి. పిమ్మట ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధానిగారు ఆ పదవీ బాధ్యతలను నిర్వహించిరి. ఖండవల్లివారి కాలమున క్రమముగా ప్రశాంత పరిస్థితు లేర్పడుటవలన తెలుగుశాఖలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకొని రాగలిగిరి. అందు రెండు విషయములు ప్రధానమైనవి. అంతకు పూర్వం డిగ్రీస్థాయి తరగతులకు దీనియాత్ (మతము, రిలిజియన్ నీతి) అను విషయము బోధింపబడేది. దాని స్థానమున తెలుగు మొదలయిన ప్రజలభాషలను అవశ్య పఠనీయాంశాలుగా పెట్టించే ప్రయత్నము సఫలమైంది. తెలుగు ద్వితీయభాషగా అవశ్య పఠనీయాంశమైనది. దీనికి ప్రధాన కారకులు ఖండవల్లివారే. అలాగే తెలుగులో పి.హెచ్.డి చేసే పథకం ప్రవేశపెట్టటం జరిగింది. ఉస్మానియాలో మొదట తెలుగులో పి.హెచ్.డి చేసి డాక్టరేట్ పట్టము పొందినవారు ఆచార్య డా॥ బి. రామరాజుగారు. ఆచార్య డా॥ దివాకర్లవారి తరువాత 1973 లో వీరు తెలుగు శాఖాధ్యక్షులైరి.

తెలుగు భాషా సాహిత్య వికాస పరిణామక్రమములో ఇదీ ఉస్మానియా విశ్వవిద్యాలయమున జరిగిన సంక్షిప్త చరిత్ర.



# పత్రికా రంగము

## శా.శ. 1801-1860 (క్రీ.శ. 1979-1938)

హైదరాబాదు నగరమున తెలుగు పత్రికారంగమునకు నాంది, శా.శ. 1848లో (1926) గోల్కొండ పత్రికా స్థాపనతో జరిగినది. నగరమునకు సంబంధించినంత వరకు నిది కొంత ఆలస్యముగనే జరిగిన దనుకొన్నను, అంతకుముందే తెలంగాణము లోని మూడుచోట్లనుండి మూడు పత్రికలు వెలువడినవి. వానిలో మొట్టమొదటి పత్రిక "హితబోధిని" అను మాసపత్రిక. ఇది శా.శ 1835లో (1913 జూన్) పాలమూరు (మహబూబ్ నగరము)నుండి వెలువడినది. సంపాదకులు శ్రీనివాసశర్మ అనువారు. ఇది ఒక సంవత్సరము మాత్రము నడచి ఆగిపోయినను చరిత్రలో స్థానమును సంపాదించు కొన్నది. రెండవది "నీలగిరి" అను వారపత్రిక. ఇది నల్లగొండనుండి శా.శ 1844లో (1922 ఆగష్టు 24) వెలువడినది. సంపాదకులు షబ్నవీస్ వెంకట రామ నరసింహా రావుగారు. మూడవది "తెనుగు" అను వారపత్రిక ఇది శా.శ 1844లో (1922 ఆగస్టు 27) వరంగల్ జిల్లా మానుకోటతాలూకా ఇనుగుర్తి గ్రామమునుండి వెలువడినది. సంపాదకులు ఒద్దిరాజు సీతారామచంద్రరావు, రాఘవ రంగారావు సోదరులు. ఈ పత్రికల సంపాదకులందరూ సంస్కృతాంధ్రాంగ్ల ఉర్దూ పారశీ భాషలలో మంచి పండితులు. సంపన్న కుటుంబీకులు కూడ. ఇవి ప్రజాభిప్రాయమును అద్దము పట్టుచున్న రచనలతో వెలువడి ప్రజలలో గొప్ప జాగృతిని కలిగించిన పత్రికలు. ఈచివరి రెండు పత్రికలు రెండు మూడేండ్లు మాత్రమే నడచి ఆగిపోయినవి. "ఇనుగుర్తి" ఒక కుగ్రామము. అక్కడినుండి ఒక వారపత్రికను నడిపింపవలయునన్న తలంపే ఆశ్చర్య కరమైనది. ఒద్దిరాజు సోదరులు చిరస్మరణీయులు. ఈరెండు పత్రికలు ఆగిపోబోతున్న సమయమున హైదరాబాదులో గోల్కొండపత్రిక ప్రారంభింపబడినది. చిత్రమేమన 1901లో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ స్థాపనతో నగరమునుండి ప్రారంభమైన గ్రంథాలయోద్యమము క్రమముగా జిల్లాలకు వ్యాపింపగా 1913లో ముందుగానే తెలంగాణ జిల్లాలలో ప్రారంభింపబడిన తెలుగు పత్రికా రంగము 1926 సంవత్సరము నకు గాని నగరమునకు చేరకపోవుట! గోల్కొండ పత్రిక ప్రారంభమైన దరిమిలా నగరమున కాలక్రమమున అనేకపత్రికలు వెలువడినవి. వాని చరిత్రను దిఙ్మాత్రముగ పరామర్శింతము.

గోల్కొండ పత్రిక—ఇది శా.శ 1848లో (అక్షయ నామ సంవత్సర నిజ చైత్ర బహుళ త్రయోదశి, సోమవారము (క్రీ.శే 10-5-1926) హైదరాబాదు నందలి త్రూప్ బజారులోగల ఒక చిన్న భవనమున స్థాపింపబడినది. స్థాపకసంపాదకులేగాక సర్వము తానయై నడిపించినవారు తెలంగాణ వైతాళికులలో నొకరగు సురవరం ప్రతాప రెడ్డిగారు, శ్రీరాజా బహద్దూర్ వెంకట రామారెడ్డిగారి అండదండలున్నమాట వాస్తవమే గాని సర్వవిధ నిర్వహణ భారము మాత్రము సురవరం వారిదే. ఆ రోజులలో ఒక సభను నడుపుటకుగాని, ఒక గ్రంథాలయమును నెలకొల్పుటకుగాని, ఒక పత్రికను నిర్వహించుటకుగాని నిజాం ప్రభుత్వము నుండి యెన్నియో ఇక్కట్లను ఎదుర్కొన వలసి వచ్చుచుండెడిది. అసలనుమతియే లభించుటకష్టము. దీనికొక చిన్న దృష్టాంతము: "గోల్కొండ" స్థాపనకు పూర్వము ఒకానొక ఆంధ్ర భాషాభిమాని ఒక తెలుగుపత్రికను నడుపుటకు కుతూహలపడి "ఆంధ్రమాత" అను పేరును ఎంపిక చేసుకొని ప్రభుత్వము వారి యనుమతిని కోరెను. ఆపేరును చూచినంతనే యిదొక జాతీయ వాద పత్రికయని భావించి అనుమతించవలసిన రెసిడెన్సీ తెల్లదొరతనము వారు అనుమతిని నిరాకరించిరి. ఇది తెలిసిన ప్రతాపరెడ్డిగారు తమ పత్రికకు గోలకొండయని పేరు పెట్టిరి. పత్రిక పేరు 'గోలకొండ' అయినను అది ప్రతాపరెడ్డిగారిది యగుటవలన ప్రభుత్వము ఆరు నెలలు ఆలస్యముచేసి అనుమతిని నిరాకరించినది. చివరికి రాజా బహద్దూర్ వెంకట రామారెడ్డిగారు దొరతనము వారికి నచ్చచెప్పిన పిమ్మట ఎట్టకేలకు అనుమతి లభించినది. మూడేండ్లు నడిపిన పిమ్మట సురవరం వారు వకీలు వృత్తి నవలంబించవలచిరి. ఆనాటి ప్రభుత్వపు నియమ నిబంధనల ననుసరించి వకీలు వృత్తిలోనున్నవారు పత్రికా సంపాద కులుగ నుండుటకు వీలులేదు. అందువలన వారిస్థానే కొండా బాలకృష్ణారెడ్డిగారు సంపాదకులుగా పని చేసిరి. వాస్తవమునకు వీరు నామమాత్రపు సంపాదకులే. ప్రచ్ఛన్నముగ సర్వకార్యకలాపములను ప్రతాపరెడ్డిగారే నిర్వహించిరి. ఈరహస్యము కాలక్రమమున బహిర్గతమై ప్రభుత్వ దృష్టికి వచ్చినది. ఇదిట్లుండ బాలకృష్ణారెడ్డిగారు పత్రిక యాజమాన్యము వారితో పేచీపడి పత్రికను నిలిపి వేయించుటకు ఊహాకము చేసిరట. ఈపరిస్థితులలో మరల ప్రతాపరెడ్డిగారే సంపాదకులుగ నుండుట శ్రేయమని భావించి 'యాజమాన్యము వారు ప్రతాపరెడ్డిగారిని అభ్యర్థించిరి. ఆ మేరకు 1 సెప్టెంబరు 1939 నుండి 1947 వరకు శ్రీరెడ్డిగారే సంపాదకులు. వీరికి సహాయసంపాదకులుగా అన్ని విధముల సహాయ సహకారములందించినవారు మాడపాటి హనుమంతరావుగారు.

గోల్కొండ పత్రిక ప్రారంభింపబడిన నాటినుండియు అర్ధ వారపత్రికగా నడచి శా.శ 1869లో (1947)దినపత్రికగా నపతరించినది. శా.శ 1869లోనే పత్రిక యాజమాన్యమువారితో సరిపడనందువలన ప్రతాపరెడ్డిగారు సంపాదకులుగా వైదొలగిరి. అప్పటినుండి నూకల నరోత్తమరెడ్డిగారు సంపాదకులుగా నుండిరి. చివరికి ఈపత్రిక శా.శ 1888లో (1966)ఆగిపోయినది. ఆపిమ్మట కూడ అప్పుడప్పుడు కొద్దిరోజులు వెలువడుటయు, మరల నాగిపోవుటయు జరుగుచువచ్చినది. ఇకముందు కూడ తరచుగ నట్లు జరుగుటకు నవకాశము లేకపోలేదు. ఏమైనను శా.శ 1888తో దీనిపని తీరిపోయినదనిభావించుట సమంజసమని యిప్పటికి చెప్పవచ్చును. ఈవిధముగా దాదాపు అర్ధశతాబ్దము నడచి ఆనాటి తెలంగాణ ప్రజాజీవితమును అద్దముపట్టిన ఏకైక పత్రిక గోల్కొండ పత్రిక.

గోల్కొండ పత్రిక యొక్క ఆశయాదర్శములను గూర్చి శా.శ. 1853 లో (9-3-1931వ తేదీనాడు) వెలువడిన సదరు పత్రిక సంపాదకీయమున ఇట్లు చెప్పబడినది. "మేము మా పత్రికాస్థాపనా కాలమునుండియు రెండంశములు దృష్టిపథమందుంచుకొని దేశీయులసేవ చేయుచున్నాము. మొదటిది ఆంధ్ర భాషా సేవ, రెండవది జాతికుల వివక్షత లేక నిష్పక్షపాతముగా ఆంధ్రులలో సర్వశాఖల వారి యొక్క సత్వాభి వృద్ధికై పాటుబడుట" అని. ఈ పత్రిక ఏ యే ధర్మములతో నెలకొల్పబడినదో వానిని తరువాతి తరము వారైనను సాధించుటకొక రాచబాటను నిర్మించినదనుట నిక్కము.

ఆరోజులలో గోల్కొండ అర్ధవారపత్రిక. ఎప్పటికప్పుడు క్రొత్త క్రొత్త రచనలు వేడివేడిగా వచ్చిపడినగాని పత్రిక వెలువడుటకు వీలుకాదు. కాని రచనలు కరవయ్యెను. అప్పుడు ప్రతాపరెడ్డిగారే గుప్తనామములతో ఎవరి పేరో పెట్టి కొన్ని వ్యాసములు వ్రాసి రచయితలను రెచ్చగొట్టిన సందర్భములు గలవు. ఉదాహరణకు- "స్త్రీలకు స్వాతంత్ర్య మవసరమా" అను శీర్షిక క్రింద కొంత చర్చించి చివరికి అవసరములేదు, అని తేల్చెడి వారు. కొందరు రచయిత్రులు రెచ్చిపోయి ఆవసరమే యని ఖల్లగుద్ది చెప్పినట్లు వ్రాసెడి వారు. వారిలో శ్రీమతి ఎల్లాప్రెగడ సీతాకుమారిగారు పేర్కొనవలసిన విదుషీమణి అట్లే "జంగములు బ్రాహ్మణులు కారు" అన్నది మరొకటి. దీనికి రెచ్చిపోయి ఖండిం చుచూ వ్యాసములు వ్రాసిన వారిలో చిదిరెమఠం వీరభద్రశర్మ ఆను మహనీయులొకరు. ఇట్టి ట్రిక్కులతో రచయితలను ప్రోత్సహించి, సమీకరించి, పెద్ద కోలాహలమును

సృష్టించి ఒక చైతన్యమును కలిగించిరి. ఇందువలన పత్రిక వ్యాప్తి హెచ్చి ప్రతులు విపరీతముగ అమ్ముడు పోయెడివి. ఇప్పుడు ప్రతాపరెడ్డిగారు లేరు. గోల్కొండపత్రిక కూడలేదు. కాని ఆయిద్దరి యొక్క సమన్వయాత్మకమూర్తి మనకొక చారిత్రకమైన మధురస్మృతి.

<u>సుజాత</u>— ఇది సాహిత్య మాసపత్రిక. శా.శ. 1850లో (1928) ప్రారంభింపబడినది. దీనిని వెలువరించుటకు ప్రోత్సహించినవారు మాడపాటి హనుమంతరావు గారు, సురవరం ప్రతాపరెడ్డిగారున్ను. తొలిరోజులలో సంపాదకులుగా నున్నవారు శ్రీ పి.యస్. శర్మగారు. ఒక సంవత్సరము తరువాత వారు వకాలతు పుచ్చుకొన్నందు వలన సంపాదకులుగా నుండుటకు వీలులేకపోయినది. అప్పుడు వారిస్థానే శ్రీ కొండా వెంకట రంగారెడ్డిగారు, కొండా బాలకృష్ణారెడ్డిగారు సంపాదకులుగా వ్యవహరించిరి. ఈ పత్రికకు దాదాపు అయిదువందలమంది చందాదారులుగా జేరిరి. కొందరు రాజ పోషకులుండిరి. వారిచ్చిన ధనముతో పత్రిక స్వయంపోషకముగ నుండినది. శ్రీ పి. యస్. శర్మగారు వకీలుగా పనిచేయుచున్నను పత్రిక యొక్క బాగోగులను పట్టించు కొని పనిచేయుచుండిరి. మూడు సంవత్సరములు చక్కగా వెలువడిన యీ పత్రిక చివరికి నాల్గవ సంవత్సర ప్రారంభమున మొదటి సంచిక వెలువడిన దరిమిలా అకస్మాత్తుగా ఆగిపోయినది. నిలిపివేసిననాటికి, పి.యస్. శర్మగారికి, మాడపాటి హనుమంతరావుగారికి, సురవరం ప్రతాపరెడ్డిగారికి తలకొక రెండువందల రూపాయల చొప్పున నష్టము చేతికి తగిలినదట.

సుజాత ఉత్తమ సాహిత్య పత్రికగా పేరుపొందినది. భారతి పత్రికకు దీటుగా నుండెడిది. ప్రతినెల ఒక చక్కని త్రివర్ణముఖ చిత్రముతో వెలువడుచుండినది. చక్కని కథలు, మంచి కవితలు వచ్చుచుండెడివి. తెలుగు పత్రికయే అయినా ఉర్దూ భాషా సాహిత్య విషయములుకూడ ప్రచురింపబడుచుండెడివి. ఆ రోజులలో పాఠకులకు ఉత్తమ సాహిత్యాభిరుచి గలిగించిన పత్రికయని చెప్పవలెను. ప్రారంభదశలో సంపాదకులుగానున్న శ్రీ పి. యస్. శర్మగారు దీనికి చక్కని రూపురేఖలను సంతరించి పెట్టిరి. వారు తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూ భాషలలో మంచి అభినివేశమున్నవారు. ఇతరులను ఆకట్టుకొనగల హృదయ సంస్కారము గలవారు. బి.ఏ, ఎల్.ఎల్.బి పట్టభద్రులు, వకాలతు పుచ్చుకొన్న కొన్నినాళ్ళకు న్యాయశాఖలో మున్సిఫ్‌గా పనిచేసి జిల్లా జడ్జీ కూడ అయిన పిమ్మట పదవీ విరమణ చేసిరి.

ఈ పత్రిక ఆ పిమ్మట ఇరవైయేళ్ళకు, శా.శ. 1872లో (1950) మరలనదే పేరుతో వెలువడి, కొన్ని సంచికలు ప్రకటింపబడిన పిమ్మట తిరిగి ఆగిపోయినది. రెండవ విడతలో దీనికి శ్రీ గడియారం రామకృష్ణశర్మ, శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి గారలు సంపాదకులుగా నుండిరి.

దేశబంధు— ఇది శా.శ. 1852 లో (1930 శుక్లనామ సంవత్సరము) హైదరాబాదుకు సమీపమున తూప్రాన్ దగ్గఱనున్న వడ్డెపల్లి యను కుగ్రామమునుండి వెలువడినది. స్థాపక సంపాదకులు- బెల్లంకొండ నరసింహాచార్యులుగారు, ఇది మూడేళ్ళు మాత్రము నడచి ఆగిపోయినది. "ఒక చిన్న గ్రామమునుండి దానిని అంతకాలము పట్టుదలతో నడిపించుట ప్రశంసాపాత్రము[1] అని సురవరం ప్రతాపరెడ్డిగారు మెచ్చుకొన్న పత్రిక యిది.

ఆంధ్రశ్రీ— ఇది మాసపత్రిక. సికింద్రాబాదు నుండి వెలువడినది. ఒక సంచికతోనే ఆగిపోయినది.

దక్కన్ కేసరి— ఇది మాసపత్రిక, ఆంగ్లభాషలోను, ఆంధ్ర భాషలోను వెలువడుచుండెడిది (ఆంధ్రాంగ్ల మాసపత్రిక). శా.శ. 1856 (1934)లో సికింద్రాబాదు నుండి ప్రకటితమగుచుండెడిది. సుమారు ఏడెనిమిది సంచికలను మాత్రము ప్రకటించి ఆగిపోయినది. సంపాదకులు అడుసుమిల్లి దత్తాత్రేయశర్మగారు. ఉద్దండుడైన సమాజ సేవకులు.

భాగ్యనగర్— ఇది వారపత్రిక. శా.శ. 1856 లో (1934) ప్రారంభింపబడినది. హైదరాబాదు (చాదర్‌ఘాట్ ప్రాంతము) దీని ప్రచురణస్థానము. స్థాపక సంపాదకులు, హరిజనోద్ధారకుడుగా. సంఘ సంస్కర్తగా పేరెన్నికగన్న భాగ్యరెడ్డి వర్మగారు. వీరు హరిజనులు. శా.శ. 1850లో (1928) ముద్రణాలయమును స్థాపించి తరువాత ఈ పత్రికను నెలకొల్పిరి. కొన్నాళ్ళు నడిచిన పిమ్మట భాగ్యరెడ్డివర్మగారికి క్షయ రోగము వచ్చి చికిత్సకై బెంగుళూరుకు వెళ్ళిరి. పిమ్మట శ్రీ కంఠము సత్యనారాయణ నాయుడుగారు నడిపిరి. మొత్తముమీద యిది నాల్గు సంవత్సరములు మాత్రము నడచినది.

---

1. "తెలంగాణా—తెలుగు పత్రికలు" వ్యాసము "సుజాత" సంపుటము 2, సంచిక 1, 15 ఆగస్టు 1951.

విభూతి— ఇది మాస పత్రిక. సికిందా్రబాదునుండి వెలువడినది. స్థాపక సంపాదకులు పండిత చిదిరె మఠం వీరభద్రశర్మగారు. ఇది మూడేళ్ళు మాత్రమే నడచినది. ఉత్తమముగా సాగిన పత్రికయని ప్రశంసింపబడినది. వీరభద్రశర్మగారు వారణాసిలో నొక శైవపీఠమున కధిపతులుగ వెళ్ళుటచే ఆపివేయబడినది.

"1936"-ఇది మాస పత్రిక. దీనికి పేరు లేదు. "1936" అన్న అంకెయే దీనిపేరు. ఇది 1936లోనే (శా.శ. 1858) ప్రారంభింపబడినదని చెప్పవలసిన పనిలేదు. సంపాదకునిపేరు అజ్ఞాతము. దీని కార్యస్థానము సికిందరాబాదు. ఇది మూడు సంచికల తర్వాత మూలబడినది.

దివ్యవాణి— ఇది వారపత్రిక. శా శ. 1859 నుండి 1889 వరకు (1937 నుండి 1967 వరకు) అవిచ్ఛిన్నముగా సాగి వచ్చిన పత్రిక యిది. సికిందరాబాదులోని ఇమాంబావిడి వీధి దీని ప్రచురణ స్థానము. సనాతన ధర్మ ప్రచారమే దీని యాదర్శము. స్థాపక సంపాదకులు శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారు. వీరికి ఒక ప్రెస్ కూడ నుండెను. వీరు గొప్ప పండితులు. పూర్వాచార పరాయణులు. అందుచే ఈ పత్రిక సంఘ సంస్కార విముఖమైనదని చెప్పవలసిన పనిలేదు.

తెనుగు తల్లి— ఇది మాస పత్రిక. శా.శ. 1860లో (1938) సికిందరాబాదునుండి ప్రకటితమగుచుండెడిది. సంపాదకురాలు రాచమళ్ళ సత్యవతీదేవిగారు. భాగ్యనగర పత్రికా రంగముననేగాక తక్కిన తెలంగాణా పత్రికా రంగమును కూడ సమీక్షించినచో, ఒక పత్రికకు సంపాదకత్వము వహించిన స్త్రీ ఈమె ఒక్కరే కాన్పించుచున్నారు. ఇది ఒక సంవత్సరము నడచిన పిమ్మట నిలిచిపోగా హైదరాబాదు యువకులు కొందరు ఆమెకు సహాయ సహకారములందించి మరొక సంవత్సరము పొడిగించిరి. మొత్తము మీద దీని ఆయుస్సు రెండేళ్ళు మాత్రమే,

ఆంధ్రకేసరి మాస పత్రిక— స్థాపన శా.శ. 1860 (1938) హైదరాబాదు సుల్తానుబజారునుండి వెలువడినది. ఇది మొదట గ్రంథమాలగా వెలువడి పిమ్మట పత్రికగా మారినది. సంస్థాపక సంపాదకులు గుండవరపు హనుమంతరావు. వీరితో పాటు నిర్వహణకు సంబంధించిన అన్ని వ్యవహారములలో ప్రముఖపాత్ర వహించినవారు శ్రీ బూరుగుల రంగనాథరావు, తిరుపతిరావు, కె. సి. గుప్త ప్రభృతులు.

# పత్రికారంగము

## శా.శ. 1861-1872 = 1939-1950

తెలంగాణ— ఇది శా.శ. 1865లో (1943) హైదరాబాదు నుండి వెలువడిన మొట్టమొదటి తెలుగు దినపత్రిక. అప్పటికి "గోల్కొండ" ఇంకను అర్థ వారపత్రిక గానే నడచుచుండెను. శా.శ. 1869లో గాని (1947) అది దినపత్రిక కాలేదు. ఆనాడు తెలుగులో దినపత్రిక లేని లోటును తీర్చుటకు ఈ పత్రిక ప్రారంభింపబడినది. దీని స్థాపకులు రాజగోపాల్ మొదలియారు, తమిళులు, సంపాదకులు బి.ఆర్. చారిగా పేరు పడిన బుక్కపట్టణం రామానుజాచార్యులుగారు. వీరు ఈ పత్రికలో చేరకపూర్వము "దక్కన్ క్రానికల్" పత్రికకు సంపాదకులుగా పని చేసిరి. ఆంగ్లభాషలో మంచి పండితులు, రచయిత. అప్పటికి ముమ్మరముగా సాగుచున్న జాతీయోద్యమమును "తెలంగాణ" పత్రిక బలపరచినది. యువరచయితలను ప్రోత్సహించినది. శ్రీ దేవులపల్లి రామానుజరావు మొదలైన యువరచయితల వ్యాసములు ఇందులో ప్రచురింపబడు చుండెడివి. ఇది సుమారు మూడు సంవత్సరములు మాత్రము నడచి ఆగిపోయినది.

మీజాన్— ఇది శా.శ. 1867 లో (1945) హైదరాబాదునుండి అరబ్బీ పేరుతో వెలువడిన మరొక తెలుగు దినపత్రిక. కలకత్తా వాలాగా పేరు వడసిన ధన వంతులొకరు ఈ "మీజాన్" పేరుతో తొలుత ఉర్దూ, ఇంగ్లీషు దినపత్రికలను నడుపు చుండెడివారు. కొద్దిరోజుల దరిమిలా ఈ తెలుగు పత్రికను కూడ ప్రారంభించినాడు. దీనికి సంపాదకులుగా శ్రీ అడవి బాపిరాజుగారుండిరి. వీరు పేరెన్నికగన్న తెలుగుకవి నవలా రచయిత, గాయకుడు, చిత్రకారుడున్ను. వీరి "గోన గన్నారెడ్డి" నవల "మీజాన్" పత్రికలోనే ధారావాహికముగా ప్రచురింపబడినది. ఈ పత్రికలో వీరికి సహాయ సంపాదకులుగా శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి, విద్వాన్ విశ్వంగారలు పని చేసిరి. ఈ యిద్దరు మంచి చేయి తిరిగిన రచయితలు, ప్రతిభా పాండిత్యములు గలవారు. ఈ మీజాన్ పత్రిక ఆనాటి ప్రజోద్యమములకు కొంత వ్యతిరేకముగా నుండెడిది. ఇది ఆనాటి తెలంగాణా ప్రముఖులకు పరిహాస గర్భితములైన బిరుదు లిచ్చుచుండెడిది. అట్లు బిరుదులు పొందిన వారిలో శ్రీ దేవులపల్లి రామానుజరావుగారొకరు. "ఏకశిలా నగర శిలాఫలక కలకల శోభా విభావరి" అన్న బిరుదును ఈ పత్రిక తన కిచ్చినట్లు శ్రీ రామానుజరావుగారొక చోట పేర్కొనిరి.[1]

1. "యాభై సంవత్సరాల జ్ఞాపకాలు" పుట-50.

తెలంగాణా, 'మీజాన్' 'పత్రికల స్థాపకులలో ఒకరు తమిళులు, మరొకరు ముస్లిము. ఇది దృష్టిలో పెట్టుకొని సురవరం ప్రతాపరెడ్డిగారు ఇట్లొక వాడియైన చమత్కారము విసిరినారు. "తెలంగాణా" పత్రికా సంపాదకులు తమిళులు, 'మీజాన్' పత్రికాధిపతులు ముసల్మానులు. తమిళునకు తెలుగుమాటలైనను వచ్చును, కాని ముసల్మాను తెలంగీ యెట్టిదో తెలిసికొన ప్రయత్నించిన వాడుగాడు"1

తరణి— ఇది మాసపత్రిక. శా.శ. 1867 లో (1945) సికిందరాబాదునుండి వెలువడినది. సారస్వత, జ్యోతిష విషయములను గురించి యెక్కువగా ప్రచారమొనర్చు చుండెడిది. ఒక సంవత్సరము మాత్రము నడచి ఆగిపోయినది.

శోభ— ఇది సాహిత్య మాసపత్రిక. మొదట శా.శ. 1863లో (1941) వరంగల్లులో ప్రారంభమైనది. సంస్థాపక సంపాదకులు శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు. ఇది ఒక సంవత్సరము నడచి ఆగిపోయినది. తిరిగి శా.శ. 1872లో (1950) గోల్కొండ ప్రచురణల పక్షమున హైదరాబాదులో పునరుద్ధరింపబడి మరొక సంవత్సరము నడిచి నిలిచిపోయినది. రెండవ విడతలో కూడ శ్రీరామానుజరావుగారే సంపాదకులు. ఈరెండు విడతలలోను కలిపి మొత్తము రెండు సంవత్సరములే నడిచినను ఈ పత్రిక ఆనాడు తెలంగాణమున సాహిత్య పత్రికలు లేని లోపమును కొంత తీర్చినదని చెప్పవచ్చును. మాడపాటి, సురవరం ప్రభృతుల ఆశీస్సులనందుకొన్న పత్రికయిది.

భాగ్యనగర్— ఇది శా.శ. 1871 లో (1949 ఫిబ్రవరి) ప్రారంభింపబడినది. సంపాదకులు శ్రీ అడ్లూరు అయోధ్యా రామకవి. సచిత్ర మాసపత్రిక, కార్యస్థానము. 20 బడీచౌడీ, సుల్తాన్‌బజారు, హైదరాబాదు-దక్కన్.

ప్రజావాణి—ఇది శా.శ. 1873లో (1951, ఖరనామ సంవత్సరము) హైదరాబాదు నగరమునుండి వెలువడిన ద్వైదిన పత్రిక. సురవరం ప్రతాపరెడ్డిగారే స్థాపక సంపాదకులు. దీనికొఱకై ఒక ముద్రణాలయమును కూడ వీరు ఖరీదు చేసిరి. కొత్తూరి సీతయ్యగుప్త, దేవులపల్లి రామానుజరావు, పులిజాల హనుమంతరావు వంటి ప్రముఖులు దీనికి ఆర్థిక స్తోమతను సమకూర్చిరి. రెండు సంవత్సరములు మాత్రము

2. "తెలంగాణా—తెనుగు పత్రికలు" వ్యాసము. "సుజాత" సంపుటము 2, సంచిక 1, 15 ఆగస్టు 1951.

నడచి దబ్బు కొంతవల్ల మూతబడినది. సులక్షణమైన స్థానిక భాషలో రాజకీయ సాహిత్యాది విషయములకు సమ ప్రాధాన్యము నిచ్చి ప్రకటింపబడిన పత్రిక ప్రజావాణి.

“ఆంధ్రవాణి”—ఇది కాలనిర్ణయితో నిమిత్తము లేక నడిచినా ప్రత్యేకించి పేర్కొన వలసిన వార పత్రిక. అది స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహము ముమ్మరముగా జరుగు చుండిన రోజులు. హైదరాబాదులో పత్రికా స్వాతంత్ర్యము బొత్తిగా లేని రోజులు ఎట్లయినను అప్పుడొక పత్రికను నడుపవలసిన ఆవశ్యకమున్నందున హైదరాబాదులోని విద్యార్థికులు కొందరు విజయవాడను స్థావరముగ చేసికొని ఈ పత్రికను నిర్వహించిరి. బి. యస్. శర్మగారు, మాదపాటి రామచంద్రరావు బి.ఎ.బి యల్‌గారు దీనికి నిర్వాహకులు సంపాదకులున్ను. ఈ యిద్దరును ఉర్దూ, తెలుగు, ఇంగ్లీషు భాషలలో మంచి పరిచయము గలిగినవారు. అటు రాజకీయములందును ఇటు రచనా వ్యాసంగము నందును ఆరితేరినవారు. ఈ పత్రిక కూడ కొన్నాళ్ళు నడిచిన పిమ్మట ఆగిపోయినది.

ఇదీ, భాగ్యనగర పత్రికా రంగము యొక్క సంక్షిప్తచరిత్ర. ప్రజలలో స్వస్థాన వేష, భాషాదికముపై అభిమానమును కలిగించి చీకటిని చీల్చి వెలుగురేఖలను వెలార్చుటకు ఎందరో మహనీయులు చేసిన ప్రయత్నమిది. ఈ పత్రికలలో ఏదియు పట్టుమని పదేళ్ళు పని చేసినది కానరాదు. కాని వారి కృషి చరిత్రాత్మకము, స్ఫూర్తిదాయకము. ఈ పత్రికలన్నింటిలోకి ఒక్కటే గోల్కొండపత్రికకే కోహినూర్ వజ్ర సింహాసనము



# తెలుగు సాహిత్య వికాస చరిత్ర

## యుగ విభజన - ప్రణాళిక

శా.శ. 1801-1860 = క్రీ.శ. 1879-1938

వెనుకటి ప్రకరణమున డెబ్బది రెండు సంవత్సరముల కాలచక్రములో ప్రవర్తిల్లిన తెలుగుభాషా వికాస చరిత్రనుగూర్చి మొదటి అరవై సంవత్సరములొక భాగము గను, చివరి పన్నెండు సంవత్సరములు మరియొక భాగముగను విశ్లేషించి పరిశీలించితిమి. ఇప్పుడీ ప్రకరణమున కూడ అదే విధముగ సదరు కాలచక్రమును రెండు భాగములుగా విశ్లేషించి యిట వర్ధిల్లిన తెలుగు సాహిత్య వికాస చరిత్రను పరిశీలింతము గాక. ఇచ్చట మనము పాటించు రచనా ప్రణాళికను గూర్చి సూచింపవలసియున్నది. ఈ మొత్తము డెబ్బదిరెండు సంవత్సరముల కాలచక్రము ఏడు సాహిత్య యుగముల క్రింద విభజింపబడినది. ఇందు మొదటి అరవై సంవత్సరములలో మూడు సాహిత్య యుగములు, చివరి పన్నెండు సంవత్సరములలో నాల్గు సాహిత్య యుగములు తటస్థపడును. ఇవి ప్రధానముగ కాల సరణినిబట్టి విభజింపబడినవి. ఒకటి రెండుచోట్ల మాత్రము హేతుసరణినిబట్టి చేయబడినవి. ఆ వివరములివి :

ఒకటి- ప్రాగ్భాషానిలయ సాహిత్యయుగము:— శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయము శా.శ. 1823 (క్రీ.శ. 1901)లో స్థాపింపబడినది. దీనికి ముందటి ఇరవై మూడు సంవత్సరముల కాలఖండము (శా.శ. 1801-1823 = క్రీ.శ. 1879-1901) ఈ యుగముగ పరిగణింపబడినది. ఇందలి కవులు, వారి సాహిత్యము ఇట పరామర్శింపబడును.

రెండు-భాషానిలయ సాహిత్య యుగము :— శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయము శా.శ. 1823లో ('901) స్థాపింపబడినదని పూర్వోక్తము. దీని రజతోత్సవములు శా.శ. 1848లో (1926) జరిగినవి. ఈ మధ్యగల ఇరవై యైదు సంవత్సరముల కాలఖండము ఈ యుగముగ పేర్కొనబడినది. సదరు భాషా నిలయ రజతోత్సవ సంచిక దీనికి ప్రధాన ప్రాతిపదిక. భాషా నిలయముతో సంబంధముండిన కవులు, వారి సాహిత్యము, సంబంధము లేకపోయినను నగరములో అనాడున్నట్లు గాలింపబడిన కవులు, వారి సాహిత్యము ఈ యుగమున ప్రస్తావింపబడును.

మూడు-గోల్కొండ కవుల సంచికా సాహిత్య యుగము :— శ్రీకృష్ణ దేవ రాయాంధ్ర భాషా నిలయము యొక్క రజతోత్సవములు శా. శ. 1848లో (క్రీ.శ. 1926) నిర్వహింపబడినవని వెనుక చెప్పబడినది. అది మొదలుకొని శా.శ. 1860 వరకు (1938) మధ్యగల యీ పన్నెండు సంవత్సరముల కాలఖండము ఈ యుగముగ పేర్కొనబడినది. గోల్కొండ కవుల సంచిక శా.శ. 1856లో (1936) ప్రకటింప బడినది. ఇదియే ఈ యుగమునకు ప్రధాన ప్రాతిపదిక నగరమునకు చెందిన కొందరు కవులు ఈ సంచికలో పేర్కొనబడిరి. వారి సాహిత్య గ్రంథ విషయములు, ఈ కాలమున నివసించిన యితర కవులెవరైన యున్నచో వారి విషయము ఈ యుగ మున ముచ్చటింపబడును.

నాలుగు—సాధన సమితి సాహిత్యయుగము లేక గ్రంథమాలల సాహిత్యయుగము శా.శ. 1861లో (1939) సాధనసమితి అను సాహిత్య సంస్థ స్థాపింపబడినది. ఇది క్రీ.శ. 1950 వఱకు చాలా సమర్థవంతముగ పనిచేసిన సంస్థ. ప్రత్యూష ప్రచురణల పేరుతో సాహిత్య విలువగల యెన్నో గ్రంథములను వెలువరించినది ఇదొక చారిత్రక ప్రత్యేకతను సంతరించుకొన్న విశిష్టమైన సంస్థ అట్లయ్యును ఈయుగము క్రీ.శ. 1939 నుండి 1943 వఱకు గల అయిదు సంవత్సరముల కాలపరిమితిని మాత్రమే కుదింప బడినది. క్రీ.శ. 1943లో ఆంధ్ర సారస్వత పరిషత్తు స్థాపింపబడినది. అంతటితో అదొక సాహిత్యయుగము ప్రారంభింపబడవలసియున్నందున యిట్లు చేయుట జరిగినది. సాధన సమితికి కర్ణధారులైన ప్రముఖవ్యక్తులే సారస్వత పరిషత్తు స్థాపనలో ప్రముఖ పాత్ర వహించినందువలన ఈ విభజన నిర్ణయము సముచితమని భావింపవచ్చును. ఇదట్లుండ క్రీ.శ. 1935 లో స్థాపింపబడిన ఆంధ్రకేసరి గ్రంథమాల, 1938లో నెల కొన్న దేశోద్ధారక గ్రంథమాల, 1939 లో ప్రారంభింపబడిన అణా గ్రంథమాల మొదలైన వాటిని కాలసరణిని బట్టిగాక హేతుసరణిని బట్టి యీయుగమున చేర్చుట జరిగినది. ఇందుకు ప్రధాన హేతువిది : ఒకటి-సాధనసమితి తప్ప తక్కిన గ్రంథ మాలలు ప్రకటించిన గ్రంథములు రాజకీయ, సాంఘిక, ఆర్థిక, చారిత్రక పరముగనే యెక్కువగా నున్నవి. సాహిత్యపరమైన విలువలుగల గ్రంథములు క్వాచిత్కముగ దప్ప కానరావు. రెండు-ఈ గ్రంథమాలలో సభ్యులుగనున్న కార్యకర్తలుగాని, రచ యితలుగాని తమ కార్యకలాపాలను తమ సంస్థకే పరిమితము చేయక తక్కిన సంస్థ లలో కూడ సభ్యత్వమును స్వీకరించిగాని, ఉత్సాహముతోగాని కలిసి మెలిసిపని చేయుట మూడు : ఈసంసలలో పనిచేసిన వారందరూ దాదాపు సమవయస్కులు, నిగూఢగిరళతో

సున్నవారు. నాలుగు : ఇంతకుముందులేని క్రొత్తపోకడలు ఈసాహిత్యయుగమున ప్రవేశించినవి. పద్యములు, గద్యములు, నాటకములు, నాటికలు, గేయకవితలు, వచనకవితలు, కథలు, నవలలు, వ్యాసములు మొదలైన అన్ని సాహిత్యప్రక్రియలు ఇట గుమికూడుకొన్నవి. ఈ సంస్థలన్నింటికీ నాయకత్వము వహించిన సంస్థ సాధన సమితి. కావున దీనికి ప్రధానముగ సాధనసమితి సాహిత్యయుగమనియు, గౌణముగ గ్రంథమాలల సాహిత్యయుగమనియు నామకరణము చేయబడినది.

ఐదు—ఆంధ్ర సారస్వత పరిషత్సాహిత్యయుగము : ఆంధ్ర సారస్వతపరిషత్ 1943లో స్థాపింపబడినది. నాటినుండి నేటివఱకు మూడుపువ్వులారుకాయలుగ వర్ధిల్లు చున్న సంస్థయిది. ఐనను ఈయుగము యొక్క కాలము క్రీ.శ. 1950 వఱకుగల ఎనిమిది సంవత్సరములకు మాత్రము పరిమితము చేయబడినది. పరిషత్తుతో సంబంధముగల కవులు, వారి సాహిత్యము. మఱికొందఱు ఇతరకవులు, వారి సాహిత్యము ఇట పేర్కొనబడును.

ఆరు—వైతాళిక సాహిత్య యుగము :— ఇందు తెలంగాణ వైతాళికులుగ పేరెన్నికగన్న మహనీయులందరు దర్శనమిత్తురు. ఇది కేవలము హేతుసరణినిబట్టి పాటించిన విధము. కాలసరణినిబట్టి చూచినచో ఈ మహాత్ములందరికీ, భాషానిలయ సాహిత్య యుగముతో ప్రారంభమైన తరువాతి అన్ని యుగములతోను సన్నిహిత సంబంధమున్నది. అంతేగాదు, ఈ యుగము లన్నింటికీ వారు ప్రాణాధార శక్తులు. అట్టివారిని గూర్చి అక్కడక్కడ చెదురు మదురుగా చెప్పిన దానికంటె అందరినీ ఒక చోట చేర్చి వారి సాహిత్య స్వరూపమును సందర్శించుట సమంజసమని భావించి యిట్లు చేయబడినది. ఇందలి మహనీయులలో చాలమంది 1950 తరువాత కూడ జీవించినవారున్నారు. అయినను ఈ యుగము (1950) సం॥తో ఆగిపోవును.

ఏడు—ఉస్మానియా సాహిత్య యుగము :— ఉస్మానియా విశ్వవిద్యాలయము తోను,, దానికి అనుబంధ కళాశాలయైన నిజాంకళాశాలతోను విద్యార్థులుగనో, అధ్యాపకులుగనో సంబంధము కలిగియుండిన సాహిత్యవేత్తలు, కవి కోకిలలు ఈ యుగమున సాక్షాత్కరించారు. ఇది కాలసరణి హేతు సరణులను సమన్వయించి చేసిన వ్యవస్థ. ఈ యుగమునందలి కవులలో ఇప్పటికినీ సాహిత్య సృష్టిని చేయుచున్నవారున్నారు. కాని కొంచెమటు నిటుగ ఈ యుగము కూడ 1950 సం॥ వరకు మాత్రమే పరిమితము చేయబడినది.

ఈ చేయబడిన ఏడు యుగములలోను ప్రాధాన్య వివక్షచే ఒక్కొక్కరికి ఒక్కొక్క యుగము కేటాయింపబడినది. కాని వీరిలో కొందరికి తమకు కేటాయింపబడిన యుగములతోనేగాక అంతకు ముందలి యుగములతోగాని, తరువాతి యుగములతోగాని కాలసరణినిబట్టియో, హేతుసరణిని బట్టియో సంబంధముండియుండుట కద్దు. అట్టి వారి పేర్లు ఆయా యుగములలో నామమాత్రముగ పేర్కొనబడును. కాని వారి సాహిత్యమును గూర్చిన విశేష విమర్శనము మాత్రము వారికై కేటాయింపబడిన ఆ యుగములో మాత్రమే చేయబడును. ఇది "ఇతిహాస సంకలన యోజన" సమితివారి ప్రణాళిక ననుసరించి పాటింపవలసిన పద్ధతి.

ఇప్పుడు క్రమముగా ఒక్కొక్క యుగమున ప్రవర్తిల్లిన తెలుగు సాహిత్య వికాస చరిత్రను పఠింతముగాక.



# ప్రాగ్భాషా నిలయ సాహిత్య యుగము

శా.శ. 1801-1823 = క్రీ.శ. 1879-1901

ప్రాగ్జ్యోతిష యుగమందలి సాహిత్యమువలె హైదరాబాదు నగరమునకు సంబంధించిన ఈ ప్రాగ్భాషా నిలయ యుగమందలి సాహిత్యము కూడ దాదాపు పూజ్యమై యున్నది. దీనికి కారణము పలుమారులు పూర్వోక్తము. అట్లయ్యును, కలికమున కైనను ఒక్క కవియాతుఁడైనను కానరాక పోవునా యన్న విచికిత్సతో మధించిచూడగా నామ మాత్రముగా ఒకే ఒక కవిని గూర్చియు అతని ఆంధ్ర సాహిత్యమును గూర్చియు విశ్వాసార్హమగు ఆధారము లభించుచున్నది. అది పేర్కొనిన పిమ్మట ఈ యుగము పరిసమాప్తమగును.

## పుల్లంరాజు నరసింగరావు

ఈ కవి జన్మస్థానము మహబూబ్‌నగర్ జిల్లాలోని బూర్గుల గ్రామము. హైదరాబాదులో నాల్గవ నిజాం నాసిరద్దౌలా కాల(శా.శ. 1751-1779 = క్రీ.శ. 1829-1857) మున పేష్కారుగా పనిచేయుచున్న రాజా రాంబక్షుగారి వద్ద(శా.శ. 1755-1768 = క్రీ.శ. 1833-1843) ఉద్యోగము చేయు నిమిత్తము వీరు హైదరాబాదునకు తరలి వచ్చి స్థిరనివాస మేర్పరచుకొనిరి. రాజా రాంబక్షుగారు పేష్కారు పదవి కోల్పోయిన పిమ్మట కూడ వారికడనే జీవితాంతము ఉద్యోగమునందుండిరి. ఇట్లు ఈ కవి దాదాపు శా.శ. 1812 వరకు (క్రీ.శ. 1890) జీవించినట్లు తెలియుచున్నది.

ఈ కవిగారియొక్క మునిమనుమడే మన బూర్గుల రామకృష్ణారావుగారు. వీరివంశ క్రమమిది: పుల్లంరాజు నరసింగరావు, వీరి నాల్గవ కుమారుడు వెంకటేశ్వరరావు, ఈతని కుమారుడు నరసింగరావు, ఈతని ఇద్దరు కుమారులలో జ్యేష్ఠుడు బూర్గుల రామకృష్ణారావు. రామకృష్ణారావుగారు పూనా, బొంబాయి నగరములకు ఉన్నత విద్యాభ్యాసమునకై వెళ్ళిన సమయమున మహారాష్ట్రుల ఆచారము ననుసరించి గ్రామము పేరు ఇంటి పేరుగా మారినది.

పుల్లంరాజు నరసింగరావుగారు నృపకేసరీశతకము, రామానుజ సుప్రభాతము- అను రెండు గ్రంథములను రచించిరి. ఈ రెండును అముద్రితములే.



# భాషా నిలయ సాహిత్యయుగము

(శా.శ. 1823-1848 = క్రీ.శ. 1901-1926)

## కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు

ఈ యుగమున నగ్రగణ్యులు శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుపంతులుగారు. వీరి జన్మస్థానము కృష్ణాజిల్లా, నందిగామతాలూకాలోని పెనుగంచిప్రోలు జననము శా.శ. 1799, మరణము 1845 క్రీ.శ. (1877-1923) తల్లిదండ్రులు గంగమ్మ వేంకటప్పయ్యగారలు, బాల్యముననే తండ్రి గతించుటచే తెలంగాణమునకు వచ్చి భువనగిరిలో విద్యాభ్యాసమొనర్చిరి. పిమ్మట తమ అక్కగారగు శ్రీమతి భండారు అచ్చమాంబగారి అత్తవారింట నాగపూరులోనుండి క్రీ.శ. 1898 లో బి.ఏ. ఆనర్సు పట్టమును, 1901 లో కలకత్తా విశ్వవిద్యాలయమునుండి ఎం.ఏ. పట్టమును పొందిరి. ఆంధ్రప్రదేశమునకు తిరిగివచ్చిన పిమ్మట తమ పితృపితామహులవలె మునగాల జమీందారుకడ దివానుగా నుండిరి. అదే సంవత్సరమున హైదరాబాదు నగరమునకు విచ్చేసి జమీందారు రాజా నాయని రంగారావుగారి ప్రేరణతో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయమును స్థాపించిరి. ఆంధ్ర భాషోజ్జీవనీనాటక సంఘమును దానికనుబంధిత మొనర్చిరి. 1906 లో విజ్ఞానచంద్రికా గ్రంథమండలిని నెలకొల్పిరి. ఈ విషయములన్నియు పూర్వోక్తములు.

విజ్ఞానచంద్రికా గ్రంథమాలా పక్షమున పదార్థవిజ్ఞాన-పారిశ్రామిక-ప్రకృతి భౌతిక-రసాయన-వృక్ష-జీవ-వైద్య శాస్త్ర గ్రంథములును, దేశచరిత్రములును, మహాపురుషుల జీవితచరిత్రములు ప్రకటింపబడినవి. 1912 ప్రాంతమునందు తెలుగుభాషలో ప్రప్రథమముగా ప్రారంభింపబడిన "ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము"నకు సంపాదకత్వము వహించి మూడు సంపుటములనందించిరి. శివాజీచరిత్ర, హిందూమహాయుగము, మహమ్మదీయ మహాయుగము, హైందవ చక్రవర్తులు. లక్ష్మణరాయవ్యాసావళి అనునవి గ్రంథములుగా ప్రకటించిరి. గౌతమ న్యాయదర్శనమును ఆంధ్రీకరించి "తెలుగు వాఙ్మయపత్రిక"లో ప్రకటించిరి. మహారాష్ట్ర భాషలో మోరోపంతు రచించిన కర్ణపర్వమును పరిష్కరించి ఆ భాషకు మహోపకారము చేసిరి.

వీరు పద్యకవిత్వమును వ్రాసినట్లు కానరాదు. గద్యరచన ఉత్తమ సాహిత్య విలువను సంతరించుకొన్నది. వీరి 'శివాజీచరిత్ర' ఆ మహావీరునిపై తెలుగులో వెలువడిన తొలిగ్రంథము. ఇదియే మహాకవి కీ.శే. గడియారం వేంకట శేషశాస్త్రిగారి 'శివభారతము'నకు తొలి యాధారగ్రంథమని చెప్పనొప్పును. వీరి వచనరచనా శైలికి మచ్చుగా శివాజీచరిత్ర నుండి కొన్ని పంక్తులుదాహరింతును.

"ఉచ్ఛృంఖలత్వము, మతోన్మాదము, కారణము లేనిది రక్తపాతము చేయుట, శత్రుస్త్రీలనవమానించుట మొదలయిన దుర్గుణములు వీరపురుషులకు సామాన్యములు. కాని రామదాసస్వామి యొక్క యోగ్యరాజధర్మోపదేశమువలన శూరుడైన శివాజీయందు నిందలి యేదుర్గుణంబులును కానరాకయుండెను. శివాజీ చేసిన యుద్ధములన్నియు ధర్మకల్పనలతోడను దేశాభిమానముతోడను నిండియుండినను ఆరౌద్రసమయమునందును శాంతరసము విడిచినవాడు కాడు. కొందరింగ్లీషు చరిత్రకారులు వ్రాసినట్టును మరి కొందరు తురుష్కులు వ్రాసినటులను శివాజీయుద్ధములు బందిపోటులు కావు. సిడ్నీ ఓవెన్ **(Sydneyowen)** అను గ్రంథకారుడు తన "యాంగ్లేయ విజయప్రభాతసమయమునందలి హిందూదేశము"**(India on the Eve of British Conquest)** అనుగ్రంథమునందు శివాజీయొక్క యుద్ధములను గూర్చియిట్లు వ్రాసియున్నాడు: "శివాజీయు నతని సైన్యంబులును, జేయు యుద్ధములలో వారు కేవలము బందిపోటు వారివలె వర్తింపలేదు. శౌర్యప్రభయు, స్వదేశాభిమానమును, స్వమతశ్రద్ధయు వారు చేయు కార్యములయందు కానవచ్చుచుండెను. ఈ గుణముల చూచియే వారు (మరాటా సైనికులు (శహాజీ కొమారుని (శివాజీని) ఈశ్వరసంకేతము చేతను, ఈశ్వరప్రేరణ చేతను తమ్ము పరబాధనుండి విముక్తుల జేయవచ్చిన యవతారపురుషునిగా నెంచిరి. శివాజీయు నతని ప్రథమ సహచరులును దామట్లు తురుకలతో బోరాడుటవలన దాము మత హితమును, లోకహితమును జేయుచున్నామని నమ్మిరి. అట్లు వారనుకొనుట సయుక్తికమే". (శివాజీచరిత్ర– అయిదవ ప్రకరణము–గురూపదేశము – అను భాగమునుండి)

## ఆదిపూడి సోమనాథరావు

వీరి పూర్వికుల అభిజనము గుంటూరుజిల్లా బాపట్లతాలూకాలోని ఒక కుగ్రామము. తండ్రితాతల తరమున నెప్పుడో ఈ కుటుంబము వారు ఆనాటి హైదరాబాదు రాష్ట్రము నందలి రాయచూరుజిల్లాలోని గద్వాల సంస్థాన ప్రాంతమునకు చేరుకొనిరి. వీరిద్దరు

అది నిజాం రాష్ట్రమను పేర నలరుచుండు
దానినిప్పుడుస్మానలీఖాను ప్రభుడు
రేలుచున్నాడు తత్పరిపాలనమున
నాంధ్ర భాషమహోన్నతినందుగాక
(భాషా నిలయ రజతోత్సవ సంచికనుండి)

వరద! యసంఖ్యహస్తములు వారక యిత్తువు నీవు కోరికల్
కరముల రెంట నేనెటుల గైకొనజాలుదు ? యుష్మదీక్షణన్
కరముల మోడ్చి నీకిదెన గౌరవ సూచక మౌనమస్కృతుల్
సకవి పరిగ్రహింపుమిదెసజ్జనజీవన లోకపావనా !
(పావనశతకమునుండి)

## మైలవరపు నరసింహశాస్త్రి

భాషా నిలయస్థాపక సభ్యులలో వీరు కూడ నొకరు. వీరి జననమరణ వివరములు గాని, జీవిత విశేషములు గాని అందుటలేదు. అయితే భాషా నిలయ రజతోత్సవములనాటికే కీర్తిశేషులైనట్లు మాత్రము తెలియుచున్నది. వీరు నిలయస్థాపకులలో నొకరుగాన తాము బ్రతికియున్నంతవరకు దాని క్రమాభివృద్ధిని గూర్చి "శ్రీకృష్ణదేవరాయల ఆంధ్ర భాషా నిలయ ప్రవర్ధమాన చరిత్రము" అను పేరుతో నొక పుస్తకమును వ్రాసినట్లు తెలియుచున్నది. అందులో వారు వ్రాసిన కొన్ని పద్యములను వీరి భాషా నిలయ రజతోత్సవ సంచికలో ప్రచురించుట జరిగినవి. అందులోని రెండు పద్యములుదాహరింపబడుచున్నవి :

ఉ॥ మాతృకళావిలాసము సమగ్రము గా బలియించినందునన్
భూతలమందు నాంధ్రులకుఁ బూర్ణసమృద్ధతయున్ విభూతియున్
ఖ్యాతియు నీతి యున్నతి సుఖస్థితియున్ సుజనైకమత్యమున్
రాతిరియున్ బవల్ మఱపురాని మహోన్నతినుండజాతమే !

సీ॥ పరభాషల భ్యసింపగవచ్చు హెచ్చుగా
మాతృభాషనదేల మానవలెను
ద్రవ్యంబు గడియించు దారి జూడగవచ్చు
మాతృభాషనదేల మానవలెను
పరమర్మభేదనోపాయంబుగనవచ్చు
మాతృభాషనదేల మానవలెను
సత్యమార్గంబున జరియింపగావచ్చు
మాతృభాషనదేల మానవలెను

తే॥ మానరాదని మనమభిమానముంచి
గారవించిన మనతల్లి గౌరవంబు
సూర్యచంద్రులు తోత్రివలు సురిగెనేని
సురిగి పోవునె భువినాంధ్ర సూనులార !

## వేలూరి రంగధామనాయుడు

భాషా నిలయమునకు క్రీ.శ. 1926-27 లో రజతోత్సవములు జరుగు నాటికి వీరు దీనికి ఉపాధ్యక్షులుగ నుండిరి. నగరములోని బడీచౌడీ వీరి నివాసస్థానము. జనన మరణములను గూర్చి కచ్చితమైన తేదీలు లభించుటలేదు. కాని కొందరి వ్రాత లనుబట్టి క్రీ.శ. 1860-1940 మధ్య జీవించియుండినట్లు నిశ్చయముగ చెప్పవచ్చును. వీరు ఎం.ఎస్.ఏ (లండను) పట్టభద్రులు. కొన్ని చిత్రపటములలోని రూపమునుబట్టి గొప్ప వైష్ణవ భక్తులుగ కాన్పింతురు. వీరు అనేక గ్రంథములను వ్రాసిప్రకటించిరి.

ముద్రిత రచనలు : ఆళ్వారుల చరిత్రము, భక్తపోషణ శతకము, రామాయణ సీసమాలిక, శంకరవిజయము, సచ్చిదానందస్వామిజీవితము, సత్యనారాయణ వ్రత కల్పము, నీతిబోధశతకము, నవగ్రహఫలాఫల శృతి, వైరాగ్యశతకము, శ్రీగురు స్తవము, వేంకటేశ్వరశతకము, అలుమేలుమంగతాయిశతకము, శ్రీకృష్ణలీలలు.

అముద్రితరచనలు : యాదగిరి నరసింహశతకము, సంపూర్ణ రామాయణము సంపూర్ణ భాగవతము (గానములు) యామునాచార్యచరిత్ర, కేశవనామ సీసమాలిక, మొదలైనవి. భాషా నిలయి రజతోత్సవ సంచికలో వీరొక "సీసమాలిక"ను వ్రాసిరి. ఛందోరీతివైవిధ్యమును సూచించుటకది యుదాహరింపబడుచున్నది.

శ్రీమన్మహారాజశేఖర శ్రీకృష్ణదేవరాయల కీర్తిదీప్తులెసగ
మునగాల ప్రభువరుడనఘుడు నాయనరంగా రావధికానురాగమునను
భాగ్యనగరమందు భారతీ పూజార్హమాంధ్రభాషా గృహమమరజేయ
కొద్దిలో భవనమొండద్దెకుఁ గుదిరించి యందులోనాశాలబొందు
విద్యాభిమానులు వేడ్కమీరగనందు గ్రంథకాలక్షేపకార్యనిరతి, పఱచి,
వెలయ వార్తాపత్రికల దారుపఠియింపదగిన యేర్పాటులెంతలొనర్చె,
వీరికి నెయ్యంపు వినయమిత్రుఁడు రావిచెట్టు రంగారావు పట్టువిడక
ప్రత్యేక భవనమే బాగని తలపెట్టి కట్టింపనుండిన కాలమునకు
పారిరబ్ధవశతను బరమపదించెను వీరి సతీమణి విభుని కోర్కె
నీ డేర్పసమకట్టి యెంతయు నిష్ఠతో దానికిదగు ప్రయత్నంబుజేసి
వసతైన స్థలమొండు రెసిడెన్సిబాజారునందున గొనియీయబొందుమీర
ధర్మాత్ములంతట ద్రవ్యసహాయంబుసేయ నీనిలయముస్థిరపడియెను
ఇందులో నేర్పరులెందరో పండితుల్ తఱచుగా దయచేసి పరమకృపను
దెలియని యంశముల్ దెలుపుచు నుపన్యాసములనిచ్చి జనులకు ముదముగూర్ప
విద్యాభివృద్ధియు విహితమార్గాదులు సద్వృత్తులకు సహాయపడుచు
నాంధ్రభాషాభిసిద్ధి కభిరుచిగలిగించి పూర్వపండిత కవిబుధుల ఘనుల
చారిత్ర విషయముల్ జదివిసంతసమందు వసతులుగలయట్టి భవనమయ్యె
పూర్వంపు గ్రంథముల్ పురుగులపాలేట జూడనలవిగాని జాడఁబోలిసె
నవియెల్ల నీగృహమందున గన నౌను శ్రద్ధతోఁజూచెడుచదువరులకు

నిరువదయిదేండ్లు నిండిన - యిట్టి నిలయ
కన్యదీర్ఘాయు వైజ్ఞానకాంతులాంధ్ర
భూమివెదజల్ల దోడ్పడి - పుణ్యులగుడు
ఆంధ్రజనులారా! బుధులార! యార్యులార!

## గుండోబాకవి

ఈతడు హైదరాబాదునగరమునందలి "రామపల్లి" వాస్తవ్యుడు, జనన మరణ వివరములు స్పష్టముగ తెలిసివచ్చుటలేదు. ఈతడు శా.శ. 1825లో (1903) "వీరాంజనేయ శతకము"ను వ్రాసినట్లు కొందరు పరిశోధకులు పేర్కొనిరి. దీనినిబట్టి యీకవి శా.శ. 1800-187ం మధ్యకాలమున (క్రీ.శ. 1878-1953) జీవించియుండ

నట్టి నిశ్చితముగ భావింపవచ్చును. ఈయన హరితసగోత్రివైష్ణవుడు. సంస్కృతాంధ్ర ప్రాకృతభాషలలో మంచి పాండిత్యము గలిగినవాడు. ఈతని "వీరాంజనేయశతకము" లోని పద్యములు "హైమధరణీ కాంత వీరాంజనేయ" అన్న మకుటనియమముతో నొప్పుచున్నవి. స్వామి యవతారములలోని వివిధ ఘట్టములను ఒక్కొక్క పద్యములో నొక్కొక్కటిగ వర్ణించుటచే అవిచ్ఛిన్నధారితముగ నంతటిని ఒకానొకక్రమపద్ధతిలో నిబద్ధము చేసిన తీరు కడు రమ్యముగ నున్నది. ఈకవి యిందలి పద్యములలో తెలుగు నుడులను, హిందుస్థానీ పదములను, పలుకులను అటనట కలియబోసి చక్కని రచన చేసెను. ముందు స్వామి నుతితో పద్యములను ముగించుచుండును. ఈ క్రింది పద్యభాగములను పరికింపుడు :

రామచంద్రుడు సీత రమ్మెందు సర్కారు
సుంకమా సీయంతచోపుదారు
నామీఁద దయనెన్నఁడిక మేర్బాను
కార్ఖానే రాకొనకూర్చు చైను.

## కోటయామాత్యుడు

ఈతడు సికింద్రాబాదు నివాసి. ఈతని జీవితకాలమును గూర్చి గూడ కచ్చితముగా తెలియవచ్చుటలేదు. శా.శ. 1836 సం॥ ప్రాంతమున (క్రీ.శ. 1914) ఈతడు శ్రీ ఆంజనేయశతకము వ్రాసినందున దానిని బట్టి శా.శ. 1807-1882 మధ్య కాలము (క్రీ.శ. 1885-1960) జీవించి యుండినట్లు స్థూలముగ భావింపవచ్చును. సికింద్రాబాదు నగర పరిసర ప్రాంతమునందు వెలసిన ఒకానొక ఆంజనేయస్వామిని ఉపాసించి ఆ స్వామిని గూర్చి ఈతడు శ్రీఆంజనేయశతకమును వ్రాసినట్లు తెలియుచున్నది. ఇందులో నీ కవి స్వామియొక్క బాల్యచేష్టలను, సాహస పరాక్రమములను చారుగంభీరముగ వర్ణించిన వైనము మిక్కిలి ఆకర్షకముగ నున్నది. ఆచార్య డా॥ కె. వి. గోపాలకృష్ణారావుగారు ఈకవియొక్క రచనా ప్రౌఢిమను గూర్చి యిట్లు ప్రశంసించిరి. "ఈకవి ప్రాచీన కావ్యములను బహుళముగ పఠించి ఆయా కావ్య శైలీ విన్యాసములను చక్కగా జీర్ణించుకొనెను. యమక, అనుప్రాస, శ్లేష, ముక్త పద గ్రస్తాది అలంకార శోభితమై, భక్తిరసాత్మకమైన ఆంజనేయశతక శైలి హృద్యముగ నున్నది" అని. ఇందుకు వారు ఉదాహరించిన పద్యములే యిట ఉట్టంకింప బడుచున్నవి :

(1) రామ నామామృతరసము దోసిటజుట్టి
బొజ్జపెంచిన గాలికట్టియకుచు

(2) వేదనాపరిహార విశ్వదాధార
భారబాహోగసంకలిత విహార !

## దొంతర మల్లేశము

కవి కాలమును నిర్ణయించుటకు తగిన యాధారములు లభించుటలేదు. "అలువాల మాహాత్మ్యము" అను గ్రంథమును వ్రాసినట్లు భాషా నిలయ రజతోత్సవసంచికలో ప్రకటింపబడిన గ్రంథముల పట్టికనుబట్టి తెలియుచున్నది. ఇంతకుమించిన వివరములు మృగ్యములు. గ్రంథముకూడ అలభ్యము. సికింద్రాబాదునకు దాపుననే యున్న "అలువాల" గ్రామము యొక్క మహాత్మ్యమును గూర్చి యందు వర్ణింపబడినట్లు ఊహింపబడుచున్నది.

మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, ఆదిరాజు వీరభద్రరావు, బూర్గుల రామకృష్ణరావు, రాయప్రోలు సుబ్బారావు ప్రభృతులను కూడ ఈయుగమునందే చేర్చవలసియున్నది. వీరందరు దాదాపు క్రీ.శ. 1915-20 మధ్యకాలము నాటికే హైదరాబాదు నగర సామాజిక రంగమున సుప్రతిష్ఠిత వ్యక్తులుగ ప్రఖ్యాతి వహించిరి. అంతేగాదు ఇప్పటికే గ్రంథములను వ్రాసి ప్రకటించిరి గూడ. అట్లైనను నేను స్వీకరించిన రచనా ప్రణాళిక ననుసరించి వీరి పేర్లు మాత్రమే యిట పేర్కొనబడినవి. వివరములు వీరికి కేటాయింపబడిన వైతాళిక సాహిత్యయుగమున ప్రస్తావింపబడును.



# గోల్కొండ కవుల సంచికా సాహిత్యయుగము

శా.శ. 1848-1860 = క్రీ.శ. 1926-1938

ఈ యుగమునందలి కవులలో నధిక సంఖ్యాకులు పండితకవులు. ప్రాచీన పద్ధతిలో సంస్కృతాంధ్ర భాషలను క్షుణ్ణముగ నభ్యసించి శిల్పము నెఱిగి పద్యరచన చేసిన మహనీయులు. వీరికి ఎవ్వరి అండదండలుగాని బొత్తిగా లభింపని కాలమది. అట్లయ్యును తలవంచుకొని తమ సాహిత్య రచనా వ్యాసంగమును కొనసాగించుకుపోయిన వారివలె కాన్పింతురు. ఇట్టి వారినందరిని సమీకరించి క్రీ.శ. 1934లో గోల్కొండ కవుల సంచికా ప్రచురణ ద్వారా లోకమునకు పరిచయము చేసిన ఘనులు, కీ.శే. సురవరం ప్రతాపరెడ్డిగారు. ఆ సంచికయే మన యీ యుగమునకు ప్రధాన ప్రాతిపదిక. ఇందలి కవులను గూర్చి కొన్ని క్రొత్త విషయములను జోడించి చెప్పుటకు నిట ప్రయత్నము చేయబడినను ప్రధానముగ సదరు సంచికలోని వివరములే యథాతథముగ పునరుద్ఘాటింపబడుచున్నవని చదువరులు గ్రహింతురుగాక యని మనవి చేయుటమైనది.

## పంతము ఆంజనేయకవి

ఈతని జన్మస్థానము సికింద్రాబాదు. జననాదికములను గూర్చి ఇదమిత్థముగ నిర్ణయించి చెప్పుటకు వీలుగాకున్నను గోల్కొండకవుల సంచిక నాధారముగ ఈ శతాబ్దపు తొలి యేభై సంవత్సరములలో నుండినట్లు కచ్చితముగ నిర్ణయింపవచ్చును. ముద్రిత గ్రంథములు : విచిత్ర రాఘవీయము, మోక్షసాధని, శ్రీకృష్ణలీలాతరంగిణి, శ్రీపాండురంగశతకము, రుక్మిణీకల్యాణము మొదలగునవి. "కవులు తమకుగల రచనాశక్తిని భగవదంకితముగ కావ్యములను రచించుటలో వినియోగించవలయునని ఈతడు తన పాండురంగశతకములో నుపదేశించినట్లు'' ఆచార్య డా॥ కె॥ గోపాలకృష్ణారావుగారొకచోట పేర్కొనిరి.[1] "మాతృప్రేమ'' అను శీర్షికన గోలకొండకవుల సంచికలో ప్రచురింపబడిన యీతని పద్యము లివి :

---

1. ఆంధ్ర శతక సాహిత్య వికాసము పి.హెచ్.డి సిద్ధాంతగ్రంథము

చం॥ కొడుకొక వేళ దుష్టుడయి కూళలఁగూడి చరించి విద్యలన్
బడయక మూర్ఖపద్ధతిని బంధులఁగేరుచుఁ దండ్రిఁదిట్టి దుం
దుడుకుతనంబు జూపి బుధదూషణుడై వెసనుంట దండ్రియా
బుడుతని శాస్తిఁ జేయఁ దలపున్ దలపెట్టినఁ దల్లియోర్చునే

ఉ॥ నందను ముద్దుమోము స్మరణంబున నిల్పుచుఁ జిత్తమందు నా
నందముఁ జెందుగాని నిజనందను దుష్టచరిత్ర కెంతయున్
గొందలమొందదెన్నదనుకూలముఁగా నిజపుత్రుమానసా
నందము నందజేయుఁ గద నాతులకుండెడు ప్రేమతోడయే
చందముఁ బోల్పగా దగును జాలవుగా నెటువంటి వస్తువుల్

సీ॥ ఎంతవేడిమికోర్వకింటికి నేతెంచు
కొడుకు చెమ్మటఁ గొంగుఁదుడుచుఁదల్లి
తుడిచియంతటఁగాగుతోయముల్ వెసఁగూర్చి
మజ్జన మాడించి బొజ్జనిమురు
నిమిరె భోజనమిడి ని యతిఁ జెంతను జేరి
యతులనీతుల బోధనమరఁజేయుఁ
జేసితెచ్చిన విత్తమాసింపకనుఁ బ్రీతిఁ
దనయ పోషణలోన వినయపఱచు

తే॥ బఱచికంటిరెప్పను బోలెఁ గాంచుఁ గాంచి
వత్స! యీరీతి జనుమంచుఁ బ్రోత్సహించు
తల్లికరుణకు మించిన ద్రవ్యమెద్ది
జననికెనయైన దైవంబు జగతిఁ గలదె!

## వారణాసి రామయ్య

జన్మస్థానము సికిందరాబాదు. జననము 1870 ప్రాంతము, హరిదాసులు. కీ.శే, కొండా వేంకటరంగారెడ్డిగారి యాస్థానకవి. ముద్రిత రచనలు: శ్రీరామాచలపూర్ణబోధ, దత్తాత్రేయ పంచవింశతి, శ్రీరామ మానసికపూజ, బమ్మెరపోతరాజ విజయము. అచల హరిశ్చంద్రోపాఖ్యానము. అముద్రిత రచనలు : అభినవ ప్రహ్లాదోపాఖ్యానము, ధ్రువో

పాఖ్యానము, సర్వమతసార సంగ్రహచరిత్ర. మొ॥ "దత్తాత్రేయ పంచవింశతి" వీరి గ్రంథములలో పేరెన్నికగన్నదని చెప్పవచ్చును. ఇందుండి అయిదు పద్యములు "దత్తాత్రేయ సప్తకము" అన్న శీర్షికన గోలకొండకవుల సంచికలో వేయబడినవి. ఆ పద్యము లివి :

సీ॥ శ్రీకైవల్యరమాకటాక్ష విలసచ్ఛృంగారభావప్రసూ
నా కీర్త్యాంఘ్రిసరోజుడై తదనుభూత్యానందసంధానస
త్పేకానందన సచ్చిదాన్వయ పధూసేవారతిన్ జొక్కు వి
ద్యాకల్పోన్నతుడైన మద్గురుని దత్తాత్రేయునిం గొల్చెదన్

సీ॥ ఏనః పుంజముఁబాపి శుద్ధమతులై యిష్టార్థమున్ గాంచినా
నానిశ్శ్రేయససౌఖ్యముల్ జనులు గన్నారంచు విన్నాడనే
నీనామోరుమహత్త్వ మ్లగుటచే నీదివ్యపాదాబ్జముల్
ధ్యానంబందున నిల్పిపోవుమని దత్తాత్రేయునిం గొల్చెదన్

మ॥ అనసూయాత్రుల పుణ్యసంపదఁ ద్రిమూర్త్యంశమ్మునన్బుట్టితా
జననంబాదిగ బ్రహ్మచర్యఘనదీక్షంబూని యాకల్ప జీ
వనసిద్ధిన్గని జ్ఞానమార్గమును సర్వస్తుత్యమై యొప్పని
త్యనిధానంబుగ భక్తకోటికిడు దత్తాత్రేయునిం గొల్చెదన్

మ॥ సదయుండై పరులన్ భయంకర మహాసంసార ఘోరాంబు రా
శిఁ దరింపన్ బొనరింపఁబుట్టె నగుటన్ జిత్తంబునన్ దాను తు
చ్ఛదురంతైహికసౌఖ్యలేశముల పజ్జన్ జేరకెవ్వాడు స
త్యదశారూఢతమించె నట్టిగురు దత్తాత్రేయునిన్ గొల్చెదన్

మ॥ నయధుర్యుల్ రఘురామకృష్ణముఖులానారాయణాంశుల్ జగ
న్మయ ధర్మంబుల రక్షఁజేయుచును గొన్నాళ్ళుండిచన్నారు నీ
వయుగాంత ప్రళయాంతముందువు సదాపూర్ణాన సూయాత్మ్యాప
త్య! యథార్థాచల తత్త్వబోధ నిను దత్తాత్రేయునిన్ గొల్చెదన్.

# అన్నగారి వేంకటకృష్ణారాయుడు

పీరిది బీబీనగరము ఒకప్పుడు హైదరాబాదు నగరసమీపమున అని చెప్పబడు చుండిన బీబీనగర మిప్పుడు హైదరాబాదులో నంతర్భాగ మగుటవలన వీరి జన్మ స్థానము హైదరాబాదనియే చెప్పనొప్పును. ఈకవి 1915 సం॥ ప్రాంతమున మరణించినట్లు తెలియుచున్నదిగాని జననమును గూర్చి తెలియుటలేదు. వీరి గ్రంథము లన్నియు అముద్రితములే. కృష్ణనామాంకిత శ్రీ విరహ సీసశతకము, అద్భుతరామాయణము, జీడికంటిశతకము, శ్రీరామనామ ప్రతిపాదిత ధైర్యశతకము, లక్ష్మీశతకము, ఇవి వీరి రచనలు. కృష్ణనామాంకిత శ్రీవిరహసీసశతకమునుండి రెండు పద్యము లుదాహరింతుము. ఇది మధురభక్తికి నిధానములు.

సీ॥ సంతోషకర పుష్పసముదయోద్యాన వ
నంబులనంగ, కానలనిదోచె
కడు చిత్రచిత్ర ప్రాకారసౌధాగ్రమం
దిరమును దలపోయ దిగులుదగిలె
మణిమయ సకలభూషణ వితానములెల్లఁ
గనినఁజన్నగములగతి వహించె
వినుటకు సొంపుగావింపు వీణాదిగా
నధ్వనుల్ సహ్యాతూన్యంబులయ్యె

గీ॥ పతినివిడచుట దేహమేపస దొలంగె
నేమిదోచదు నింక నేనేమిసేతు
వేగనీవేగి శ్రీబీబినగరవాసు
గృష్ణమూర్తిని దేగదే కీరవాణి.

సీ॥ తెలుపవే నావెతల్ సలుపవే బహునుతుల్
కలుపవే యనుమతుల్ కాంతునకును,
మలుపవేసతి జాడఁగొలుపవేమరులీద
నిలుపవే ననుగూడ నిజముతోడ
వద్దనే యాసుద్ది కద్దనేయతిరద్ది
వద్దనే యీబుద్ధి పదుగురింట
రమ్మనేగతగనేలు కొమ్మనేరతిమేలు
లిమ్మనే తననమ్మికొమ్మనవవె

గీ॥ కొమ్మనాయెదమదనుండు గ్రుమ్మెననవె
నమ్మ మరుబారికోపింపకన్నదనవె
వేగనీవేగి శ్రీబీబినగరవాసు
గృష్ణమూర్తిని దేగదేకీరవాణి !

## శేషభట్టరు వేంకటరామానుజాచార్యులు

వీరు నల్లగొండ గ్రామమునకు చెందినవారు. హైకోర్టు వకీలు వృత్తిరీత్యా. హైదరాబాదునగరమున స్థిరనివాసమేర్పరచుకొనియుండిరి. గోలకొండ కవులసంచికలో వీరిజన్మ-౧౨ ఖుర్దాదు ౧౩౦౯ ఫసలీ పేర్కొనబడినది. ఫసలీకి క్రీస్తుశకమునకు సుమారు 592 సం॥ వ్యత్యాసముండునట ఈతేడాను బేరీజువేసి చూడగా వీరి జననము క్రీ.శ. 1890 సం॥ప్రాంతమని తేలుచున్నది.

ముద్రిత రచనలు :- ప్రాకృతదాంపత్యము నల్లగొండ చరిత్రము.

అముద్రిత రచనలు:- భావప్రపంచము

వీరు "ఆంధ్రనామసంగ్రహము" అన్న శీర్షికన వ్రాసిన ఎనిమిది పద్యములు లోకముపోకడను గూర్చి వ్యంగ్యముగ చిత్రించిన రీతి మిక్కిలి చమత్కారజనకముగ నున్నది. ఇవి "భావప్రపంచము" నుండి ఉట్టంకింపబడినవి. 'దేవవర్గు' అను ఉప శీర్షికక్రింద భగవంతుని గూర్చి యొకపద్యము "బ్రాహ్మణవర్గు" శీర్షికన కవి, పండితులనుగూర్చి యొక పద్యము, "ఆశ్రమవర్గు" శీర్షికన బ్రహ్మచారినిగూర్చి యొక పద్యము, సన్యాసినిగూర్చి మరియొక పద్యము, "దరిద్రవర్గు" శీర్షికన దరిద్రుని యావరించు నవస్థలను గూర్చి యొక పద్యము, "వ్యవహారవర్గు" శీర్షికన సల్లక్షణములు గలిగిన వ్యక్తులను లోకమెట్లు మారుపేర్లు పెట్టునోయను విషయమొక పద్యము నందును మిక్కిలి పసందుగా చెప్పబడినది. మచ్చునకు రెండుమూడు ఖండిక లిట్లుండును.

## దేవవర్గు

తే॥ భాగ్యవంతుల కోర్కులుపండజేసి
భాగ్యహీనులఁ గష్టాలపాలొనర్చి
జగములెల్ల నిరంకుశధరణినేలు
వ్యక్తిపేరొప్పు భగవంతుడన నుమేశ.

## స్వదేశవర్గ

కం॥ ధనధాన్యములన శౌర్యం
బన ధైర్యమనగ విద్యయన విజ్ఞానం
బనఁజెల్లు భరతఖండం
బునఁగానగరాని వస్తువుల పేళ్ళుభవా!

కం॥ వేసారక శుష్కోప
న్యాసములిడు వాడు దేశనాయకుడనగా
భాసిలుఁదభ్ఫోగ్రితలకగు
వాసముఖవినుత దేశభక్తులనంగన్.

సమకాలీన సమాజపరిస్థితుల దౌర్భాగ్యమును వ్యంగ్యవైభవముతో వర్ణించు నీ సత్యములు పరోక్షముగ చక్కని యుపదేశమొసగుచు కొంచెము జ్ఞానమున్న వ్యక్తులను సరియగు మార్గమునకు మళ్ళింపగల సత్తుగల పద్యములని నిష్కర్షచేయవచ్చును.

## అరిగెరామస్వామి

జన్మస్థానము హైదరాబాదు కాదుగాని ఆబాల్యము హైదరాబాదు నివాసులే. జననము 890 సం॥ ప్రాంతము. మరణము 1975 సం॥ ప్రాంతము. దాదాపు 85 సంవత్సరముల పూర్ణపురుషాయుషి జీవితధన్యులు. కులమునకు హరిజనులు, మెట్రిక్యులేషనువరకు విద్య నార్జించిరి. 1910-32 మధ్యకాలమున రైల్వేలో ఉద్యోగముచేసిరి. 1934 నాటికి హైదరాబాదు నగర మునిసిపాలిటీలో సభ్యులుగా నుండినట్లు తెలియుచున్నది. ఆవిధముగ రాజకీయరంగమున ప్రవేశించి వాసికెక్కిన హరిజన నాయకులై ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన పిమ్మట మంత్రిగా ప్రజాసేవ యొనర్చిన వ్యక్తి. దీనికితోడు వీరు సంఘసంస్కర్తలుగకూడ ప్రసిద్ధినొందిరి. కీర్తిశేషులగుటకు పూర్వము రమారమి నలువది సంవత్సరముల కాలమున కుల నిర్మూలనకై ప్రత్యేకముగ కృషిచేసి వర్ణాంతర, భాషాంతర వివాహములను, ప్రోత్సహించినవారు. నాస్తికమతవాదులయిన గోపరాజు రామచంద్రరావుగారి ("గోరా") శిష్యులు. గోలకొండ కవులసంచికలో రెతులారా! అను శీర్షికన వీరు వ్రాసిన పద్యములివి :-

గీ॥ మాలమాద్గులన్న మతములఁ జేరిరి
ఛేడ్చమారంచుఁబెట్టుకతన
దేశమతము దిక్కు ఛేడ్చమార్లేగదా
రక్తబంధులార! రైతులార!

గీ॥ హిందుమతము జీవహింసకు నోర్వదు
మాలమాద్గులన్న మండిపడును
తనను హింసఁజేయఁదగ సలాముఁజేయు
రక్తబంధులార! రైతులార!

హిందూసమాజమును బాధించుచున్న అంతర్గత సమస్యలిందు సూత్రప్రాయముగ చక్కగ ప్రతిపాదింపబడినవి. ఇవి ఏబదియేండ్లనాటి పద్యములు. అప్పటికి నిప్పటికి నీసమస్యల పరిష్కారమొక కొలిక్కైన వచ్చినదో లేదో భారతీయుడయిన ప్రతి వ్యక్తి తీవ్రముగ నాలోచింపవలసిన విషయము. ఆలోచనతో కాలయాపనచేయుటకాదు. కర్తవ్యోన్ముఖులగుడని హెచ్చరించు పద్యములివి.

## తిరుమల పంచాంగం వేంకటాచార్యులు

వీరి జన్మస్థానము హైదరాబాదునందలి సీతారాంబాగు. జననము 1890 సం॥ ప్రాంతము.

ముద్రిత రచనలు :- ఇప్పటికినీ వెలువడిన వైనము కానరాదు.

అముద్రిత రచనలు:- జానకీపరిణయము. చంద్రమతీపరిణయము.

"దంపతి సంవాదము'' అను శీర్షికన వీరి సీసపద్యములు రెండు గోలకొండ కవులసంచికలో ప్రచురింపబడినవి. ఇవి పైరెండు అముద్రిత గ్రంథములలోనివి గాక విడిగా వ్రాసిన పద్యములని గ్రహించుట సులభము. ఆ పద్యములివి :

సీ॥ జూదంబు ధర్మంబుగాదు నాథాయని
పలుకదే భీమభూపాల పుత్రి
వేటాడనంపుడీ వీరభటులనని
తెలుపదే చంద్రమతీలతాంగి
చనకుడీ మీరిప్పు డని నొనరింపగా
నని వాలితో దారయనఁగలేదె
పరసతులను గోర భావ్యంబుగాదని
దశముఖుతో మయ తనయయనదె.

గీ॥ బోటులాడిన మాటలఁబాటిచేసి
వీరునెలఁతల గడు గారవించినారె
సతుల మాటలు విన్న మామతులు సెడవె
సాటివారలలో నగుబాటుగారె?

సీ॥ దాక్షాయణిం గోర్కె దక్షాధ్వరంబున
కనుపడే శంకరుడనఘుడయ్యు
కైకగోరిన రాముఁ గన్న కుమారుని
దండకాటవికంపె దశరథుండు
జానకిఁగోరఁగాఁ జనియెలోకేశుండు
హేమమృగమువెన్కఁ రామవిభుఁడు
పారిజాతము సత్యభామ గోరినఁదెచ్చెఁ
బాకారిఁగెలిచి గోపాలవిభుఁడు

గీ॥ పూరుషున కమృతమైయొప్పుబోటిపలుకు
చెప్పినట్టుల సేయుట గొప్పపనవి
నాతివెనువెంటః దిరుగుట నాకపదము
వినకయుండుట యెట్టులో కనకగాత్రి !

భావము, భాష, నిర్వహణము ఎంతటిచమత్కార జనకముగనున్నవో చూడుడు. దంపతుల మధ్య జరుగు పసందైన సరససంభాషణమునకిది పరమోదాహరణము. మొదటి పద్యమందలి "మామతులు" అన్నమాటకు మీమతులు అని యర్థము. అతి సహజమైన వ్యంగ్య వైభవముతో విఁసిల్లు ప్రయోగమది.

## గొట్టుపర్తి సుబ్బారావు

హైదరాబాదు నగర నివాసులు. హైకోర్టు వకీలుగా నుండిరి. జననము హేవిళంబి నామ సంవత్సర ఆషాఢ శుద్ధ త్రయోదశి క్రీ.శ. 1897 జూన్ మాసము. ముద్రిత గ్రంథములు మృగ్యము. అముద్రిత రచన-వేంకటేశ్వర శతకము.

తెలుగు వాఙ్మయమున శతక సాహిత్యము శాఖోపశాఖలుగ విస్తరిల్లినది. అందు వేంకటేశ్వర శతక సాహిత్యమనంతము. "కలౌ వేంకటనాయకః" అనిగదా మన విశ్వాసము. గోల్కొండ కవుల సంచికలో వీరి వేంకటేశ్వర శతకము నుండి "ఆత్మ బోధ" అన్న శీర్షికన అయిదు పద్యములు చోటు చేసికొన్నవి. ఆ పద్యము లివి :

ఉ॥ దగ్గఱవారు చుట్టములు దాతయుఁదల్లియు నాల బిడ్డలున్
గ్రుగ్గెను సట్టికాలమున మాయకు లోబడి యట్టివారికై
యెగ్గును సిగ్గులేక యెటో హీనధనంబొడఁగూర్చుచుంద్రు తా
మొగ్గి యనేక దుష్కృతుల కోరి మనుష్యులు వేంకటేశ్వరా !

చ॥ పరగ పురాకృతానుగతి బ్రాహ్మణులై జనియించి ధర్మముల్
దొరగియుఁ బొట్టకోసమయి దుష్కృతకర్మము లాచరించుచున్
చిరమని యైహికంబు విరతిన్ గొనకల్పుల సేవకే
దొరలుచు మూఢ చిత్తులయి ద్రోతురు కాలము వేంకటేశ్వరా !

చ॥ సరస వయో విలాసములు సౌఖ్యమటంచని మోహపాశమున్
దురుమగలేక దుర్భ్రమలతోడు తదృశ్య పదార్థమెల్ల సు
స్థిరమని నమ్మి నీ పరమతేజముఁగాంచెడి దారి ద్రొక్కగా
నరుగరు మానవాధములయారె ధరాస్థలి వేంకటేశ్వరా !

ఉ॥ స్నాన జపాగ్ని హోత్రముల సల్పగ శక్తియొకింత లేదికే
దానముగాని లేనియెడ ధర్మముగాని యొనర్ప యాత్రలన్
బూనిచరింపగా మడినిఁబూన నొకప్పు డచేని యెట్టు లీ
దీనునిఁ బ్రోవనెంచెదొ యతిప్ర మదమ్మున వేంకటేశ్వరా !

చ॥ తనువు లశాశ్వతంబులని దార సుతాదులు వ్యర్థమంచునే
మనమున నూహఁజేసియును మానగలేనతి సౌఖ్యలోలతన్
నిను నొకసారియైన కడు నిశ్చలతన్ గొలువంగ లేనహా
వన రుహనేత్ర నన్నెటులఁబాలనఁజేసెదొ వేంకటేశ్వరా !

## కొండా యల్లయ్య

జన్మస్థానము హైదరాబాదు నగరము. జననము వ్యయనామ సంవత్సర శ్రావణ శుద్ధ పంచమి, శాలివాహన శకము 1826, క్రీ శ. 1903. గోలకొండ కవుల సంచిక ప్రచురణనాటికే ఈతడు కీర్తిశేషుడయినట్లు తెలియుచున్నది. దీనినిబట్టి ఈతడు బ్రతికినది ముప్పది సంవత్సరములు మాత్రమేయనుట, కులము పద్మశాలి యనియు సదరు సంచికలో పేర్కొనబడినది. ఈతడు గొప్ప రామభక్తుడు.

ముద్రిత పుస్తకములు-సుందరకాండము. ఇది గీర్వాణ పారాయణ గ్రంథము. సుందరకాండ పారాయణము కలి ధ్వంసకమని మన విశ్వాసము. ఆ మేరకు దీని నచ్చొత్తించి జనసామాన్యమున కందించిన మహనీయుడీతడు.

అముద్రిత రచనలు— దశరథరామ శతకము, శ్రీరామ సంకీర్తనలు, ఈతని దశరథరామ శతకమునుండి మూడు కంద పద్యములు పునరుట్టంకింపబడుచున్నవి.

శ్రీ రవికుల సుత్రామా
సూరిజన స్తోమ వినుత సురుచిర నామా
చారు లసద్గుణ ధామా
దారుణ సంగ్రామ భీమ దశరథ రామా

బహుభంగుల నినువేడిన
గుహునకు నిడినావు గావె కోర్కుల నెల్లన్
సహజము నీకిది రిపువన
దహనా సీతాభిరామ దశరథరామా

జానకి చెంగట లేదా
పూనిక భక్తులను బ్రోవ బోధింపదయో
మానిక గుణగణ వినరా,
దా, నా మొఱ వీనులార దశరథరామా !

## పేరక రంగాచార్యులు

హరిదాసు, సంగీతాష్టావధాని. అవధాన ప్రక్రియ వివిధ శాఖలుగ విరాజిల్లు చున్నది. అందులో ఈ సంగీతాష్టావధానమొక ప్రక్రియ. అదెట్లుండునో చెప్పగల వారిప్పుడున్నట్లు కానరాదు. సంగీతజ్ఞు లెవరైనను దీనినిగూర్చి పరిశోధించి వెల్లడించి నట్లయిన మహోపకారమొనర్చిన వారగుదురు హైదరాబాదునందలి గౌలిగూడ ఈ కవి జన్మస్థానము. జననము 1904 సం॥ ప్రాంతము. మన యదృష్టముకొలది వీరింకనూ జీవించియే యున్నారని భావించుట శ్రేయము.

వీరి ముద్రిత రచనలు-శతకంద రామాయణము, గీతా రహస్యము.

అముద్రితములు-విప్రనారాయణ నాటకము, మాయాకురంగము.

గోల్కొండ కవుల సంచికనుండి "సూర్యుడు" అన్న పద్యము ఉట్టంకింపబడు చున్నది.

సీ॥ ఇందింపెరములెల్ల నెవనిగాంచిన యంత
పరిపూర్ణ వికసన ప్రభల నొప్పుఁ
బక్షులెవ్వరి రాక వీక్షించినంతనే
కలరవంబులతోడఁగలయబారు
లోకంబులెవని నాలోకించిన సమస్త
కర్మలఁజేయఁగాఁ గడఁగుచుండు
రాత్రించరుఁడెవని రాకచేతఁగలంగి
దన పూర్వకాంతిని దప్పుచుండుఁ

గీ॥ బుట్టనెప్పుడు కర్మలు బుట్టుచుండు
వృద్ధినెవఁడొందఁగర్మలు వృద్ధిఁజెందు
నస్తమెవఁడొందఁగర్మలు నస్తమించు
నట్టి సూర్యుఁడు నుదయించె నంబరమున

## శ్రీ కిడాంబివాదికేసరి శృంగారం కృష్ణాచార్యులు

జన్మస్థానము హైదరాబాదు లోని సీతారాంబాగు. జననము క్రీ.శ. 1905 సం॥ ప్రాంతము. వీరిప్పటికినీ సజీవులే యని భావించుట భద్రము. నిర్ణయమునకై ఆచూకీ యిచ్చువారు కఱవైరి. సంస్కృతాంధ్ర కవియనియు, జ్యోతిశ్శాస్త్ర పండితులనియు గోలకొండ కవుల సంచికలో పేర్కొన బడినది. వీరి ముద్రితా ముద్రిత గ్రంధముల వివరములు అలభ్యములు. భావిపరిశోధకులదృష్టి కెక్కు తలంపుతో నేమూలనో దాగి యున్నవి కాబోలు. "వ్యాధోపాఖ్యానము" అన్న శీర్షికన గోలకొండ కవుల సంచికలో ప్రకటింపబడిన పదమూడు పద్యముల కథావస్తువిట ప్రస్తావింపబడుచున్నది. ఇందు మొదటిది సంస్కృత శ్లోకము. తక్కినవన్నియు తెలుగు పద్యములు. ఈ తెలుగు పద్యములలో నొకటి మూడు పంక్తుల గీత పద్యముతో నున్నది. మఱియొక గీతపద్యము అయిదు పంక్తులలో కూర్చబడినది.

అది మండు వేసవి. దుష్టులైన జనులు పరులను దూషించుచూ హరినామ స్మరణ మునుమాని లోకమును చీకాకొనర్చుచున్నారను క్రోధముతో వారిని మలమల మాడ్చి వేయుటకు కాబోలు భగ్గున మండుచున్నాడు, సూర్యుడన్నంత వేసవి. అట్టి వేసవిలోనొక వ్యాధుడుదయమ్మున వేలేచి ధనుర్బాణములను ధరించి, మృగములను వేటాడి మాంసమును

తెత్తునని భార్యతోచెప్పి యడవికిపోయెను. అడవిలో నిటునటు గ్రుమ్మరుచూ మృగములు కానరాక విసివివేసారి, దప్పికగొని, నీటికై వెదకి, ఎచ్చటను లభింపమికి వగచుచు నొక చెట్టుక్రింద కూలబడి కూర్చుండెను. ఇంతలోనొక్క వానర మచటికేతెంచి వ్యాధుని దీనస్థితికి జాలిపడి, వానిని తనవెంట తోడ్కొనిపోయి కొంతదూరముననున్న నొక చెఱువును చూపించెను. వాడానీటిని కమ్మగ గ్రోలి, బడలిక తీరిన పిమ్మట నిట్లాలోచించెను. "నీరు కమ్మగ నున్నది. ఇప్పుడింటికి పోవుదమన్న దారి చాలదూరము. ఈలోపల మఱల దాహమైనచో నీరు దొఱుకదు. కావున నీవానరముఁజంపి అచర్మపు సంచిలో నీళ్ళు నింపుకొని పోవుట మంచిది." ఈ దురాలోచన పుట్టినదేతడవు పాప పుణ్యముల నాలోచింపక వాడాకోతినిచంపి, ఆ తోలుతిత్తిలో నీళ్ళు నింపుకొని కొండంత సంబరముతో నింటికి పోయెను. ఇంతకన్న కృతఘ్నత యేమున్నది. దుష్టునకుపకారము చేయుట పాముకు పాలుపోసినట్లని కవి బోధించునీతి.

కథావస్తువునకుతగినట్లు రచన మంచికట్టుదిట్టముగనున్నది. ఈయరణ్య వర్ణనము నారయుడు ;

చం॥ కరమురయంబ దవ్వరిగి కాంచెను నిర్గత వాస్సరోఘరీ
సరిదభియుక్తమున్ మఱియు స్కన్నపలాశతరుప్రపూర్ణమున్
తరణికరాతపోగ్రతరతప్త ధరాధర భూప్రదేశమున్
గురుఖర కంటక ప్రకర కుంఠిత మార్గమరణ్య దుర్గమున్

వాడా వానరమును చంపి తోలు సంచిలో నీళ్ళు నింపుకొని యింటికి పోవునప్పటి పద్యమును పరికింపుడు :

ఉ॥ దానిని చంపి వాడపుడు ధాతువులన్ విడదీసి వేసియా
వానర చర్మ భస్త్రికను వారినినింపి ప్రసన్నభావుడై
కానన సీమదాటి తనకాపుర మొందగనేగె దుర్మదో
న్మానసులైన వారికిక్షమన్ హితకారియె దోషియయ్యెడున్

ఇందలి "ధాతువులన్ విడదీసి వేసి" "చర్మభస్త్రిక"వంటి ప్రయోగములు రచనలో కవి యొక్కచేయి తిరిగిన తనమును సూచించుచున్నవి.

ఈ వేసవి వర్ణనమును చిత్తగింపుడు.

చం॥ పరులను నిందఁజేయుచుఁగుభావులునై కడుదుష్టమార్గులై
హరినిఁ దలంపకుండి రకటా! జనులంచును గ్రోధమూని భా
స్కరుడన లాభమైన కరజాలముచేఁదగ వేపుచుండె నీ
కరణినటంచుఁ బోల్పఁదగు కాలము వేసవియొప్పె భూమిపై.

## పి. వి. వరదాచార్యులు

జన్మస్థానము హైదరాబాదునందలి సీతారాంబాగు. వైద్యులు జీవితకాలమును గూర్చిన వివరములు తెలియుటలేదు. ముద్రితా ముద్రిత గ్రంథముల వివరము కూడ లభ్యము కాలేదు. గోలకొండ కవుల సంచికలో "ఆయుర్వేదము" అను శీర్షికన అయిదు పద్యములు ముద్రింపబడినవి. ఇందు ప్రతిపాదింపబడిన శరీరతత్త్వము వైద్య విద్యా తత్త్వమును గూర్చి తెలిసికొనుట మిక్కిలి యావశ్యకము. ఆ పద్యము లివి.

ఉ॥ శ్రీకరు దౌపహాత్వరుని సేవలఁజేయుచు సాధువృత్తియై
ప్రాకట వైభవంబుల నపార సుఖంబులఁ జీవులందగా
నాకరముల్ శరీరములె యయ్యది సత్యము భూతలంబునన్
లోకులకెల్ల తెల్లమది లుప్తతనొంద జగం బెలుప్తమౌ

ఉ॥ కాన శరీరమాద్యనఁగాఁదగు ధర్మము నాదరించియే
మానవులీ ప్రశస్తమగు మార్గము దప్పక సంచరింతురో
యాన యశీలులైన ఘనులాయు రభీష్ట ఫలంబులంది స
న్మానితులై ప్రజాళి రుజమాంద్యములేక చరింతు రెయ్యెడన్

శా॥ ఆయుర్వృద్ధి వినాశధర్మముల కత్యంతంబు సుస్థానమై
యాయా రోగములందు పాకవిదశా వ్యాపార పారీణమై
యాయా వ్యాధిని దాన సాధనల సత్యస్ఫూర్తికాధారమై
యాయుర్వేదము సెల్లు నీయిలను సౌఖ్యానంద మందారమై

శా॥ మీయుల్లాసము దేహదార్ఢ్యము సదామీ యాత్మశక్త్యాదులున్
శ్రేయో వృద్ధులుగోరి యాశ్వినులు దారేయింబవల్ గావఁగా
నేయే రోగములున్ననేమి వినుడీరెక్కాల మీయుర్విలో
నాయుర్వేదము నాదరించి గనుడీ యారోగ్య మాయుష్యమున్

చ॥ వరమతులార మీకొక సువార్తను దెల్పెదఁజిత్తగింపుఁడీ
ధరనెటనెవ్వఁడుద్భవిలు తద్ధరబుట్టిన యౌషధంబుత
న్నరహిత-మాచరించును మనంబుల నన్నధరోత్థ మూలికా
పరముఁజేయ లోకుడి కృపామతి మీ జనయిత్రిఁజూడుడీ !

తెలుగు సాహిత్యములో నాయుర్వేదమును గూర్చిన యింతటి చక్కని ప్రతి
దన చాలనరుదుగా కాన్పించును ఇందలి భావప్రస్తారము మూడు మడతలుగానున్నది
ందటి రెండు పద్యములలో కాళిదాసు కుమార సంభవములో వక్కాణించిన "శరీర
ాద్యంఖలు ధర్మసాధనమ్" అను మహితోక్తి యొక్క పరమార్థము విస్తరింపబడినది.
ుపాయి రెండు పద్యములలో అయుర్వేదమునందలి భౌతికాధ్యాత్మిక తత్వజీవ లక్షణ
మన్వయము గర్భీకరింపబడినది. చివరి పద్యమున భారతీయులకొక మహోపదేశము
వింపబడినది. ఈభూమండలము నందలి ఒక్కొక్కదేశమున నాకొక్క వైద్యవిధాన
ుద్భవించినది. అది ఆయాదేశములందలి మహితత్వమునుబట్టి, ఆచటి శీతోష్ణ వాతా
రణ పరిస్థితులనుబట్టి, ఆటనుద్భవిల్లు ఓషధుల వైవిధ్యమునుబట్టి, రూపొందిన దై
ుండును. పాశ్చాత్యులకు అల్లోపతి. హోమియోపతి, అరబ్బులకు యునాని, భారతీయు
ుకు ఆయుర్వేదము ఇత్యాది. ఆయాదేశవాసులకు నాయాదేశముల వైద్యవిధానమే సరి
ుడును. భద్రమును కలిగించును. వారు అన్యదేశీయుల వైద్యమునకు పోరాదు. ఓభార
ుయులారా! మీతల్లి వైద్యమగు నాయుర్వేదము నాశ్రయించి భద్రమును బడయుడు.
అన్నది యిందలి ఉపదేశము.

## శ్రీమతి లక్ష్మిబాయి

జన్మస్థానము పన్నాజీపేట, స్థిరనివాసము హైదరాబాదునగరము. రెడ్డికుల
సంజాత. జననము శా.శ. 1837 (క్రీ.శ. 1915 ఆనంద సంవత్సరము) ఆలా
వేంకట నారాయణరెడ్డి దేశాయిగారి సుపుత్రిక. తమ తండ్రిగారి మరణమునకు
విలపించుచూ వ్రాసిన స్మృతి పద్యములివి. గోల్కొండకవుల సంచికనుండి ఉట్టం
కింపబడుచున్నవి :

ఉ॥ దారసుతాది వర్గములు తల్లడ మల్లడ మందుచుండగా
భూరి సుహృజ్జనాళి మదిభోరని దుఃఖమునొందుచుండగా
మీరిట నుక్కిమాని పరమేలుటకేగితిరయ్యనిత్యస
త్పూరిజనంబులోనధికశోభవహించితి రయ్య నాయనా !

చ॥ పరమ పవిత్ర సత్యపరిపాలనసక్త జనానురక్త సుం
దరతరగాత్ర వైష్ణవ మతాగమవేత్తవటంచుఁ గీర్తిని
ధ్ధరణిని బొంది రెడ్డికులధాములు భోరనికుందుచుండగా
బరమపదంబు గన్గొనెడి భాగ్యము గంటివికాదె నాయనా !

మ॥ శరణంబందు వచించు శత్రుసమితిన్ శీఘ్రంబుగా బ్రోచితౌ
పరనారీమణులెల్లఁ దల్లులనుచున్ భావించి రక్షించితౌ
గురుపాదంబులనాత్మలో దలచుచున్ గోరక్షగావించితౌ
ధర నీరూపము నేటితో ముగిసె నాదైవాజ్ఞయో నాయనా!

గీ॥ శ్రీకరంబగునిం బాద్రి శ్రీనృసింహు
పాదయుగళంబు నిశ్చలభక్తితోడఁ
దలచుచును విష్ణులోకంబుఁదరలినావె
అయ్యో! నాతండ్రి నారాయణావనీశ !

గీ॥ వసుధనాలాకులాంబుధి వరశశాంక
మేలుమేలని భక్తులు మెచ్చుచుండ
శ్రీశుపదములఁగంటివా శీఘ్రముగను
అయ్యో నాతండ్రి నారాయణావనీశ !

ఈ పద్యములలో స్త్రీ సహజమగు హృదయార్ద్రత ఉబికి నురియాడుచున్నదనుట విశేషముగాదు. కన్నతల్లిదండ్రులపై కొడుకులకుండు కూర్మికన్న కూతులకుండు కూర్మి మిన్నయని చెప్పుటయు వింతకానేరదు. అదిగో. అకుదిలిపోయిన గుండెల తలపోతయిట నిండారియున్నది. ఆధునిక కాలమున పద్యములు వ్రాయగలిగిన కవయిత్రులు అరుదుగా నున్నారని చెప్పవచ్చును. అందునను "ఎలిజీ" (స్మృతికవిత) వ్రాసినవారు మృగ్యము. పద్యముల కట్టుబడి మిక్కిలి కట్టుదిట్టముగ నున్నది. ఈమె వ్రాసిన యితర కృతులేవైన నున్నవేమో జాడలు తీయవలసియున్నది. ఈస్మృతి కవితకు ఆలంబనమగు ఆలా వేంకట నారాయణరెడ్డిగారు "గోరక్షకులు" అని వర్ణింపబడిరి. మన జాతీయమాన బిందువులలో గోమాత యొకటి. దీని సేవకు, రక్షణకు దీక్ష వహించి జననమును సఫలయొనర్చుకొన్న రెడ్డిగారు ప్రశంసనీయులు.

## చివుకుల అప్పయ్యశాస్త్రి

వీరు సికింద్రాబాదుతోని ఇమాం బావిడీవీధి వాస్తవ్యులు. ఒక దశాబ్దమునకు పూర్వమే కీర్తిశేషులు. దివ్యవాణీ పత్రికా స్థాపకులు, సంపాదకులునని వెనుక చెప్పబడినది. సంస్కృతాంధ్రములందు మంచి పండితులు. "వేంకటేశ్వర విజ్ఞప్తి"అను శ్రీ-గా కవితా సంకలనము క్రీ. శ 1936లో రెండవసారి ముద్రింపబడినది.

సంస్కృతమున గర్గమహాముని కృత పురాణమును 'గర్గ భాగవతము' అను పేరుతో ఆంధ్రమున ననువదించిరి. ఇది 1935 నాటికే అనువదింపబడినను ముద్రణ మాత్రము క్రీ.శ. 3-1-1954 నాడు జరిగి విడుదల చేయబడినది. సంస్కృతమున 12000వేల శ్లోకములు తెనుగున ఆరువేల పద్యగద్యములకు తేబడినవి. రాధాకృష్ణుల కంకిత మీయబడినది. వీరి రెండు గ్రంథముల నుండి చెరియొక పద్యము చొప్పున నుదాహరింపబడు చున్నవి :

ఉ. తేటులదాటు నెక్కురులు దేనియలొల్కెడిమోవి బంగరున్
మీటెడి వల్వలబ్జములమించు కనుంగవ నిండుచందురన్
మాటెడి నవ్వు నెమ్మొగము మల్లియ మొగ్గల గేరు దంతముల్
వాటపు చూపులుం గలిగి వాడలరుం గప ముద్దుగుమ్మరో!

గర్గ భాగవతము - బృందావన ఖండము-300

చం॥ వరధన రూపవంతుడయి పాండితిలేని కుపుత్రుకంటె బ
ల్వరమగు గర్భపాతమును, భామిని వంధ్యగ నుండుటయే కతున్
వరము జనించనప్పుడు శవంబుగఁబుట్టుచు నుండుటేల విన్
వరము సుపుత్రియే కలిగి వర్ధిలుచుండుట వేంకటేశ్వరా!

వేంకటేశ్వర విజ్ఞప్తి - నానావిషయములు - అను శీర్షికన.

ఈ కవికి "గోల్కొండ కవుల సంచిక"తో ప్రమేయములేదు. ఆనాటికి ప్రసిద్ధుడైన కవి యగుటవలన ఈయుగమున పేర్కొనుట జరిగినది.

శిరోమణి శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు "గొల్లడా!" అన్న శీర్షికన కొన్ని కమ్మని పద్యములు "గోల్కొండ కవుల సంచిక"లో వ్రాసినారు, ఈ యుగము మొదలుకొని దాదాపు రాబోవు అన్ని సాహిత్య యుగములతో వీరికి సంబంధమున్నది. అయినను వీరిని "ఆంధ్ర సారస్వత పరిషత్సాహిత్య యుగము"న చేర్చటమైనది.



## సాధన సమితి సాహిత్య యుగము

శా.శ. 1861-1865 = క్రీ.శ. 1839-1943

దీనికి గ్రంథమాలల సాహిత్యయుగమనియు నామాంతరముండుట సమంజసమని వెనుక సూచింపబడినది. ఈ సాహిత్యయుగమునందలి, ప్రక్రియాపరమైన వినూత్న ధోరణులను గూర్చియు, విశిష్ట లక్షణములను గూర్చియు పూర్వోక్త విషయములను స్ఫురణకు తెచ్చుకొనుచు కొందఱు కవుల సాహిత్య వ్యాసంగమును గూర్చి దిఙ్మాత్రముగ పరామర్శింతము. "సాధన సమితి" ప్రచురించిన ఇతర గ్రంథములతోపాటు "ప్రత్యూష'' పద్య సంకలనము ఈ యుగమునకు ప్రధాన ప్రాతిపదికగా పరిగ్రహింపబడినది.

## బూర్గుల రంగనాథరావు

వీరు బూర్గుల రామకృష్ణరావుగారి జ్యేష్ఠపుత్రులు. జననము శా.శ. 1839 (క్రీ.శ. 1917). ఆ బాల్యము సాహిత్య సమారాధన చేయుచు, చక్కని కథలను, గేయములను, పద్యములను వెలయించిన వ్యక్తి క్రీ.శ. 1940 నాటికి కొన్ని వందల పద్యములనువ్రాసిన ఘనులు. అవన్నియు అముద్రితములుగానే ఉండిపోవుట విచారకర విషయము. కొన్ని పద్యములు, గేయములు, కథలు, వచన కవితలు చెదురుమదురుగా ఆయా పత్రికలలోను, సంకలన గ్రంథములలోను ముద్రింపబడినవి. ముద్రితము—వాహ్యాళి (కథానికలు) అముద్రితము—వ్యాసములు, పద్యములు. 1941 లో 'గృహలక్ష్మి' పత్రికలో 'విశ్రాంతి' అన్న శీర్షికన వెలువడిన ఈ క్రింది పద్యములు వీరి రచనా శక్తికి తార్కాణములు :

శా॥ మున్నెవ్వండు రచింపనట్టి రసికామోదంబులౌ కావ్యముల్
మిన్నున్ ముట్టగజేయు నీ ప్రతిభ....ఏమేమో సగర్వంబుగా
ఎన్నో ఆశలు పల్లవించె నవి యెన్నో నిన్ నిరాశాశ్రితై
[illegible]

ఉ॥ ఏకరఘురీ ప్రవాహమున నెత్తిన హస్తము దింపనీక న
స్తోక మహత్వ కావ్యరస స్ఫూర్తి వహించెటి వృత్తిమాని నే
డీ కుటిలత్వ మూని పలిటీలను గొట్టుము నస్తమింపగా
నీ కవనమ్ము కీర్తిపయనించెను వెంటనె నాక పీఠికిన్

చ॥ మధురస భావ సూక్తి మటుమాయ మదయ్యెను కావ్యకన్యకే
బధిరత గూర్చినావు తుది వందనమా యిది తెల్గుసీమ నీ
విధి క్షుభితాత్మ జేసి మము వీడితి వింతలొ నాంధ్ర వాఙ్మయో
దధిని మథించకే పరమ ధామము జేరితివేమి కర్మమో ?

నిజాం కళాశాల తెలుగు పత్రిక "విద్యార్థి"లో (అక్టోబరు 1943) "సందేహం:" అను శీర్షికన ప్రచురింపబడిన ఈ క్రింది "అతి వాస్తవిక రచన" ఆనాడు వచ్చి పడు చున్న అభ్యుదయ కవిత్వముపై విసిరిన వ్యంగ్యమని సులభముగ గ్రహింపవచ్చును.

క్షుధాగ్ని జ్వాలా జ్వరాగ్ని కీలా
వ్యథా విలాపం వధా విహారం
కపాల భంగపు కథనా కాండరొ
వృథా విలాపం వ్యధా ర్తనాదం

కార్తిక పూర్ణిమ
కరగెను వెన్నెల
కాంతులు పేరెను
కవ్రల మనంబుల
ఆకటి కవులును
అన్నము మఱచిరి
కరువుకు, క్షోభకు
కల కవి వెరచెను

దధిక్షీరంబులు
ధవళాన్నంబులు
ధన ధాన్యాదులు
తనువుకు, చేలము

కురువగరాదా
కువలయ నాథా!
ఇంతటి వెన్నెల
ఎందుకు నేడ్వగ
అనియాపదకవు
లా పద మజుచిరి.

"పెదవి మెదల్చిన
ప్రియుల దలంచిన
కథలను వ్రాసిన
కబ్బము అల్లిన
ఎదలో నెఱుగని
ఎన్నో బాధల
ఏకరుపెట్టిన
లోకము తిట్టును"
అని మన కలకవి
ఆత్మలో గొణిగెను (మూల్గెను).

## అడ్లూరి అయోధ్య రామకవి

జననము 1922. "భాగ్యనగర్" మాసపత్రికకు సంపాదకులుగ నుండినట్లు వెనుక చెప్పబడినది. "తెలంగాణములో సమర సాహిత్యమును వెలయించిన కవి కుమారులలో ఈయనవలె...వీర విహారము చేసినవారు అరుదు "అని" ప్రత్యూష" పద్య సంకలనములో వీరిని గూర్చి ప్రశంసింపబడినది. ముద్రితగ్రంథములు— దీపావళి, ఘంటారావము, ఆంధ్రకేసరి, స్వాతంత్ర్యగీతాలు, తెలంగాణామంటల్లో..., తాటికొండ, అన్నపూర్ణేశ్వర శతకము, సీతారామ శతకము, సంస్కరణలు (బుఱ్ఱకథ), ప్రజావిప్లవం - విజయం (బుఱ్ఱకథ), రుద్రమదేవి (నాటిక). "అడుగు జాడలు" అన్న వీరి కవితలో కొన్ని కొత్త జాడలు గమనింపవచ్చును:

కాంచి కాంచిన కనులు
కనుమేర దాటంగ
కనుపాపలను తెప్ప
కబళించివేసింది.

కలలు గానివి గాథలూ
చెలియరో
కాలమ్ములోగల్సెనే.

లోకాల హింసల్లో
లొంగి లొంగిపోయి
ఆలోకనముకైన
ఆరాటపడతుదికి

అదియు కరువై పోయెనే
సఖియరో
ఆర్తినేరికి దెల్పనే ?

సిగలో పూవెడితేనె
సిరులొల్కు చూపుల్ల
నాకంటబడకున్న
నిలువవే కాలొకట

అడుగుజాడలె మిగిలెనే
నారాణి!
అడవి బ్రతుకై పోయెనే!

## వెల్దుర్తి మాణిక్యరావు

జననము 1918. "అణా గ్రంథమాలా" స్థాపకులలో నొకరు. ఆనాడు హైదరాబాదు నగరమున వీరికి సంబంధములేని సాహిత్య సంస్థలేదు. గ్రామీణుల భాషలో నాటికలు. కథలు, వ్యాసములువ్రాసి, సాహిత్యమును గ్రామీణులకు రుచిచూపించుటకు ప్రయత్నించిన ఉద్దండులు. మహారాష్ట్ర. కన్నడ, ఉర్దూ, ఇంగ్లీషు భాషలలో మంచి పరిచయముగలవారు. ముద్రిత రచనలు : 1. దయ్యాలపన్గడ (గ్రామ్యభాషలో నాటిక) 2. రైతు 3. దయానందుని జీవితము 4. రాజ్యాంగ సంస్కరణలు. 5. ఖాదీ, క్రి.శ. 1950నాటికి అముద్రితములు : 1. బాలగేయాలు 2. హసీనా(కావ్యఖండిక) 3. శవనాటికలు 4. కథానికలు.

మా ప్రణయం!, ముల్లు, వేయి స్తంభాలగుడి, వంటి శీర్షికలతో వీరి రసవత్తరము లైన గేయములు కొన్ని లభించుచున్నను, ఆ రోజులలో హైదరాబాదు నగరమున బాల సాహిత్య ప్రక్రియపై దృష్టిని సారించి రచనలు చేసిన వారిలో వీరు అగ్రగణ్యులుగా కాన్పించుటవలన ఒక నమూనాగా "పిల్లలమండీ పిల్లలము" అను గేయ ముదాహరింప బడుచున్నది :

పిల్లలమండీ-పిల్లలము !
తలంపునిచ్చిన తలోటి తెచ్చి
ఎక్కెదమూ! - పైకెక్కెదమూ !
ఆకాశంలో మకాము వేసీ
చందమామతో పందెము వేసీ
నవ్వెదమూ! నవ్వించెదమూ!
—పిల్లలమండీ, పిల్లలమూ!

తారకలతో తారంగం
మెరుగు బాలతో
పరుగుడు పందెం
గడగడ ఉరుముతొ
గుడుగుడు గుంచెం
తెప్పలమాటున దాగుడు మూత
ఆడెదమూ; ఓడించెదమూ !
—పిల్లలమండీ, పిల్లలమూ !

ఇంద్రధనువుతో పుంగిడిపూసీ
మంచుముత్తెముల సంచులు నింపుతు
వానచేరులను పట్టుకు కిందికి
పాకెదమూ! పాకించెదమూ!
-పిల్లలమండీ పిల్లలమూ!!

## మఱికొందరు రచయితలు

భాస్కరభట్ల కృష్ణారావు-సాధన సమితి కార్యకర్తలలో నొకరు, కథానికా రచయితలలో నగ్రగణ్యులు. 'శోభ' పత్రికలో వీరి రచనలు వెలువడుతుండెడివి. ఆంధ్ర సారస్వత పరిషత్తు స్థాపనకు పూర్వరంగము సిద్ధముచేసిన వారిలో నొకరు. తొలినాళ్ళలో ఏర్పడిన పరిషత్తు కార్యనిర్వాహకవర్గములో సభ్యులుగా కూడ నుండిరి. ఇప్పుడు కీర్తిశేషులు.

భాగి నారాయణమూర్తి- జననము 1912. రచనలు-ముద్రితములు- 1. పరీక్ష చదువు (నాటికలు). అముద్రితములు—1 జయగంట, 2. రుధిర రేఖలు 3. పద్మం కథలు. 4. ఖండకావ్యాలు.

జమ్మలమడక సూర్యప్రకాశరావు, జననము 1919, వీరు సాధన సమితి స్థాపకులలో నొకరు, రచనలు-ముద్రితములు- సాంధ్యగీతి (నాటిక), అముద్రితము-తపోవనము (నాటిక), ఖండకావ్యములు.

సన్నిధానం శ్రీధరశర్మ. జననము 1920. రచనలు-ముద్రితములు- 1. అభిషేకము. అముద్రితములు - 1. జాజిమొగ్గలు 2. ప్రాణభిక్ష (ఖండకావ్యములు) 3. చిత్రాంగద 4. మేలుకొలుపు (నాటకములు) 5. అభిసారిక 6. శృంగభంగము (ఏకాంకికలు) 7. సత్యాగ్రహి 8. అక్కచెల్లెళ్ళు (నవలలు) 9. చతుష్టయి (రవీంద్రుని కథలకు అనువాదములు.)

నెల్లూరి కేశవస్వామి-వీరి ప్రేమ్ చందు అనువాదములు (కథలు) ప్రసిద్ధమైనవి. కథా రచయితగా మంచి పేరు తెచ్చుకొన్న వ్యక్తి.

వెల్దండ ప్రభాకరరావు మంచి వ్యాసరచయిత. వీరి "ఆముక్తమాల్యద పర్యాలోకనము" (వ్యాసములు) ఉత్తమశ్రేణికి చెందిన విమర్శనా గ్రంథము.

## పన్యాల తిరుమలరావు

జననము: ఆగస్టు 1917. పింగళ శ్రావణ బహుళ అష్టమి. గ్రంథములు-ముద్రితములు—వేద వాఙ్మయము. అముద్రితములు—చైత్య విలాపకావ్యము. వీరు

మంచి పద్య కవులు కూడ. "భగవన్నుతి" శీర్షికన వ్రాసిన ఈ పద్యములు వీరి ధారా శుద్ధికి నిదర్శనములు :

మ॥ ఉదయంబందున లేచి నీ పదయుగం బుల్లంబు నన్నిల్పియో
సదయా లేవుమటంచు బల్కెడి సుఘోషల్నీదు భక్తాళిచే
నెదరంజింపగ నాలకించి నినుగీర్తింపన్ రమానాథశ్రీ
పదపద్మంబుల భక్తి నాకొసగుదేవా! వేంకటాద్రిప్రభో!

మ॥ అమితత్వంబుననో సకాలమున నిద్రాహారముల్ లేకనో
విమలంబౌ భవదీయ నామమును వేడ్కన్ ధ్యానముం జేయకే
విముఖుండౌటనొగాక యేవిధమొ, నేనీరీతి కష్టించుటో
యమలా! ఔషధరూపి! బ్రోవగదె దేవా! వేంకటాద్రిప్రభో!

<u>చైత్య విలాపము :—</u>

థామస్‌గ్రే అనునాంగ్ల కవి రచించిన "ఎలిజీ" అను 32 పద్యములను సంస్కృతములో కీ.శే. హర్కారే గుండేరావుగారు అనువాదము చేసిరి. ఉర్దూలో, ఆలీహైదర్ తబతబాయి అను కవి అనువదించిరి. ఈ మూటిని చదువుటచే తెలుగులో కూడా వ్రాయవలెనని వ్రాసిన చిన్ని కావ్యమిది. గుండేరావుగారుంచిన పేరే దీనికి పెట్టబడినది.

ఈ పద్యములు కీ.శే. గుండేరావుగారు శిఖరిణీ వృత్తములో వ్రాసిరి. వీరు షట్పది నెన్నుకొనిరి. కేవలము ప్రతిపాదమునను ప్రాసమాత్రము పాటింపబడినది. ఒకటి రెండు పద్యములిచట మచ్చునకీయ బడుచున్నవి:

వారి గ్రుంకెడు తపన విరహపు
బారికోర్వక నైశఘంటము
జేరుచున్న జనుల తరుగని యార్తనాదముతో,
కారు చీకటు లలమ నింగిని
తారకలు మిరుమిట్లు గొలుపగ
ఊరి వెలుపలి శమను వీటికి జేరుకొంటి నహో!

విమల కాంతులనీను రత్నము
లమితముగ లవణోదధింబడి
కుమిలి కుందుచునున్నవేమో తీయువారెవరు ?
కమలముల శ్రీమించు పుష్పము
లమితముగ ఘోరాటవింబడి
క్రమముదప్పక సౌరభంబుల నీనుచుండుగదా !

కలము పట్టని కాళిదాసులు
చలము చూపని రుద్రమాంబలు
పలుకు పలుకున పణముతొసగని పార్థివేంద్రులును,
ఉలుల సోకున శిలలు పాడగ
చెలుల లాస్యము జూపు శిల్పులు
ఇలను కౌగిట గుచ్చియిచ్చుట శాంతి బొందిరిగా !

"Some village HAMPDEN that with dauntless breast
The little tyrant of his fields withstood,
Some mute inglorious MILTON here may rest,
Some cromwell, guiltless of his country's blood."

మూలమందలి Milton అనువాదమున కాళిదాసుకాగా, Hampden అను పేరుగల యోధుడు రుద్రమాంబ అయినాడు. ఇది భారతీయకరణమన్నమాట. ఇదొక విధమైన అనువాద పద్ధతి.

శ్రీ తిరుమలరావుగారు అటు సాధన సమితికిగాని, ఇటు గ్రంథమాలలకుగాని చెందిన వ్యక్తికాదు ఈ యుగమున వర్ధిల్లికవి. అందువలన ఇందులో చేర్చబడినారు.



# ఆంధ్ర సారస్వత పరిషత్సాహిత్యయుగము

శా.శ. 1865-1872 = క్రీ.శ. 1943-1950

సారస్వత పరిషత్తు యొక్క చరిత్ర వెనుక వివరింపబడినది. సాహిత్యనిర్మాణ దృష్టితో ఈయుగమును గూర్చి చెప్పవలసిన దెంతో ఉన్నది. పరిషత్కార్యక్రమముల వలన పొందిన స్ఫూర్తితో ఎందరెందరో సాహిత్య వ్యవసాయము కావించిరి. పరిషత్తే ప్రోత్సహించి యెందరెందరిచేతనో సాహిత్యమును సృష్టింపజేసినది. ఎవరు వ్రాసినను వ్రాయకున్నను దాని చరిత్ర జగద్విదితము. ఆదంతయు వివరముగ చెప్పుటకిక్కడ తావుచాలదు. కావున మన రచనా ప్రణాళిక ననుసరించి ఒక ''నమూనా''ను సమర్పించు దృష్టితో కొందఱు మహనీయులను గూర్చి మాత్రమే దిఙ్మాత్రముగ నిట ప్రస్తావింపబడుచున్నది.

## దేవులపల్లి రామానుజరావు

జననము : 25వ ఆగస్టు 1917. జన్మస్థానము: వరంగల్లు, నిత్యనివాసము: హైదరాబాదు. 1950కి పూర్వము ముద్రిత రచనలు: నవ్యకవితా నీరాజనము (సాహిత్య సమీక్ష). అముద్రితములు : 1. ఏకవీర, 2. పచ్చతోరణము (ఖండ కావ్యములు). పచ్చతోరణము 1953 లో ముద్రింపబడినది. రాయప్రోలు సుబ్బారావు, వేలూరిశివరామశాస్త్రి, మల్లంపల్లిసోమశేఖరశర్మ వంటి దిగ్గంతుల ప్రశంసలనందుకొన్నది. పిమ్మట కాలమున వీరెన్నో గ్రంథములను వ్రాసి ప్రకటించిరి. వీరిని గూర్చిన యితర విషయములు ఈ గ్రంథమున పలుతావులందు ప్రస్తావింపబడినవి. పచ్చతోరణములోని చివరి కవితా ఖండిక- "తొలకరి" అన్న శీర్షికన వ్రాయబడిన ఒకే ఒక పద్యము ఉదాహరింపబడుచున్నది. దీనినిబట్టి తక్కిన కవితల యందలి రసరామణీయకతను సహృదయు లూహింతురుగాక !

సీ॥ హృదయముప్పొంగగా నుఱిమినచో నీకు
పూజ యొనర్తుము పొన్నపూల
మెఱుమిట్లు గొలుపగా మెఱసిన నియ్యదే
అరటాకు దొన్నెలో యలరుఁదేనె
చెఱువులు నిండించి స్వీకరింపుము కాన్క
దోరబండిన మేలి దోసపండ్లు
పైరులు చక్కగా పండిన నిత్తుము
పండుటాకులలోన పచ్చివెన్న
ధాన్యలక్ష్మి ప్రసన్నయై తనరుకొఱకు
వరము వేఁడుదు జోడించి కరయుగంబు
వరుణ మావంక జూడుము కరుణతోడ
శబలితంబైన యీరమ్య సమయమందు.

## నూకల నరోత్తమరెడ్డి

జనన మరణాదిక వివరము లలభ్యములు. పత్రికా సంపాదకులుగా, సాహితీపరులుగా, విద్యావేత్తగా, రాజకీయజ్ఞుడుగా పలువురి మన్ననలనందుకొన్న ప్రతిభాశాలి. సారస్వత పరిషత్తుతో వీరికిగల అనుబంధము ఆత్మీయమైనది. 1947 నుండి చిరకాలము గోల్కొండ పత్రికకు సంపాదకత్వము వహించిరి. సురవరం ప్రతాపరెడ్డిగారు పెట్టిన వఱవడిలో వీరి సంపాదకీయములు కొన్నియెడల ఉదాత్తమైన సాహిత్య విలువలను సంతరించుకొన్నవని చెప్పినచో నతిశయోక్తికాదు. వీరు మరణించుటకు కొంత కాలము పూర్వము తెలుగులో వచనములో ఒక రామాయణమును వ్రాయుటకు తలపెట్టి రచనా ప్రణాళికను సిద్ధముచేసికొని కొంత వ్రాసిరనియు, ఇంతలో స్వర్గస్థులైరనియు తెలియుచున్నది. ఇది చాల దురదృష్టకరమైన విషయము. తెలిసినవారెవరైనను వారి సాహిత్యవ్యాసంగమునకు సంబంధించిన విషయములను వెలార్చినచో వారికిని, తెలుగు సాహిత్యమునకును మహోపకారమొనర్చిన వారగుదురని మనవిచేయటమైనది.

## సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి

జననము : 10-2-1897. అభిజనము: కృష్ణాజిల్లా చిరివాడ. క్రీ.శ. 1920 నుండి సికిందరాబాదులో స్థిరనివాసము. సంస్కృతాంధ్రభాషలలో ఉద్దండ పండితులు. అటు సంస్కృతములోను, ఇటు తెలుగులోను అనేక గ్రంథములను వెలయించిరి.

వేదాల తిరువేంగళాచార్యులవంటి భాషాపరశేషభోగికి గురువులు వీరు. సారస్వత పరిషత్తు ఏర్పడిన వెంటనే 1-6-1943 వ తేదీన ప్రథమమహాసభ జరిగినది. అప్పుడేర్పడిన తొలి కార్యనిర్వాహక వర్గములో సభ్యులు వీరు. అది మొదలుకొని పరిషత్తుతో వీరికి గల సంబంధము మిక్కిలి సన్నిహితమైనది.

1950 కి పూర్వము వీరి ముద్రిత గ్రంథములు :- 1. తత్సమచంద్రిక, 2, కావ్యాలంకార సంగ్రహము. 3. జాతక కథాగుచ్ఛము. 4. కీరసందేశము, 5. ద్వంద్వయుద్ధము (గోవర్ధనాచార్య సప్తశతీసారము,) 6. పువ్వులతోట (ఖండకావ్య సంపుటి). 7. కావ్యమంజరి, 8. నడమంత్రపుసిరి (అధిక్షేపకావ్యము), 9. ఖడ్గ ఓక్కైన, 10. అమృతకణములు, 11. వాసవదత్త, 12. రేణుకావిజయము, 13. వివేకానందము, మొ॥. వివేకానందమునుండి మచ్చునకొక్క పద్యము :

ఆడుగంటెన్ మన భారతీయమగు విద్యల్ పుచ్చిపోయెన్ గడున్
గడు ధర్మంబులు వేషభాషణములుం బాశ్చాత్యలోకంపు బో
కడలన్ మైలపడెన్ సమస్త జనలక్ష్యంబర్థ కామంబులై
పెడదారింబడెఁ బూతిగంధియగు నీ విశ్వంబిసీకన్పడున్!

## కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

జననము క్రీ.శ. 1917. మరణము 1981. సంస్కృతాంధ్ర భాషలలో మహాపండితులు. పిన్నవయసులోనే కీ. శే. మాదిరాజు విశ్వనాథరావుగారితో జతగా కావ్య రచన సాగించిరి. సారస్వత పరిషత్తుతో సన్నిహిత సంబంధముగలవారు. 1949లో ఏర్పడిన కార్యనిర్వాహక సభ్యులలో నొకరై తెలంగాణములోని సాహిత్యోద్యమములకు యథాశక్తి చేయూతనిచ్చిరి. రచనలు - ముద్రితములు— 1. కర్ణసుందరి (బిల్హణుని నాటికకు ఆంధ్రానువాదము). అముద్రితములు :- 1. బిల్హణవిక్రమాంక దేవచరితాంధ్రానువాదము, 2. వనపర్తి సంస్థానచరిత్రము. విడిగా ఎన్నో సంస్కృతాంధ్రకవితాఖండికలను వ్రాసిరి. "ప్రత్యూష" (పద్యసంకలనము)లో "అంజలి" అన్న శీర్షికన పదిపద్యముల మంచి కవితాఖండికయొకటి లభించుచున్నది. అందుండి ఒక్కపద్యముదాహరింపబడుచున్నది :

సీ॥ శాలివాహన రాజచంద్రుల యేల్బడి
నిగ్గుదేరినపంటనేల యిద్ది;
చాళుక్యభూమీంద్ర సమదసామజదాన
ధారలఁదడిసిన ధరణి యిద్ది
కాకతీయనృపాల ఖడ్గధారల శత్రు
పంకముల్ విరిసిన వసుధయిద్ది;
విద్యానగర రాజవీరుల శౌర్యోష్మ
రిపువనుల్ వొలిసిన పృథివియిద్ది;

గీ॥ సంస్కృతాంధ్ర కవీంద్రుల సరస కావ్య
వాహినుల చేవ గొన్నట్టి వసుధయిద్ది;
సకల కకుబంతరాళ విశ్రాంతమైన
మన తెలంగాణ మహిమ సామాన్యమౌనె?

## కేశవపంతుల నరసింహశాస్త్రి

జననము క్రీ.శ. 1919 సంస్కృతాంధ్ర భాషలలో సవ్యసాచి యనదగిన మహాపండితులు. సాహిత్యరససిద్ధులు. మంచివక్త. భావపూర్ణమైన, మంచి ధారాశుద్ధి కలిగిన, కవిత్వమును సరళముగా వెలయించుటలో సిద్ధహస్తులు. రచనలు-ముద్రితములు :- 1. త్యాగధనులు, 2. రత్నలక్ష్మీశతకము. అముద్రితములు :- 1. మధుర నిశీథము, 2. ఉదయసుందరి. 3. సందేశము, 4. మంగళసూత్రము. 5. సూర్య నారాయణ శతకము, 6. వివిధనాటికలు.

"హితోక్తి" అన్న శీర్షికన వీరు వ్రాసిన అయిదారు పద్యముల కవితాఖండిక యిట నుదాహరింపబడుచున్నది. ఇవి ఒక్కసారిగా వ్రాసినవికావు. ఇందలి రెండవ పద్యము 1948 ప్రారంభములో నల్లగొండలో ఒకనాటి రాత్రి రజాకార్లు హిందూ స్త్రీ లను చెఱచిచంపిన వార్త చదివివ్రాసినది. మూడవపద్యము-ఆపిమ్మట సాయుధ పోరాటమను పేరుతో కమ్యూనిష్టులు తెలంగాణమున సాగించిన దమనకాండను వర్ణించు పద్యము. ఈ సందర్భములోనే 1946లోను ఆ పిమ్మటను జరిగిన నవఖాళీ, పంజాబు, కాశ్మీరు దురంతములు స్మరణకు రాగా వ్రాసినట్టివి. ఈ పద్యములందలి భావజ్వాల, కవితాశిల్పము అనన్యసామాన్యములైనవి. ఇప్పుడాపద్యములు చదువుకొందము:

పుష్పాలపైని నిప్పులను బోయుటకేనియు, మల్లెతీవకున్
గ్రొవ్విన కాలుదన్ని జతగూర్చుటకేనియు, గున్నమావులన్
మవ్వము దూలిపో సెగల మార్చుటకేనియు, సాహసించి యీ
పుష్పాలతోటనే నలుకజూసిరి కొందరు మూఢమానవుల్

ఒకసీతమ్మను దాకు పాపము జటాయుక్రోధమై, వానర
ప్రకరంబై, హనుమన్నిదాఘ దహనజ్వాలా శియై, రాము సా
యకమై కూర్చె సమూల ఘాతముగ దేవారాతిఁబౌలస్త్యు నే
డొక టీరెండునుగావు స్త్రీలకగునా యుర్మాన భంగక్రియల్

పాలబుగ్గల శిశువ్రాతంబు మంటల
బడి 'మంయి' మనికాలు నెడరుపాటు,
కాళ్ళపారాణి బుగ్గల కాటుకయు మాయ
నవదంపతులు కత్తి నఱుకబడుట,
పూచిన తీవియబోలు ముత్తయిదువన్
సిగబట్టి యీడ్చుదుండగుల దాడి,
కాటికి కాల్చాచి కదలని ముదివగ్గు
మంటమూటగవైవ మడిసిచనుట,

యనెడిఘోరాతిఘోర కృత్యంబులెల్ల
ప్రజల స్వాతంత్ర్య లాభసంపద నెపాన
న్యాయమొల్లని మతోన్మాదచిత్తు
లేకధాటిగ సలిపినవే గదయ్య.

నవఖాశీరుధిరస్రవంతులకుఁ జింతన్ గ్రమ్మగ్గి, పంజాబు ఘో
రవిపత్తున్ భరియింపలేక, వివిధప్రాంతోగ్ర సంఘర్షణల్
చెవులన్ జీములుగట్ట. దుండగుల కాశ్మీరోగ్ర ధాటిన్ పరా
భవశంకన్ బడు భారతావనిఁ దలంపన్ గుండెనీరయ్యెడిన్.

ఎన్నో ఘోరములెన్నొ కష్టములతో నీనాడు స్వాతంత్ర్యసం
పన్నంబైనది భారతంబు: మలలన్ ప్రత్యగ్ర సిద్ధాంతముల్
సన్నాహంబులు, భావభేదములు, స్వేచ్ఛావృత్తు లుద్రేకముల్
పన్నాగంబులు రేపి శాంతిసుఖముల్ భంజింపకోయీ సఖా !

## గడియారం రామకృష్ణశర్మ

జననము 1919. అటు రాజకీయ సామాజిక రంగములందును, ఇటు సాహిత్య రంగమునందును సమానమైన అభినివేశముగలవారు. ఉదయము హైదరాబాదులోను సాయంత్రము అలంపురములోను ప్రత్యక్షమగుచుందురు. సంస్కృతాంధ్రములందు మంచి పండితులు. తెలంగాణ చారిత్రక పరిశోధకులలో పేర్కొనదగినవారు. సారస్వతపరిషత్తుతో ఆత్మీయమైన అనుబంధముగల వ్యక్తి. క్రీ.శ. 1950లో పరిషత్తు కార్యనిర్వాహక సభ్యులుగా నియుక్తులైరి. రచనలు : ముద్రితములు : 1. ఆలంపూరు శిథిలములు. అముద్రితములు : 1. చంద్రహాస (పద్యకావ్యము), 2. ఆలంపూరు శిథిలాలేఖనములు, 3. తైలంగసంస్కృతి, 4. చాటుపద్యములు, 5. ఆంధ్రకువలయానందము. విడిగా వ్రాసిన రసపత్తరములైన పద్యఖండికలెన్నో లభించుచున్నను చారిత్రకదృష్టితో వారి గేయమొకటి-కొన్ని పంక్తులు ప్రస్తుతింపబడుచున్నవి. ఇది క్రీ.శ. 1949 సం. హైదరాబాదుకు అంద పుచ్చుకొన్నంత దూరములోనున్న, తూపురాన్‌లో జరిగిన ఆంధ్ర సారస్వతపరిషత్తు అయిదవ వార్షికోత్సవసభలో వారే స్వయముగ ఎలుగెత్తి పాడిన గేయఖండిక :

"ఉన్నావొలేవయ్యొ ఓజగన్నాథ !
విన్నాప మాగోడు వీనులారంగ
........................
........................
తలదాచుకొనలేక తనువుపైలేక
తొలిపూటకేలేక తోడేమిలేక
ధృతిదూలిగతిమాలి దిక్కేదియున్న
వెతలతో పొరిపొరి విలపించుచున్న
తెలంగాణ ప్రజలకు దిక్కెవ్వడయ్య !
..............................

గారాబు ఒక బిడ్డగణిక యైనట్లు
మారాజకీయాలు మలినంబులయ్యో
మమ్మేలవలసిన మాప్రజాపతులు
దొమ్మిలో దిగినారు దుర్విధివలన !

## బిదురు వేంకటశేషయ్య !

సారస్వతపరిషత్తు స్థాపింపబడిన వెంటనే 1-6-1943 వ తేదీన ప్రథమమహా సభ జరిగినది. అప్పుడేర్పడిన తొలి కార్యవర్గమున వీరు ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకొనబడిరి. అది మొదలు 1962లో స్వర్గస్థులయినదాక పరిషత్తుకు మూలస్తంభముగ నిలిచిన వ్యక్తి వీరు. సికిందరాబాదు మహబూబ్ కళాశాల (హైస్కూలు) లో కొంత కాలము ఆంధ్రాధ్యాపకులుగా పనిచేసిరి. వీరి రచనలను గూర్చిన వివరములు అలభ్యములు. "స్రవంతి" మొదలైనసాహిత్య పత్రికలలో నన్నయగారి కావ్యరామణీయకతను గూర్చియు, ప్రసన్నకథాకలితార్థయుక్తిని గూర్చియు కొన్ని వ్యాసములు ప్రకటితములయినట్లు తెలియుచున్నది. తెలిసినవారెవరైనను వారి రచనా వ్యాసంగముగూర్చిన వివరములు వెల్లడించి, సాహిత్యమునకు ఉపకారమొనర్తురుగాక యని మనవిచేయట మయినది.

## రచయిత్రులు

ఈయుగమునకు చెందిన రచయిత్రులలో ప్రధానముగ పేర్కొనవలసినవారు శ్రీమతులు యల్లాప్రగడ సీతాకుమారి, ఇల్లిందల సరస్వతీదేవిగార్లు. సీతాకుమారిగారు 1947—48 సంవత్సరములోనే పరిషత్కార్యవర్గసభ్యురాలుగా ఎన్నుకోబడిరి. సరస్వతీదేవిగారుకూడ ఇంచుమించు 1950నాటికి కార్యవర్గములో సభ్యురాలైరి.వీరిర్వురూ ఆనాటికే పేరెన్నికగన్న రచయిత్రులు. ఆపిమ్మటకూడ వీరు సాగించిన సాహిత్య రచనావ్యాసంగము మిక్కిలి ప్రశంసనీయమైనది.



# వైతాళిక సాహిత్య యుగము

శా.శ. 1823-1872 క్రీ.శ. 1901-1950

## మాడపాటి హనుమంతరావు

జననము - శా.శ. 1807 (క్రీ.శ. 1885, జనవరి, 22), మరణము - శా.శ. 1892 (క్రీ.శ. 1970, నవంబరు, 11). జన్మస్థానము- కృష్ణాజిల్లా నందిగామ తాలూకా పొక్కునూరు గ్రామము. తల్లి వెంకటసుబ్బమ్మగారు. తండ్రి వెంకటప్పయ్యగారు. అన్న తిరుమలరావుగారు. హనుమంతరావుగారి అయిదవయేటనే తండ్రి మరణించి నందున వెంకటసుబ్బమ్మగారు తన యిర్వురు పుత్రులను తీసికొని సోదరుడగు జమలాపురం కేశవరావుగారి యింటిని ఆశ్రయించవలసి వచ్చినది. అప్పుడాయన సూర్యాపేటలో పేష్కారుగా పనిచేయుచుండెను. ఇట్లు ఐదు సంవత్సరముల బాలుడుగా తెలంగాణ తల్లి ఒడిలో చేరిన హనుమంతరావుగారు పిమ్మట తన ఎనభై సంవత్సరముల జీవితమును ఆమె సేవలో సమర్పించిన ధన్యజీవి. క్రీ.శ. 1910లో ఉద్యోగరీత్యా భాగ్యనగరమునకు చేరుకొని ఆంధ్రోద్యమమునకు మూలపురుషుడై ప్రథమ తెలంగాణ వైతాళికుడుగ కీర్తింపబడుచున్న మహనీయుడు. ఆంధ్ర, ఆంగ్ల, ఉరుదూ, పారశీక భాషలలో మంచి పాండిత్యముగలవారు. మహారాష్ట్ర, హిందీ భాషలలోకూడ చక్కని పరిచయముగలవారు.

ముద్రిత గ్రంథములు— 1. మల్లికాగుచ్ఛము (ఏడు కథల సంపుటి) 1911లో సరస్వతీ నికేతనము, మచిలీపట్టణమువారి ప్రచురణము. 2. క్షాత్రకాలపు హిందూవర్ణ్యాలు 1927 ప్రచురణ 3. విధి ప్రేరణము, ఎవరికి! అణాగ్రంథమాల, హైదరాబాదువారి ప్రచురణ.

ముద్రితా ముద్రిత గ్రంథములు— 1. ఆనంద మఠము (తెలుగు అనువాదము) 2. గ్యారీ బాల్డీ జీవితము – అముద్రితము, రచన 1911. 3. రోమక సామ్రాజ్య చరిత్రము — అసంపూర్ణము - అముద్రితము. 4. మహాభారత సమీక్షణము - చింతామణి వైద్యగారి ఆంగ్ల గ్రంథమునకు ఆంధ్రానువాదము. రచన 1916. 5 హృదయ శల్యము, ముద్రితము. ఆంధ్రోద్యమ చరిత్ర - రెండు భాగములు.

క్రీ.శ. 1910 నుండి వీరికథలన్నియు కృష్ణాపత్రికలో "ఆంధ్రములో కథలు" అన్న శీర్షికన కొన్ని విడివిడి గను, కొన్ని ధారావాహికముగను ప్రచురింపబడినవి. వీనిలో కొన్ని హిందీ కథలకు అనువాదములు, మఱికొన్ని స్వతంత్రములు. ఇవిగాక మఱి కొన్ని కథలు భారతి, శారద, సుజాత మొ॥ మాసపత్రికలలో ప్రచురింపబడినవి.

వీరి "ఫిరదౌసి" పద్యానువాదము ప్రత్యేకముగ పేర్కొనదగిన గ్రంథము. అందలి యొక పద్యము :

"హీనుల మహోన్నతపదవి కెత్తుటయును
ఎత్తివారి యుపకృతి నాశించుటయును
స్వీయమానధనముల బుగ్గిసేయు టగును
సర్పమును తన జేబులో సాకుటగును"

వీరి స్వకపోల కల్పితమగు మరియొక పద్యము:

"ఫలములచేతఁ గొన్నిటిని బల్లవసంతతిచేతఁ గొన్నిటన్
సలలితసౌఖ్యదాయియగు చాయనుఁగొన్నిటి వేవిధాలనీ
యిలను ననేకప్రాణుల కహీనసుఖంబిడు వృక్షరాజమున్
జలువిడి పీకివైచి తెతుపాన! వినాశము చేసివైచితే!"[1]

## సురవరం ప్రతాపరెడ్డి

జన్మస్థానము మహబూబ్‌నగర్ జిల్లా (పాలమూరుజిల్లా) అలంపూరు తాలూకా, ఇటికాలపాడుగ్రామము. జననము : మన్మథినామసంవత్సర అధికజ్యేష్ఠమాస బహుళ పాడ్యమి 1896 మేనెల 28 వతేదీనాడు. మరణము : స్వగ్రామమున 25-8-1953 నాడు. తల్లి రంగమ్మగారు. తండ్రి నారాయణరెడ్డిగారు. తెలంగాణ వైతాళికులలో మాడపాటి హనుమంతరావుగారి తరువాత పేర్కొనవలసిన మహనీయుడు. వీరినిగూర్చి వెనుకటి ప్రకరణములలో పలుమారులు పేర్కొనబడినది. ఇట వారి సాహిత్య వ్యవ

1. ఈ రెండు పద్యములు "మాడపాటి హనుమంతరావు జీవిత" చరిత్ర రచయిత ఆదిరాజు వీరభద్రరావు, ప్రచురణ – ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు ఎనుబది యొకటవ జన్మదినోత్సవ సంఘము, హైదరాబాదు, మార్చి 1965." అను గ్రంథము లోని పుట. 68 నుండి గ్రహింపబడినవి.

సాయమును గూర్చి మాత్రమే ప్రస్తావింపబడును. ఆధునిక యుగమున ఈ శతాబ్దపు పూర్వార్ధమున తెలంగాణ సాహిత్యరంగమునకు సంబంధించి కొందరిపేర్లు చెప్పవలసి వచ్చినప్పుడు పేర్కొనవలసిన వ్యక్తి శ్రీ ప్రతాపరెడ్డిగారు. వారు బహుముఖ ప్రజ్ఞా శాలి. వారిరచనల వివరము లివి:-

ముద్రితములు :- 1. ఉచ్ఛల విషాదము-నాటకము, 2. భక్తతుకారామ్-నాటకము, 3. గ్రామజనదర్పణము. 4. ఎల్లోరాశిల్పము, 5. కర్నూలురాజుల వంశావళి, 6. హూనాప్యవసాయము, 7. నిజామురాష్ట్రపాలన, 8. గ్రంథాలయోద్యమము, 9 హిందువుల పండుగలు, 10. హైందవ ధర్మవీరులు, 11. సంఘోద్ధరణము, 12. మొగలాయీకథలు. 13. రాజాబహద్దరు వేంకటరామారెడ్డి జీవితచరిత్ర, 14. ప్రాథమికస్వత్వములు లేక ప్రజాధికారములు 15. ప్రతాపరెడ్డి కథలు, 16, యువజన విజ్ఞానము. 17. జాగీరులు, 18. రామాయణ విశేషములు, 19. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, 20. హిందుస్థాన్ చరిత్రలు, 21. లిపిసంస్కరణము. ఇవికాక ఇట్టివే మరికొన్ని అముద్రిత సమగ్రరచనలు, అముద్రిత అసమగ్ర రచనలు ఉన్నట్లు తెలియుచున్నది. వీనిలో 'ఆరెవీరులు' కాపుకుల నిర్ణయము, ఒక సాంఘిక నాటకము కలవు. వారి నష్టపోయిన గ్రంథములు "శుద్ధాంతకాంత" అను ఆంగ్లమునుండి అనువదింపబడిన నవల, "చంపకభ్రమర విషాదము" అను చిన్న స్వతంత్ర పద్యకావ్యము, హరిశర్మోపాఖ్యానము అనుమరొకపద్యకావ్యము కలవని తెలియుచున్నది. వీరిగ్రంథములలో వీరి కీర్తి పతాక లనవలసినవి : హిందువుల పండుగలు, రామాయణ విశేషములు, ఆంధ్రుల సాంఘిక చరిత్ర-ఈ చివరిగ్రంథమునకు వీరు మరణించిన పిమ్మట కేంద్ర సాహిత్య అకాడమీవారు ఉత్తమ గ్రంథమున కిచ్చు బహుమతిగా 5000/-రూపాయలు లభించినవి. ఈబహుమతి నందుకొన్న తొలితెలుగు గ్రంథమిదియగుటవిశేషము.

ముద్రిత పద్యలఘుకృతులు— హంవీర సంభవము, మహమ్మదు గజనీ, ప్రేమార్పణము, మద్యపానము, ధర్మాసనము, ప్రణయినీ ప్రార్థనము, పద్మిని, దేశమాత, ధర్మపాల, పరశువేది మొదలయినవి కలవు. ఇవిగాక వివిధ శీర్షికల పేరుతో వ్రాసిన చెల్లచెదురు పద్యములు రమారమి రెండు వందల పైచిలుకు గలవు.

వ్యాసములు— సురవరమువారు గోలకొండ పత్రికలోను, ఇతర పత్రికల లోను వ్రాసిన వ్యాసములు కోకొల్లలుగా నున్నవి. ఇవన్నియు నొకసంపుటిగా వెలువడి

నచో నదొక విజ్ఞాన సర్వస్వమై జిజ్ఞాసువుల కెంతేని జ్ఞానభిక్షను ప్రసాదించగలదు. వ్యాస రచనా ప్రక్రియ వీరిచేతిలో పలువిధముల మెలికలు తిరిగినదనుట ప్రశంసమాత్రేవ కానేరదు. సుజాతలో "దశకుమార చరిత్రము" "విభూతి" 0వ సంచికలో "గౌరన హరిశ్చంద్ర" తెలుగుతల్లి 1939 అక్టోబరులో "తిక్కన భారతము" ఆంధ్రవిజ్ఞాన సర్వస్వములో వేషభూషణాలంకరణములు, ఆంధ్రపత్రిక ఉగాది సంచిక (1941-42)లో "హైదరాబాదు రాష్ట్రవిద్యా సమస్యలు" శోభ. ఆగస్టు 1950 సంచికలో "మనకవసరమగు చరిత్రలు" మొదలయిన వ్యాసములు వీరి లోకజ్ఞతను, గంభీరమైన విచారధారను, మేధాపటిమను చాటుచున్నవి.

రెడ్డిగారి రసాత్మకమైన కావ్య రామణీయకతను ప్రదర్శించుటకు కొన్ని యుదాహరణములు : ఉచ్చల విషాద నాటకము-భోగసేనుడు ఉచ్చలుని వధించుటకు రాత్రియే తగిన సమయమని భావించును. అప్పటి నిశావర్ణన పద్యమిది :

సీ॥ నీలకంబళమందు నిశి జారచోరులఁ
గరుణతో గాపాడగడఁగునపుడు
తారాకిరీట యుతంబైన శిరముతో
యామవతీదేవి యలరునపుడు
తనతటిద్ధార చ్యుతంబైన తుహినతు
షార మౌక్తికములు జాఱునపుడు
బహువిధ దీపికల్ బహుళంపు దివ్వెటీ
కాంతుల వెలుగొంది క్రాలునపుడు

శాస్త్రములవిప్పి వృద్ధులు చదువునపుడు
చుక్కగుంపుల సిద్ధాంతి చూచునపుడు
అర్ధగోళంబుపై మబ్బులరినపుడు
ఉచ్చలుని యంతమొందింప యుక్తమౌను.

"తెలుగుతల్లి" శీర్షికలో రెడ్డిగారి భాషాభిమానమును గమనింపుడు :

నచో నదొక విజ్ఞాన సర్వస్వమై జిజ్ఞాసువుల కెంతేని జ్ఞానభిక్షను ప్రసాదించగలదు. వ్యాస రచనా ప్రక్రియ వీరిచేతిలో పలువిధముల మెలికలు తిరిగినదనుట ప్రశంసత్రోవ కానేరదు. సుజాతలో "దశకుమార చరిత్రము" "విభూతి" 0వ సంచికలో "గౌరన హరిశ్చంద్ర" తెలుగుతల్లి 1939 అక్టోబరులో "తిక్కన భారతము" ఆంధ్రవిజ్ఞాన సర్వస్వములో వేషభూషణాలంకరణములు, ఆంధ్రపత్రిక ఉగాది సంచిక (1941-42)లో "హైదరాబాదు రాష్ట్రవిద్యా సమస్యలు" శోభ, ఆగస్టు 1950 సంచికలో "మనకవసర మగు చరిత్రలు" మొదలయిన వ్యాసములు వీరి లోకజ్ఞతను, గంభీరమైన విచారధారను, మేధాపటిమను చాటుచున్నవి.

రెడ్డిగారి రసాత్మకమైన కావ్య రామణీయకతను ప్రదర్శించుటకు కొన్ని యుదాహరణములు : ఉచ్చల విషాద నాటకము-భోగసేనుడు ఉచ్చలుని వధించుటకు రాత్రియే తగిన సమయమని భావించును. అప్పటి నిశావర్ణన పద్యమిది :

సీ॥ నీలకంబళమందునిశి జారచోరులం
గరుణతో గాపాడగడగునపుడు
తారాకిరీట యుతంబైన శిరముతో
యామవతీదేవి యలరునపుడు
తనతటిద్ధార చ్యుతంబైన తుహినతు
షార మౌక్తికములు జారునపుడు
బహువిధ దీపికల్ బహుళంపు దివ్వెటి
కాంతుల వెలుగొంది క్రాలునపుడు

శాస్త్రములవిప్పి వృద్ధులు చదువునపుడు
చుక్కగుంపుల సిద్ధాంతి చూచునపుడు
అర్ధగోళంబుపై మబ్బుల లరినపుడు
ఉచ్చలుని యంతమొందింప యుక్తమౌను.

"తెలుగుతల్లి" శీర్షికలో రెడ్డిగారి భాషాభిమానమును గమనింపుడు

సీ॥ పరిపూర్ణ పావనాంభస్తరం గోద్వేగ
గౌతమీ గంభీర గమనమునకు
ఆలంపురీనందనారామ విభ్రాజి
మల్గోబ ఫలరాజి మధురరుచికి
ఆంధ్రకుమారీ సమాయుక్త పరిపూత
తుంగాపయస్సు మాధుర్యమునకు
ఖండశర్కర జాజిఖర్జూర గోక్షీర
ద్రాక్షాదియుత రామరసమునకును

అమృతనిష్యందివల్లకీహ్లాదమునకు
రాగిణీదివ్యసమ్మోహరాగమునకు
తేనెతేటల నవకంపుసోనలకును
సాటియగును మాతెలుగుభాషామతల్లి.

భక్తతుకారామ్ నాటకము— దేశభక్తుడే భక్తుడని తుకారాంచేత పలికించి రెడ్డిగారు తమ దేశభక్తిని ప్రకటించిన వైనము మనందరకూ శిరోధార్యము కావలయును. ఆపద్యమిది :

చం॥ అనిశము మాతృదేశ హితమాత్మను గోరెడివాడె భక్తుడా
తన తనువున్ ధనంబును ముదంబున నర్పణసేయునట్టి యా
మనుజుడె త్యాగి బ్రాహ్మణుల మాలల నొక్క విధంబు నూచు నా
జనుడె మనీషి. దుర్మదము శత్రుగజూచు నతండెశూరుడా.

## ఆదిరాజు వీరభద్రరావు

జననము :- శా.శ. 1812 (క్రీ.శ. 1890). మరణము : శా.శ. 1897 (క్రీ.శ. 1975) ప్రాంతము. జన్మస్థానము- ఖమ్మంజిల్లా, మధిర తాలూకా, దెందుకూరు గ్రామము. తల్లి వెంకమాంబ తండ్రి లింగయ్యపంతులు. నిరుపేద ఆరువేల నియోగికుటుంబము. క్రీ.శ. 1913 నుండి హైదరాబాదులో స్థిరనివాసము. తెలుగు, ఇంగ్లీషు, సంస్కృతభాషలలో విశేషించి కృషిచేసిన మహనీయుడు. తెలంగాణమునకు జీవితమును ధారపోసిన ఉత్తమ పరిశోధకులు. తొలిదశలో కొమర్రాజు లక్ష్మణరావు గారి చేతిక్రింద ఆంధ్రవిజ్ఞానసర్వస్వ నిర్మాణమున పనిచేసిరి. హైదరాబాదు నగరమున

జరిగిన సాహిత్యకృషికి, సంస్కృతివికాసమునకు దోహదము చేసినవారు. గోలకొండ కవుల సంచికా ప్రకటనమున ప్రతాపరెడ్డిగారికి కుడిభుజముగ పనిచేసిరి. మాడపాటి హనుమంతరావు షష్టిపూర్తి సంచికకు ( క్రీ.శ. 1949) సంపాదకులుగ వ్యవహరించిరి.

క్రీ.శ. 1950 నాటికి కొంచెం ముటుఇటుగ వీరి ముద్రిత రచనలు : 1. చిత్ర శాకున్తలము-క్రీ.శ. 1903లో వ్రాయబడి అసంపూర్తిగ మిగిలినది. 3. ప్రాచీనాంధ్ర నగరములు. 3. లలిత కథావళి. 4. జీవిత చరితావళి. 5. ప్రాచీనాంధ్ర నగరములు. 6. గ్రీకు పురాణ కథావళి 7. చైతన్యము. 8. రత్నప్రభ. 9. జేమ్సు అబ్రహాముగారి ఫీల్డు జీవితము-జీవిత సాఫల్యము. 10. నవ్వుల పువ్వులు 11. జీవిత చరిత్రలు. 12. మిఠాయిచెట్టు. 13. భాగ్యనగర చరిత్ర. 14. తెలంగాణము, 15. మన తెలంగాణము 16. శతాధిక చారిత్రక వ్యాసములు. 17. పోలీసుచర్య అయిపోయిన తరువాత ఖండవల్లి లక్ష్మీరంజనముగారు తయారుచేసిన సంగ్రహ విజ్ఞానకోశమునకు మూలస్తంభముగ నిలిచిరి. 18. క్రీశ.1950కి పూర్వమే లక్ష్మణరాయ పరిశోధక మండలి పక్షమున నూర్లకొలది తెలంగాణ శాసనములను సేకరించి భద్రపఱచిన మహనీయుడు. సాంస్కృతిక పరిశోధనా రంగమునందు రాచ బాటలు తీర్చిన నిజమైన వైతాళికుడు.

## బూర్గుల రామకృష్ణారావు

జననము - శా.శ. 1821 (క్రీ.శ. 1899 మార్చి 13వ తేది, వికారినామ సంవత్సర ఫాల్గుణ శుద్ధ విదియ) మరణము - 1967 సెప్టెంబరు 14వ తేదీనాడు. జన్మస్థానము - పాలమూరు జిల్లా (మహబూబ్‌నగర్) కల్వకుర్తి తాలూకా, పడకల్ గ్రామములో మాతామహుల గృహమునందు, స్వగ్రామము ఇదే జిల్లాలోని "బూరుగుల" తల్లి రంగనాయకమ్మ. తండ్రి నరసింగరావు. స్వగ్రామములో ప్రాథమిక విద్య పూర్తి యైన పిమ్మట హైస్కూలు విద్య కొఱకు క్రీ.శ. 1911లో హైదరాబాదు నగరమునకు ఆగమనము. అది మొదలుకొని జీవితాంతము హైదరాబాదులో స్థిరనివాసము గోల్కొండ వ్యాపారులుగా వ్యవహరింపబడు నియోగ బ్రాహ్మణులు. వైష్ణవ సంప్రదాయమునకు చెందినవారు. బొంబాయి విశ్వవిద్యాలయము నుండి యల్.యల్.బి. పట్టభద్రులైన పిమ్మట బొంబాయిలోని అంజుమన్ ఇస్లాం హైస్కూలులో కొంతకాలము అధ్యాపకులుగ పనిచేసిరి. హైదరాబాదుకు తిరిగివచ్చిన పిమ్మట రాజకీయ రంగములో ప్రవేశించిరి. 1952లో హైదరాబాదు రాష్ట్ర ముఖ్యమంత్రియైరి. రాజకీయముగ నెంత చతురులో సాహిత్య రంగమున నంతటి చేయితిరిగిన రచయితలు, కవులున్ను.

[పద్యములు] 18. భారతమాత [కవిత] 19. గీతాంజలి [అనువాదము కొన్ని మాత్రము] 20. ఆంధ్ర మహాసభ పర్యటనాను భవాలు (ద్విపద కావ్యము) 21. పేరు తెలియని ఒకచిన్న నాటిక 22. సాహిత్య వ్యాసములు. ఆనాటి గోల్కొండ పత్రికలో ప్రచురితములు. ఇటీవల సారస్వత వ్యాస ముక్తావళి పేరుతో గ్రంథరూపమున వెలువడినవి.

ఇవన్నియు దాదాపు 1930కి పూర్వము వ్రాసినవే. ఇక సాహిత్యేతర రంగము లకు సంబంధించిన వివిధ విషయములపై వ్రాసిన వ్యాసములు కోకొల్లలు. తెలుగు, సంస్కృతము, హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు ఈఅన్ని భాషలలో వీరి రచనలు వెలువడినవి. అవొక పెద్ద జాబితా. పేర్కొన్నచో ఒకచిన్న కేటలాగు పుస్తకమగును. విస్తరభీతిచే విరమించటమైనది.

వీరి మొట్టమొదటి రచన "చార్వాకోపదేశము" అన్న మూడు పద్యముల ఖండిక. **1922లో** తమ 22వ యేట వ్రాయబడినది. శీర్షిక పేరెట్లున్నను నాస్తికులకు చేసిన హెచ్చరిక యిది. మానవుడు ప్రాకృతికమైన భ్రమలోపడి అప్రయత్నముగనే పాప పంకిలమున కూరుకొని పోవుచున్నాడని కవి వాపోయిన విధము వ్యక్తమగును.
**ఆ పద్యములివి :**

శారద రాత్రులన్ విమల చంద్రిక గాయుచునుండ హాయిగా
నీరజ నేత్రలన్ గలసి నిద్దపునద్దపు సౌధరాజిపై
చారువన ప్రసూనముల చాయల జిమ్మెడు దివ్యమద్యమే
మారక గ్రోలుచుండు సుకుమారుల రేపటి చింతఁజేరునే ?

కాలపిపు ప్రవాహముల గట్టగ నేరికి శక్యమౌను నీ
ఫాలతలంబునన్ మొదట వ్రాసిన చిత్తఱువెట్లు దిద్దగా
జాలుదు వీవు దీర్ఘపు విచారము లన్నియు జేసి రేపు సౌ
ఖ్యాలను గాంతు వేర, తృటికాలపు జీవిత మాదెరుంగవే ?

భూతభవిష్య దాకృతుల బుద్ధిని గాంచగలేము గాన సం
ఘాత సమగ్ర విశ్వమయ కాలమహా గ జవాశ్వతిత్రవరిం
భాతము నోర్వగల్గుటకు కళ్ళెముఁబెట్టి ప్రసిద్ధ ప్రస్తుతం
బాతత స్ఫూర్తి బట్టికొని పాయసమోవిసమాగ్రహింపుమా !

ఈ సందర్భములో పేర్కొనవలసిన వైతాళికులు మఱికొందరున్నారు. వారు ప్రధానముగ సాహిత్యేతర రంగములందే తమజీవితసర్వస్వమును ధారపోసిన మహనీయులు. అయితే, వారు యిక్కడ వర్ధిల్లిన అన్ని రంగములతోపాటు సాహిత్య రంగమును కూడ ప్రోత్సహించి కొంతంతబలమును చేకూర్చుట విశేషించి చెప్పవలసినమాట. వీరిలో రాజా బహద్దరు వెంకటరామరెడ్డి, కొండా వెంకటరంగారెడ్డి, మందుముల నరసింగరావు ప్రభృతులు ముఖ్యులు. వీరందరికి నమోవాకములు.

శ్రీయుతులు దేవులపల్లి రామానుజరావు, దాశరథిగారలనుకూడ ఈ సాహిత్య యుగమున చేర్చుట సమంజసమని తోచుచున్నది. తెలంగాణ వైతాళికులుగ కీర్తింప బడుచున్న పెద్ద తరము మహనీయులకు వారసులుగ చివరి దశలో వికసించిన వైతాళిక లతాంతములు వీరు, ఇర్వురు అటు ఉద్యమములలో పాల్గొనుటయేగాక ఇటు సాహిత్య రంగమున కూడ వర్ధిల్లినవారు, దాశరథి తొలిదశలో తన కవిత్వమును తెలంగాణ తల్లికి నైవేద్యముగా సమర్పించినవ్యక్తి. అట్లయ్యును ఈ గ్రంథ రచనా ప్రణాళిక ననుసరించి దేవులపల్లివారిని, సారస్వత పరిషత్సాహిత్య యుగమున చేర్చుట జరిగినది. దాశరథిని మాత్రము ఈ వైతాళిక సాహిత్యయుగమున చూతుముగాక.

## దాశరథికృష్ణమాచార్యులు

జననము 1927. జన్మస్థానము- వరంగల్ జిల్లా గూడూరు గ్రామము. స్థిరనివాసము హైదరాబాదు. ఆంగ్లసాహిత్యము ప్రధాన విషయముగ ఉస్మానియా విశ్వవిద్యాలయ పట్టభద్రులు.

నిజాం నవాబుకు వ్యతిరేకముగ తెలంగాణ ప్రజలు సాగించిన పోరాటములో క్రీ.శ. 1948 ప్రారంభమున తొలుత వరంగల్లు జైలులోను పిమ్మట నిజామాబాదు జైలులోను క్రమగ్గిపోయిన వ్యక్తి దాశరథి. నిజామాబాదు జైలుగోడమీద వారుబొగ్గుతో వ్రాసిన యీ క్రింది పద్యమే వారి తొలి కవితయని భావించుట లెస్స :

ఓ నిజాము పిశాచమా! కానరాడు
నిన్ను బోలిన రాజు మాకెన్నడేని;
తీగెలను తెంపి, అగ్నిలో దింపినావు
నా తెలంగాణ కోటి రత్నాలవీణ.

దాశరథియొక్క అచ్చైన కావ్యములలో మొట్టమొదటిది "అగ్నిధార". 1949 ఆగష్టునెలలో ముద్రింపబడినది. ఇందులో దాదాపు 50 కవితా ఖండికలున్నవి. ఇవి కొన్ని పద్యములు మరికొన్ని గేయములున్నూ. రెండవది "రుద్రవీణ" 1950 లో ముద్రింపబడినది. ఇందులో దాదాపు 20 పద్య, గేయకవితా ఖండికలున్నవి ఈరెండు కావ్యములలోని ప్రతిపద్యము, ప్రతిగేయము భవ్యకవితావేశముతో నిండి, మంచి శిల్పమును సంతరించుకొన్నవి. అపిమ్మట వ్రాసిన రచనలలో ఈ యావేశము. రసము శిల్పము పరిపుష్టికొని నాట్యము చేసినవి.

"తెలంగాణ విముక్తి" శిక్షకై జైలులో పోయిన తమ "తెలంగాణోపాఖ్యానము" అనుకావ్యమునకు ఉత్తరానుబంధముగ 1950 లో వ్రాయబడిన యీ క్రింది పద్య భాగమును వినుడు :

అవి తెలంగాణలోన దావాగ్ని లేచి
చుట్టుముట్టిన భీకర ప్రళయ దినాలు
అవి నిజాము నృపాలుని ఉండ దండ
చూచుకొని రెచ్చినట్టి పిశాచ కలలు

నాడు మానవతీ నయనమ్ములందు
నాగసర్పాలు బుసగొట్టి నాట్యమాడె
నాడు మానవతా నవ నాగరకత
తన్నుచున్నది రాక్షసత్వమ్ముతోడ.

భారత భామినీ నయనభాగ వినిర్గత రక్తబాష్ప శృం
గారిత కాలరాక్షసి వికావిక నవ్విన నిస్స్వనమ్ములో
తూరుపు ఊరుపున్ విడిచి తొందరపడ్డది తెల్లవారగా
ఘోర నిశా తమఃపటల గుంభిత నీల నభఃపథమ్ములన్.

పరశు నిశాత ధారలను పచ్చనిగడ్డి యెదిర్చినట్లు, రా
చరికపు టుక్కుచట్టమును చల్లగ ధిక్కరణమ్మొనర్చె ఉ
స్సురనెడి పేదవాడు, కడుచోద్యము: వెచ్చని స్నానమాడె సుం
దరతర భామినీ నయనధారల భారత మాతృ పాదముల్.

తరతరాల స్వప్నాల సుందర ఫలమ్ము
స్వైర భారతభూమి చూపడెనా లేదొ
విషము గుప్పించినాడు నొప్పించినాడు
మా నిజాంరాజు. జన్మజన్మాల బూజు.

భారత మాతృగర్భమున బల్లెము గుచ్చిన దండగించ కా
ధారముగా నిజాంనృపతి తాళముతీసిన పెద్దపెద్ద బం
గారపు బొక్కసాలు పసిగట్టెను తెల్లదశారి; అంతలో
బేరముసాగె పోరు జరిపింప తుపాకులు గొంపుకోసమై.

కోటి తెలుంగు లొక్కమొగి 'కో' యని పిల్చిర యంతలోనె ఆ
రాటము జెందె భారత ధరాతలమంతయు పొంగివచ్చెబో;
'కూటికిలేని పేదలకు గూడను పౌరుషమా!' యటంచు స్త్రీ
కోటిని మానభంగములకున్ గురిచేసిరి ముష్కరాధముల్.

చల్లని మంచుకొండలు భుజమ్మున మోసెడు భారతమ్ము కాం
తిల్లె నిజాము నీల్గుడులు తేటపడంగలదాక; అంతలో
భోళ్ళన కుండ బ్రద్దలయిపోయెను; భారతమాత డొక్కలో
కుళ్ళిన పుండు కోసి జయగోపురమెక్కె త్రివర్ణ కేతనాల్.

దూరాన నున్న 'చుట్టము'
దూరాననె దూరె; తెల్లదొంగ నభస్సం
చారియయి పారె; స్వేచ్ఛా
భారతసైన్యంబు తలుపు బ్రద్దలుకొట్టెన్.

ఎదురెక్కియున్న జలములు
నదులై చొరబారె యింటినడుమన్; రాముం
డదనున బాణము వదలెను
మద మడగెన్ మా ప్రభుత్వ మారీచునకున్.

రెండువందలయేండ్ల చరిత్ర గదుల
కప్పుకొని యున్న గాఢాంధకార మెల్ల
కొట్టుకొని పోయె తూరుపు మిట్టనుండి
పారి వచ్చిన వెలుతురు వాగులోన.



# ఉస్మానియా సాహిత్యయుగము

శా. శ. 1842-1872 = క్రీ.శ. 1920-1950

## రాయప్రోలు సుబ్బారావు

జననము-శా. శ 1814 (క్రీ.శ. 13-3-1892). మరణము-శా. శ. 1906 (క్రీ.శ. 1984). జన్మస్థానము-గుంటూరుజిల్లా, బాపట్లతాలూకా, గార్లపాడు గ్రామము. క్రీ.శ. 1917 ప్రాంతములో రెండు మూడు సంవత్సరాలు శాంతినికేతనములోనివాసము శా.శ. 1844 నుండి (1922 జులై 4వ తేదీనుండి) ఉస్మానియా విశ్వవిద్యాలయతెలుగు శాఖాధ్యక్షులుగా ప్రవేశించి క్రీ. శ. 1946కు పిమ్మట పదవీ విరమణ చేసిన తరువాత మరణించువరకు సికిందరాబాదులోనే స్థిరపడిరి. క్రీ. శ. 1950కి పూర్వము వారు రచించిన సుప్రసిద్ధ కావ్యములివి :

లలిత. తృణకంకణము, కష్టకమల, స్నేహలత, తెలుగుతోట, స్వప్నకుమారము, జడకుచ్చులు, వనమాల, ఆంధ్రావళి, రమ్యాలోకము, మాధురీదర్శనము, రూపనవనీతము, మధుకలశము (ఉమరుఖయ్యాంరుబాయితులకు తెలుగు పద్యానువాదము). తృణకంకణము క్రీ.శ. 1913లో రచింపబడినది. ఇది 1938లో రజతోత్సవములు జరుపుకొన్నది.

నవ్యకవితా యుగోదయమును గురించి, ఆ యుగకర్తలను గూర్చి అభిప్రాయ భేదములున్నవి. కొందరు రాయప్రోలు వారనిరి; మరికొందరు గురజాడ వారనిరి. ఈ శతాబ్దములోని సుప్రసిద్ధులైన మహాకవులు పలువురు రాయప్రోలు వారివైపే మొగ్గ చూపిరి. కీ.శే. కవిసమ్రాట్ నోరి నరసింహశాస్త్రిగారిట్లనిరి:[1]

1. "తెలుగు చరిత్రకు కావ్యత్వం కల్పించిన నవలాశిల్పి నరసింహశాస్త్రి" వ్యాసము, ఆంధ్రప్రభ దినపత్రిక, నవంబరు 3 గురువారం 1977. సాహిత్యప్రభ. ముఖాముఖీ శీర్షిక క్రింద. రచయిత డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి.

"తెలుగు సాహిత్యంలోకి ఇది (నవ్యకవిత) వసంతఋతువులా, మలయపవనంలా, తొలకరిజల్లులా ప్రవేశించింది. స్త్రీలల్లో లావణ్యం, పసిపాపల్లో మిసిమి, యువతలో ఉత్సాహం, యోగుల్లో శాంతి, కావ్యంలో రసంవలె ఇది ఫలానా అని చెప్పటానికి వీల్లేని ఒకానొక విశిష్టధర్మం ఉన్న కవిత్వం. దీనికి తొలిపూజ క్రీ.శ. 1913లో రాయప్రోలు వారి "తృణకంకణం"తో ప్రారంభమైంది. ఆయన ఉదయిస్తూన్న ఆకాంతిబింబాన్ని ముందుగా చూడగలిగిన ద్రష్ట'' అని. వారి "ఏదేశమేగినా" "శ్రీలుపొంగిన జీవగడ్డై" అన్న గీతములు గుండెలు పులకరింపజేయు జాతీయ భావపూర్ణములు. వీనిలో మొదటిది బంకించంద్రుని "వందేమాతరమ్" గీతమునకు సాటివచ్చునది.

మామిడి కొమ్మమీదగల మంత్ర పరాయణుడైన కోకిల
స్వామికి మ్రొక్కి యీ యభినవస్వరకల్పన కుద్యమించితిన్
కోమలగోస్తని రుచులకున్ కదళీఫల పాకసిద్ధికిన్
లేములు దీర్ప మాతెనుగు లేఖముముళ్ళ వెలార్చువేడుకన్ (రమ్యాలోకము)

అన్న పద్యముతో కావ్యరచన కుద్యమించిన మహాకవి రాయప్రోలు. తెలుగు సాహిత్యమున వారు ప్రతిపాదించిన, ప్రసాదించిన అపూర్వమైన కాన్క "అమలిన శృంగారతత్త్వము''. రససిద్ధుడైన ఆమహాకవి యొక్క మాతృభాషాభిమానమును చాటు నీపద్యమును విని విరమింతము :

ఏ ప్రఫుల్ల పుష్పంబుల నీశ్వరునకు
పూజ సల్పితినో యిందు పుట్టినాడ
కలదయేని పునర్జన్మ, కలుగుగాక
మధుర మధురం బయిన తెన్గు మాతృభాష!

## రాయప్రోలు వేంకట రామ సోమయాజులు

ఉస్మానియా విశ్వవిద్యాలయమున తెనుగు శాఖ ప్రారంభింపబడక పూర్వమే నిజాం కళాశాలలో శా.శ. 1832 నుండి 1852 వరకు (క్రీ.శ. 1910-1930) తొలి తెలుగు లెక్చరర్‌గా పనిచేసిన మహనీయుడు. సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో నిష్ణాతులు. వీరు షేక్స్‌పియర్ యొక్క ప్రఖ్యాత నాటకములు కొన్నింటిని తెలుగులో అనువదించి ప్రచురించినట్లు తెలియుచున్నది. వివరములు లభించుటలేదు. తెలిసిన వారెవరైనను తెలియబరచినచో మహోపకార మొనర్చిన వారగుదురని విన్నవించటమైనది.

## ఖండవల్లి లక్ష్మీరంజనం

జననము—శా.శ. 1830 (క్రీ.శ. 1908 మార్చి). జన్మస్థానము—తూర్పు గోదావరిజిల్లా పెల్లంపూడి గ్రామము. వీరి 7వ తరగతి చదువు పూర్తియగు సమయమది. ఇంతలో వీరి తండ్రి సూర్యనారాయణశాస్త్రిగారికి వరంగల్లులోని మట్టెవాడ ఆయుర్వేద కళాశాలలో సంస్కృత పండితునిగా ఉద్యోగము కుదిరినందువల్ల క్రీ.శ. 1920 ప్రాంతమున వారికుటుంబము పెల్లంపూడినుండి వరంగల్లుకుతరలివచ్చినది. అప్పటినుండి వీరు తెలంగాణ నివాసులైరి. పిదపమిలా హైదరాబాదుకు చేరుకొని కళాశాలా విద్యను పూర్తిచేసుకొని ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగుశాఖలో లెక్చరరుగా చేరిరి. క్రీ.శ. 1942లో రాయప్రోలు సుబ్బారావుగారు పదవీ విరమణ చేసిన పిమ్మట ఆంధ్రశాఖాధ్యక్షులై క్రీ.శ. 1968 వరకు ఆ బాధ్యతను నిర్వహించి పదవీ విరమణ చేసిరి.

క్రీ.శ 1950కి **పూర్వము** వీరు వ్రాసిన గ్రంథములను గూర్చిన వివర**ములు** తెలియవు. వీరి తమ్ముడు బాలేందుశేఖరంగారు మా తము "ఆంధ్రుల చరిత్ర" అన్న గ్రంథమును వారుగా దానిని ఆనాడే ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురించినది. దరిమిలా కొంతకాలమునకు ఈసోదరులిరువురును కలిసి "ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి" యను గ్రంథ**ము**ను వెలయించిరి. ఇదొక మంచి గ్రంథము. ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగుశాఖ చరిత్రలో పరిశోధనా రంగమున లక్ష్మీరంజనముగారు చేసిన కృషి మిక్కిలి గణనీయమైనది.

1950కి పూర్వము వారు వ్రాసిన గ్రంథ**ము**లేవియు లభింపకున్నను, ఆనాడే "**భానురథము**" అన్న శీర్షికన వ్రాసిన తొమ్మిది **పద్యముల** కమ్మని కవితాఖండిక యొకటి "**సాధన సమితి**" వారు ప్రకటించిన "**ప్రత్యూష**" పద్యసంకలన గ్రంథ ములో దొరుకుచున్నది. ఆ పద్యములన్నియు ఇచ్చుటకు విస్తరభీతి! విడిగా కొన్ని పద్య ములను వేయుదమన్న కవిహృదయము వ్యక్తముకాదన్న భయము! అందువల్ల వారు ఏనాడో తమ స్వగ్రామముపై వ్రాసిన ఒకే ఒక పద్యము ఉట్టంకింపబడుచున్నది. 1

"అది మాగ్రామ**ము** గౌతమీవిమల **పుణ్యాం**భః పవిత్రీకృతం
బదిగో యెట్టయెదుంట మా శివుని దివ్యారామ సంఘస్థలిన్
చదురై నిల్చె ధ్వజంబు మిన్నొరయుచున్ స్తంభంపు '**పై**' కొమ్ములం
దదిగోవెల్గును మిన్కుమిన్కుమని నందాదివ్వె పాపష్నమై॥

1. వజ్రోత్సవసంచిక-తెలుగు విభాగము-ఉస్మానియా విశ్వవిద్యాలయము ప్రచురణ-1978-సంపాదకవర్గము - ఆచార్య బి. రామరాజు, ఆచార్య సి. నారాయణరెడ్డి, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం ప్రభృతులు. ఇందులో "నందాదివ్వె" శీర్షికన ఖండవల్లి లక్ష్మీరంజనం గారిపై డా॥ నాయని కృష్ణకుమారిగారు వ్రాసిన వ్యాసము నుండి ఉట్టంకింపబడినది.

# కురుగంటి సీతారామయ్య

జననమరణముల విషయములు అలభ్యములు. జన్మస్థానము గుంటూరుజిల్లాలోని ఒక గ్రామము. క్రీ.శ. 1930 నాటికే హైదరాబాదుకు చేరుకొని నిజాంకళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగ పనిచేసిరి. ఉస్మానియావిశ్వవిద్యాలయములో 1940 లో తెలుగు ఎమ్. ఏ. తరగతులు ప్రారంభమైనప్పుడు అక్కడ పార్ట్‌టైం లెక్చరరుగా కొంతకాలము, బహుశః పూర్తి లెక్చరరుగా కొంతకాలము పనిచేసిరి. నిజాంకళాశాల ఆంధ్రాధ్యాపకులుగా ప్రసిద్ధిబడసిరి. కాలక్రమమున ఆచార్యులైరి. నిజాం కళాశాలలో అధ్యాపకవృత్తిని చేపట్టకముందు గాంధీగారి శాసనోల్లంఘనోద్యమములోను, జాతీయోద్యమములోను పనిచేసిరి.

1950 కి పూర్వము వారి ముద్రితాముద్రిత గ్రంథముల వివరములివి: "అలంకార తత్వవిచారము". (కట్టమంచివారు "కవిత్వ తత్వవిచారము" నందు అలంకారములనుగూర్చి చేసిన విమర్శను తీవ్రముగ ఖండించుచూ వ్రాసిన గ్రంథము). "తంజాపురాంధ్ర నాయకరాజ చరితము" (ఈ విషయమున నిది మొట్టమొదటి పరిశోధన గ్రంథము) "ఆదర్శప్రభువు" (నిజాంనవాబు మీర్ ఉస్మానాలీఖాన్‌ను గూర్చి వ్రాసిన గ్రంథము). "నవ్యాంధ్రసాహిత్య వీధులు" నవ్యసాహిత్య చరిత్రను గూర్చి మొట్టమొదటిసారిగా వివరములతో వెలువడిన గ్రంథము). "కథాత్రయి", "కొందరు తంజావూరు కవులు-పండితులు". "A hand book of Telugu literature", "వ్యాసలహరి" [నాలుగు భాగములు]. "దాక్షిణాత్యదార్శనికు"లు. "Sanskritic studies - Essays - Historical & Literary."

సంస్కృతాంధ్రంగ్లభాషలలో నిష్ణాతులు. వ్రాయు నేర్పు, మాట్లాడగల నేర్పు గలిగినవారు. తెలుగుపాఠములను బోధించుటలో దిట్ట. విద్యార్థుల హృదయమును రంజింపజేయుటలో ఆరితేరినవారు ఇంతటి వైవిధ్యముగల సాహిత్యమును వెలయించిన వీరు స్వయముగా కవియైనట్లు తోచదు. ఒకవేళ ఏవైన కవితలు వెలయించి యుండినచో నవి మృగ్యములు.

# పల్లా దుర్గయ్య

జననము : శా. శ. 1832. (క్రీ.శ. 1916) మరణము : 1984 ప్రథమార్థమున. జన్మస్థానము - వరంగల్లుజిల్లా మడికొండగ్రామము. క్రీ.శ. 1940లో ఉస్మా

నియాలో తెలుగు ఎం.ఏ. తరగతులు ప్రారంభమైనప్పుడు చేరి చదివిన ఒకేఒక విద్యార్థి. 1942లో ఎం. ఏ. లో ఉత్తీర్ణులైన పిమ్మట తొలుత ఛాదర్‌ఘాట్ ఇంటర్ కళాశాలలోను, పిమ్మట నిజాం కళాశాలలోను, పరిమిలా ఉస్మానియా ఆర్ట్సు కళాశాలలోను లెక్చరరుగా, రీడరుగా పనిచేసిన వ్యక్తి. అఖండ మేధాసంపన్నులు, నిరాడంబరులు, ఉత్తమ అధ్యాపకులు.

1950 నాటికి వీరి అముద్రిత రచనలు - "ప్రణయపరీక్ష" (ఖండకావ్యము). "మనుచరిత్ర విశేషాంశములు". విద్యార్థి దశనుంచే అప్పుడప్పుడు వీరు కొన్ని పద్యములు, గేయములు వ్రాయుచూ వచ్చిరి. అవన్నియు కాలాంతరమున "పాలవెల్లి" అను పేర నొక సంకలన గ్రంథముగా వెలువడినవి. 1950 కి పిమ్మట "గంగిరెద్దు" అను ఆధునిక పద్యకావ్యమును కూడ వెలయించిరి.

"పాలవెల్లి" పద్యగేయసంపుటి వెలువడక పూర్వముసంగతి : వీరు "మామ" అన్న శీర్షికన వ్రాసిన గేయమొకటి సాధనసమితివారి "ప్రత్యూష" పద్యసంకలనములో ప్రచురింపబడినది. అందమైన భావసంపదతో కూడిన ఆగేయమిది :

మామవచ్చిండు మాకేమి తెచ్చిండు
మంచి ముత్యాలిచ్చే పంచుకొంటన్నాడు.
బొండుమల్లెలు కొంగునిండ పైచల్లిండు
పందిరల్లిన సల్లుకొండు మీరన్నాడు.
పచ్చిపాల్ తెచ్చిండు పారనేపోసిండు
ఎత్తుకోగలేరని యెత్తుకొంటన్నాడు.
అమృతభాండము తెచ్చి అటుకుపైనుంచిండు
అందుకోగలరేని అడ్డమెవరన్నాడు.
పలుకురాకొండెక్కి పగలబడి నవ్విండు
పట్టుకోగలరేని పట్టుకొంటన్నాడు.
వానవోలె వస్తాడు దొంగవలెపోతాడు
కనుమూసి తెఱచులో కనపడడు మామామ,
ఎంచి చూడగచాల మంచివాడాతండు
చల్లదనముల పుట్టి సల్లగును మామామ,

దొడ్డగుణములవాడు దొరతనముగలవాడు
నలుపెల్లి దిగమింగి తెలుపులే వెదజల్లు,
మామామ కడుపులో మచ్చగనుపిస్తుంది
లోకోపకారమై చీకట్లు మింగిండో,
మామలకు మామ, తా మాచందమామ
మామ మామకు మఱది మాచందమామ!

## చలమచర్ల రంగాచార్యులు

శ్రీరంగాచార్యులుగారు విశేషముగ సాహిత్య వ్యాసంగము చేసిన మనీషి. సంస్కృతాంధ్రములలో అనేక గ్రంథములను వెలయించిరి. ఇందుమించు 1950 నాటికి వీరు వ్రాసిన గ్రంథములలో పేర్కొనదగినవి: "అలంకార సతంసము", ఆంధ్ర పతాప రుద్ర యశోభూషణము" ముఖ్యమైనవి. ఈరెండు గ్రంథములునూ సురవరం ప్రతాపరెడ్డి గారి "విజ్ఞానవర్ధినీ పరిషత్తు" పక్షమున ప్రచురింపబడినవి. గద్వాల సోమనాద్రిపై "సోమనాద్రి విజయ"మను పేర నొక పంద పద్యముల కావ్యమును ఆచార్యులవారు 1950 కి పూర్వమే వ్రాసిరి. వారు తాత్కాలికముగ కొంతకాలము వరంగల్లు (హనుమ కొండ) ఆర్ట్సు కళాశాలలో పని చేయుచున్నప్పుడు వ్రాసిన పద్యములివి. ఈ పద్యము లన్నియు కళాశాల వార్షిక పత్రికలో ప్రచురితమైనవి. కాలక్రమమున పుస్తకరూప మున వచ్చినవి.

## మరికొందరు మహనీయులు

ఆచార్య సరిపల్లి విశ్వనాథశాస్త్రి, గిరికిపాటి లక్ష్మీకాంతయ్య, వంటి మనీషులు కూడ నిచట స్మరణీయులు. విశ్వనాథశాస్త్రిగారు నిజాం కళాశాలలో తెలుగు శాఖలో పనిచేయుచూ, "తెలుగు సారస్వత సమితి" విద్యార్థిసంఘ కార్యకలాపములకు మార్గ దర్శకులుగ నుండిరి. లక్ష్మీకాంతయ్యగారుకూడ నిజాం కళాశాల తెలుగుశాఖలో చిర కాలము పనిచేయుటయేగాక కొంతకాలము ఆ శాఖకు అధిపతులుగ కూడ పని చేసిరి. దాదాపు 30 గ్రంథములను సంస్కృతాంధ్ర భాషలు రెండింటిలో వెలయించిరి. వీనిలో 1950కి పూర్వము వ్రాసిన గ్రంథములున్నవేమో పరిశీలింపవలెను.

డా॥ కె. గోపాలకృష్ణారావుగారు క్రీ.శ. 1949లోనే ఉస్మానియా విశ్వవిద్యాలయ మున తెలుగు ఎం.ఏ.లో ఉత్తీర్ణులైన పిమ్మట, వెంటనే అక్కడే తెలుగు శాఖలో ఉపన్యాస కులుగా చేరిరి. 1950కి పూర్వము వారు వ్రాసిన గ్రంథములున్నవేమో మృగ్యము. ఆచార్య డా॥ బి. రామరాజు, ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డి గారలకు 1950కి పూర్వము ఉస్మానియా విశ్వవిద్యాలయముతో సంబంధమున్నట్లు కానరాదు. వీరు తరువాతి కాలమున ఉస్మానియాలో వర్ధిల్లిన మహనీయులు.

ప్రధానరంగము ఇంతటితోసరి. ఇక ఉత్తరరంగముపై దృష్టిని సారింతముగాక.



# ఉత్తర రంగము

## శా.శ. 1872-1878 = క్రీ.శ. 1951-1956

## రాజకీయ చరిత్ర

క్రీ.శ. 1948 సెప్టెంబరు 13వ తేదీనాడు (శా.శ. 1870) భారత ప్రభుత్వము హైదరాబాదు సంస్థానముపై పోలీసుచర్య ప్రారంభించి సెప్టెంబరు 17వ తేదీన హైదరాబాదు నగరమును ముట్టడించి స్వాధీనము చేసుకొనెను. నిజాం నవాబు లొంగిపోయెను. సెప్టెంబర్ 18వ తేదీనాడు శ్రీ జె.యన్. చౌదరి గవర్నరుగా మిలటరీ ప్రభుత్వ మేర్పడెను. పిదపిలా క్రీ.శ. 1950 జూన్ 12వ తారీకునాడు మిలటరీ ప్రభుత్వము స్థానే శ్రీ యమ్.కె. వెల్లోడి ముఖ్యమంత్రిగా ప్రజాప్రతినిధులతో ఒక తాత్కాలిక ప్రభుత్వ మేర్పడెను. ఇందులో బూర్గుల రామకృష్ణరావుగారు రెవిన్యూ, విద్యాశాఖలకు మంత్రిగా నియుక్తులైరి. వెంటనే నగరమునందును తక్కిన తెలంగాణమునందు కొన్ని క్రొత్త పాఠశాలలను నెలకొల్పిరి. ఇంతటితో నగరమునకు సంబంధించి అభివృద్ధి కార్యక్రమములు ప్రారంభమైనవని చెప్పవచ్చును.

క్రీ.శ. 1951 లో హైదరాబాదు నగర పాలక సంస్థకు తొలిసారి ఎన్నికలు జరిగినవి. మాడపాటి హనుమంతరావుగారు మొదటి మేయరుగా ఎన్నుకొనబడి 1954 వరకు ఆ పదవిని నిర్వహించిరి. వీరు మేయరుగా నున్నకాలమున నగరమునందలి విద్యాసంస్థలకు, గ్రంథాలయములకు ఆర్థిక సహాయమందించి వాటి యభివృద్ధికి ఎంతో తోడ్పడిరి.

క్రీ.శ. 1952 జనవరిలో దేశమునందలి అన్ని రాష్ట్రములతోపాటు హైదరాబాదు రాష్ట్రమునందుకూడ విధానసభకు తొలిసారి సార్వత్రిక యెన్నికలు జరిగి కాంగ్రెస్ ఆధ్వర్యమున బూర్గుల రామకృష్ణరావుగారు ముఖ్యమంత్రిగా తొలి ప్రజా ప్రభుత్వమేర్పడినది. శ్రీ బూర్గులవారు క్రీ.శ. 1956 అక్టోబరువరకు-నాలుగు సంవత్సరముల పదినెలలు-ముఖ్యమంత్రిగా నుండి నగరాభివృద్ధికి ఎంతో కృషిచేసిరి పిమ్మట నవంబరు 1వ తేదీనాడు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమేర్పడి హైదరాబాదు మనకు రాజధానియైనది.

1952లో విధానసభకు జరిగిన ఈ ఎన్నికలలో శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు వనపర్తి నియోజకవర్గమునుండి యమ్.ఎల్.ఏ గా గెలుపొందిరి. కాని వారు క్రీ.శ. 1953 ఆగస్టు 25వ తేదీనాడు స్వర్గస్థులగుట మన దురదృష్టము. తెలంగాణ వైతాళికులుగా పేరెన్నికగన్న నలుగురైదుగురు మహనీయులలో తొలుత కీర్తిశేషులైనవారు రెడ్డిగారే! వారు మరికొంతకాలము జీవించి యుండినచో తెలుగు భాషా సాహిత్య సంస్కృతులకు ఈ నూతన వాతావరణములో మరికొంత మేలు జరిగియుండెడిదనుట ఏపాటిమాట! వీరు వ్రాసిన గ్రం[illegible]లలో "ఆంధ్రుల సాంఘిక చరిత్ర" చాలా గొప్ప గ్రంథము. దీనికి 195 [illegible] ంధ్ర ప్రభుత్వము ఉత్తమ గ్రంథ రచన పేరు మీద 5000 వేల రూపాయలు బహూకరించినది. ఇది తెలుగువారికి లభించిన మొదటి జాతీయ బహుమతి. మనకు గర్వకారణము.[1]

## సాంస్కృతికరంగము

ఆగిరాజు వీరభద్రరావుగారు 1949-1953 వరకు నారాయణగుడ ఆంధ్రబాలిక పాఠశాలలో తెలుగుపండితులుగా పనిచేసి విశ్రాంతి గైకొన్న పిమ్మట లక్ష్మణరాయ పరిశోధక మండలిని పునరుద్ధరించియు, వివిధ సంస్థలు నిర్వహించిన రజతోత్సవ, స్వర్ణోత్సవ, వజ్రోత్సవ సంచికలకు, వ్యక్తుల షష్టిపూర్తి సంచికలకు సంపాదకులుగా నుండి ఎనలేని సేవచేసిరి.

క్రీ.శ. 1952లో వైతాళిక మహనీయుల ఆధ్వర్యమున శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయమునకు మహావైభవముగ స్వర్ణోత్సవములు నిర్వహింపబడినవి. నగరము

---

1. 1949లో చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు మద్రాసుప్రభుత్వ ఆస్థానకవులుగా నియమితులైరి. ఆ సందర్భముగ విజయవాడ గాంధి మున్సిపల్ హైస్కూలు ప్రాంగణములో వారికి పట్టప్రదానోత్సవము, అభినందన సభ ఏర్పాటు చేయబడినవి. ఆంధ్రప్రదేశపు నాల్గు చెఱగుల నుండి ఆబాలగోపాలముగ కవులు, పండితులు అసంఖ్యాకముగ విచ్చేసిరి. అప్పుడు హైదరాబాదు నుండి వచ్చిన మహనీయులలో మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, బూర్గుల రామకృష్ణరావు, దేవులపల్లి రామానుజరావు, దాశరథి ప్రభృతులుండిరి. అప్పుడే వీరిని మొదటిసారి చూసిన యదృష్టము ఈ గ్రంథ రచయితకు లభించినది. ఆనాడు దాశరథి చదివిన "నా తెలంగాణ కోటి రత్నాల వీణ" వంటి పద్యములు ఇప్పటికినీ చెవులలో మార్మ్రోగుచు గుండెలను పులకరింపజేయుచున్నవనుట మామూలు మాట.

నందేగాక, తెలంగాణమంతటికీ.—ఇచట జరిగిన సర్వ ఉద్యమములకు స్ఫూర్తి కేంద్రమై విలసిల్లిన యీ సంస్థయొక్క షష్ఠ్యబ్దపూర్త్యుత్సవములు భాగ్య నగర ప్రజలకు మఱపు రాని మధురస్మృతియని తెలిసినవారు చెప్పుట ఆశ్చర్యకరముగాదు

ఉస్మానియావిశ్వవిద్యాలయమున తెలుగు, కన్నడము, మరాఠీ మొదలైన దేశీయ భాషలను ఐచ్ఛిక భాషలుగగాక, అనివార్యపఠనీయ భాషలుగ ప్రవేశపెట్టించుటకు 1948 లో పోలీసుచర్య జరిగిన పిమ్మటినుంచి ప్రయత్నములు ముమ్మరముగ జరిగినవి. అవి 1950-51 నాటికి ఫలించినవి. తెలుగు విద్యార్థులకు మాతృభాషాధ్యయనము చేయు నవ కాశము లభించినది.

నగరములోని వివిధ కళాశాలల తెలుగు విద్యార్థులు, ఉస్మానియా విశ్వవిద్యా లయ కళాశాలలోని తెలుగు విద్యార్థుల నేతృత్వమున ప్రతిసంవత్సరము వారము రోజులపాటు ఆంధ్రాభ్యుదయోత్సవములను నిర్వహించుట ప్రారంభించిరి. దేశము నందలి వివిధప్రాంతములనుండి కవులను, పండితులను ఆహ్వానించి ఉపన్యాసములను, కవితాగోష్ఠులను, సాంస్కృతిక కార్యక్రమములను, భారీయెత్తున ఏర్పాటుచేసి నగర మంతటినీ ఆనందకోలాహలమున ముంచియెత్తుచుండిరి. ఈ ఉత్సవముల నిర్వహణలో ఆధ్వర్యము వహించినవారు ఖండవల్లి లక్ష్మీరంజనంగారు. శ్రీయుతులు బి. రామరాజు, సి. నారాయణరెడ్డి, జి.వి. సుబ్రహ్మణ్యం, శ్రీమతి ఇ. వసుమతీరెడ్డి ప్రభృతులు ఉత్సవకమిటీ కార్యనిర్వాహక సభ్యులుగనుండి ఇదంతయు నడిపించుచుండిరి. ఈఉత్స వములు దిగ్విజయముగ జరుగుటలో సహాయ సహకారములనందించి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి నేతృత్వమున ఆంధ్రసారస్వతపరిషత్తు తనవంతు బాధ్యతను, సేవను చెల్లించినది.

## భాషారంగము

ఈ ఆరుసంవత్సరములలో ఎన్నో గ్రంథాలయములు వెలసినవి. సికిందరాబాదు జనరల్ బజారులో 1950—51 ప్రాంతమున స్థాపింపబడిన రాజశ్రీ సాహిత్యకళాపీఠం గ్రంథాలయము ప్రత్యేకించి పేర్కొనదగియున్నది. దీని స్థాపకులు మొగుదుపురం రాజేశ్వరాచార్యులుగారు, వారిప్పుడు కీర్తిశేషులు. ఆగ్రంథాలయముకూడ నిప్పుడు లుప్తమైనది. ఈసంస్థపక్షమున కొన్ని సాహిత్య ప్రచురణలుకూడ వెలువడినవి. ఆనాడు నగరమున ఎన్నో క్రొత్తపత్రికలు వెలసినవి. గోల్కొండ దినపత్రిక వంటి సుప్రసిద్ధ పత్రికలు విరివిగా ప్రచురింపబడుచు ముమ్మరముగ తమ తమ రాజకీయ,

భాషా, సాహిత్య ప్రచారములను కావింపజొచ్చినవి. ఎన్నో నాటకసంస్థలు వెలసినవి. "నవ్యకళాసమితి", (1950) "నవ్యకళాకేంద్రము" (1951) "విస్తృతినాట్య మండలి" (1952). ఇవి సికిందరాబాదులో స్థాపింపబడినవి. "సన్మిత్రనాట్యమండలి" (1953), లలితకళా నికేతన్ (1953) మొదలగునవి హైదరాబాదులో నెలకొన్నవి. పాఠశాలలు, కళాశాలలు స్థాపింపబడినవి. 1954లో స్థాపింపబడిన రాజావెంకటరామా రెడ్డి మహిళాకళాశాల ప్రత్యేకించి పేర్కొనవలసిన విద్యాసంస్థ. కొన్ని గ్రంథమాలలు నెలకొన్నవి. మాడపాటి హనుమంతరావుగారు ప్రారంభించిన "ఆంధ్ర విజ్ఞానచంద్రికా గ్రంథమాల" ప్రధానమైనది. ఆంధ్ర సారస్వతపరిషత్తు ఒకవైపు రాత్రి పాఠశాలలను, వయోజన విద్యాకేంద్రాలను నిర్వహించుచు, మరొకవైపు ఎన్నోగ్రంథములను ప్రచురించుచు చేసిన సారస్వత సేవ చరిత్రాత్మకమైనది. ముఖ్యముగ పరిషత్తు నిర్వహించిన "ఆంధ్ర మహాభారతోపన్యాసములు", "మహాభాగవతోపన్యాసముల"వంటి కార్యక్రమములు సారస్వత ప్రియులకు మహోపకార మొనర్చినవని చెప్పవలెను. ఎన్నని చెప్పుట! ఎంతని చర్విత చర్వణముచేయుట! ఇప్పుడు ఈ ఆరేళ్ళకాలములో ప్రవర్తిల్లిన సాహిత్యరంగమును గూర్చి దిఙ్మాత్రముగ పరామర్శింతముగాక :

## సాహిత్యరంగము

సాహిత్యరంగమునుగూర్చిన ప్రస్తావన వచ్చినప్పుడు మొట్టమొదట పేర్కొనవలసినది తెలంగాణా రచయితల సంఘమునుగూర్చి. పోలీసుచర్య తరువాత వెలసిన సంస్థలలో నిది ప్రధానమైనది. 1952 సం॥ ప్రాంతమున దీనికి అధ్యక్షులుగా దాశరథి, ప్రధానకార్యదర్శిగా బి. రామరాజుగారలు వ్యవహరించిరి. 1956 లో సి. నారాయణ రెడ్డిగారు ప్రధానకార్యదర్శి బాధ్యతను నిర్వహించిరి. క్రీ.శ. 1956 ఆగస్టు నెలనాటికి ఈసంఘము పక్షమున మొత్తము ఏడు ప్రచురణలు వెలువడినవి.

ఆ వివరము లివి :-

1. పాల్వెల్లి పల్లామర్రయ్యగారు విద్యార్థిదశనుండి అప్పుడప్పుడూ వ్రాయుచు వచ్చిన కవితల సంపుటి. 2. మహాంధ్రోదయం శ్రీదాశరథి, 3. నాగార్జునసాగరం; సి. నారాయణరెడ్డి 4. ఉపహారము శ్రీశ్రీ వాస సోదర కవులు, 5. మహాబోధి, శ్రీదాశరథి 6. పెన్నేటిపాట శ్రీవిద్వాన్ విశ్వం, 7. గంగిరెద్దు, శ్రీపల్లామర్రయ్య.

ఇవన్నియు సుప్రసిద్ధములైన కావ్యములు. ఈ ప్రచురణల కార్యకలాపములను సమర్థవంతముగా నిర్వహించినవారు శ్రీమాన్ ఉరుపుటూరి రాఘవాచార్యులుగారు. వీరు స్వయముగా మంచి రచయితలు. దరిమిలా సాహిత్యరంగమునువీడి రాజకీయరంగమున ప్రవేశించిరి.

పిమ్మట పేర్కొనదగిన సాహిత్య సంస్థ సికిందరాబాదులో 1950 నాటికి నెలకొన్న రాజశ్రీ సాహిత్య కళాపీఠము. దీని వ్యవస్థాపకులు-మొగుదుపురం రాజేశ్వరా చార్యులుగారు. అధ్యక్షులు - వర్సా వేంకటేశ్వరరావుగారు. కార్యదర్శి-ఆకెళ్ళ సుబ్రహ్మణ్య కవి. కళాపీఠం చిత్రకారులు-ఎమ్. బలరామాచార్యులు. డి. గోపాలా చార్యులు, ఎన్. రామమూర్తిగారలు. ఈ పీఠము పక్షమున "ధన్యజీవి" అనుఖండ కావ్యము "కాపుబిడ్డ" అను వ్యవసాయ పద్య కావ్యము తొలుత ప్రచురింపబడినవి. దరిమిలా 1952 నందన శ్రావణములో "పూల పాటలు" అను ఆరుగురు కవుల గేయ సంకలనమును వెలువరించినది. ఆ కవుల పేర్లు, వారి కవితల సంఖ్యా వివరములివి ; ఆకెళ్ళ సుబ్రహ్మణ్య కవి (13). దాశరథి (8) బి. రామరాజు (6) సి. నారాయణ రెడ్డి (13). చిల్లర భావనారాయణ (4) భాగి నారాయణమూర్తి (5) ఈ కవులలో కొందఱినిగూర్చి లోగడ పరిచయము చేయబడినది. ఇప్పుడు శ్రీయుతులు బి. రామరాజు సి. నారాయణరెడ్డిగారల కవితా సౌందర్యమును ఆస్వాదింతము.

## డా॥ బి. రామరాజు

జననము-15 ఏప్రిల్ 1925. జన్మస్థానము - వరంగల్లుజిల్లా మడికొండ గ్రామము. 1956 నాటికే ఉస్మానియా విశ్వవిద్యాలయమున ఆంధ్రోపన్యాసకులుగా పనిచేయు చుండిరి. "తెలుగు జానపద గేయ సాహిత్యము" అన్న విషయముపై 1956లో పి హెచ్.డి. పట్టమును పొందిరి. ఉస్మానియా విశ్వవిద్యాలయమున మొట్ట మొదట పి.హెచ్.డి. చేసిన ఘనత వీరికే లభించినది. చరిత్ర-వాఙ్మయములను గూర్చి విమర్శనాయుతములును, పరిశోధనాత్మకములును నగు వ్యాసములనేకము వ్రాసిరి. ఇతర రచనలు : 1. వీరగాథలు 2. తెలుగువీరుడు 3. నివురుగప్పిన నిప్పులు మొదలైనవి. మంచివక్త. ఉత్తమ అధ్యాపకులు. గొప్ప దేశభక్తులు. తొలి నాళ్ళలో వీరు, సి. నారాయణరెడ్డిగారు కలిసి "రామ నారాయణ కవులు" అనుపేర జంటకవులుగా కవిత్వము వ్రాయుచుండెడివారు. ఈ విషయమును, 1985 ఏప్రిల్ 12వ తేదినాడు జరిగిన శ్రీ రామరాజుగారి షష్టిపూర్తి సభలో డా॥ సి. నారాయణ

## డా॥ సి. నారాయణరెడ్డి

జననము—29 జులై 1931, (శా. శ. 1853) జన్మస్థానము-కరీంనగర్ జిల్లా లోని హనుమాజీపేట. 1948 లో కరీంనగరులో హెచ్. యస్. సి. పూర్తియైన పిమ్మట చాదర్‌ఘాట్ కళాశాలలో ఇంటర్ చదువుటకు 1949లో హైదరాబాదుకు ఆగమనము. 1952 లో ఉస్మానియా విశ్వవిద్యాలయము ఆర్ట్సుకళాశాలలో బి. ఏ. పరీక్షలో ఉత్తీర్ణత. 1954లో ఆర్ట్సుకళాశాల నుండి ఎమ్. ఏ.లో కృతార్థత. 1955లో సికిందరాబాదు ఆర్ట్సుకళాశాలలో తెలుగు లెక్చరర్‌గా ఉద్యోగప్రవేశము.

కరీంనగరులో పదవతరగతి చదువుతున్నప్పటినుండి పద్యములు, గేయములు వ్రాయుట ప్రారంభించిరి. తొలుత వీరు పద్యములే వ్రాయుచుండిరి. కాలక్రమమున గేయరచనసాగించిరి. తొలిదశలో చెదురుమదురుగా వ్రాసినపద్యములయొక్కయు గేయములయొక్కయు వివరములను గుర్తించుట కొంతకష్టమే. "నవ్వనిపువ్వు"అన్నది వీరి మొదటిరచనయని పలువురు పేర్కొనిరి. ఇదొక కవితాఖండికకాదు: గేయనాటిక, 1949 లో వ్రాయబడినట్లు తెలియుచున్నది. 1952లో సికిందరాబాదు రాజశ్రీ సాహిత్యకళాపీఠము వారు ప్రకటించిన, "పూలపాటలు" గేయసంకలనములో వీరివి మొత్తము 13 గేయములు ప్రచురింపబడినవి. వీరి కవితావ్యాసంగము ప్రారంభమైన పిమ్మట ఇన్ని గేయములు ఒక్కచోట గ్రంథస్థమగుటకు ఇదియే ప్రారంభమని భావింపవచ్చును. రాజశ్రీ సాహిత్యకళాపీఠమువారే 1953లో "నవ్వనిపువ్వు" శీర్షికన వీరువ్రాసిన మొత్తము నాల్గు నాటికల సంపుటిని ప్రచురించిరి. ఇందులో వీరి ప్రథమరచనగా భావింపబడు "నవ్వనిపువ్వు" నాటికతోబాటు "వలపురేడు", "దగ్ధకాంతి", "భిన్న స్వరాలు" అను మరి మూడు నాటికలుకూడ నున్నవి. ఇదిట్లుండ, సికిందరాబాదులోని "అమర శ్రీగ్రంథమాల" వారు 1953 అక్టోబరులో "జలపాతం" అన్నపేర వీరి కావ్యఖండికల సంపుటిని ప్రకటించిరి. ఇందులో శ్రీనారాయణరెడ్డిగారు 1948, 49 సంవత్సరములలోను. ఆపిమ్మటను వ్రాసిన కావ్యఖండికలన్నియు చేర్చబడినడివి. వీనిలో గేయఖండికలతోపాటు పద్యఖండికలుగూడనుండుట గమనింపవలసినవిషయము.

ఇతర రచనలు— 1. నాగార్జునసాగరం 2. కర్పూర వసంతరాయలు 3. విశ్వనాథనాయకుడు (కావ్యములు) 4. నారాయణరెడ్డి గేయాలు 5. దివ్వెల మువ్వలు (కవితలు). 6. అజంతాసుందరి 7 రామప్ప (సంగీత నాటికలు). ఇవన్నియు కాస్త అటు ఇటుగా 1956 ప్రాంతమున వెలువడినట్లు భావింపవచ్చును.

అక్షర రమ్యత వీరి సొత్తు. శైలి సంగీతనాదయుతము. "ఉలి యలికిడి విన్నంతనె జలజలమని పొంగి పొరలు" అన్నట్లు నారాయణరెడ్డిగారి కలము అలికిడి విన్నంతనే శబ్దములు పులకించి రసాకృతిలో ద్రవించిపోవును. చంద్ర కిరణమునకు చంద్రకాంత శిలకు ఉన్న ఆత్మీయతే వీరి కలమునకు శబ్దమునకు కలదని చెప్పుట రస ప్రపంచమునకు తెలియనిదికాదు. పాత్ర చిత్రణలో సుతిమెత్తని భావుకత, ఆమం చితమైన శిల్ప రామణీయకత సాక్షాత్కరించును.

"నవ్వని పువ్వు" వీరి ప్రథమగేయ నాటికయని పూర్వోక్తము. ఇందులో కవి, మొగ్గ, తీగ, తుమ్మెద, పవనుడు అనునవి పాత్రలు. ఇందలి కవిపాత్ర ప్రబో ధమునకు ప్రతీకాత్మముగ కల్పింపబడినదని తజ్ఞుల భావన. ఇప్పుడు ఈ నాటికనుండి కవిగీతమొకటి యాలపింతము. ఇది చదువుటకు ముందు శ్రీ నారాయణరెడ్డిగారు ఈ నాటికను "కాల సమాధిలో కన్నుమూసిన కన్న తల్లికి" అంకితమిచ్చిరని తెలియ వలెను. ఆ గేయమిది :

చివురు టాకులలోన
రవల రేకులలోన
మంచు ముత్యాలుంచి
మంచి మధువులనించి
ఉదయభానుకరాల
సుధలు జారేవేళ
ప్రకృతి లక్ష్మి దివ్య
పాద పూజలుచేసి
ఎన్నొ నోములు నోచి
ఎన్నొ బాములుసైచి
నిన్నుగనె నీ తల్లి
నిండు మమతల వెల్లి
జీవనాడులలోని
శీతాంబువులుపోసి
పాలవెన్నెలలోని
పచ్చిమీగడ దీసి
తనమేనిపొరలనే

నునుపాన్పుగా జేసి
ఎంతో గారాబుగా
ఎంతెంతో డాబుగా
కడుపార పోషించె
మనసార ప్రేమించె
ఓ చిన్ని మొగ్గా!
ఓ కన్నె మొగ్గా!

శ్రీనారాయణరెడ్డిగారు గేయములతోపాటు తొలుత పద్యములుగూడ వ్రాయుచుండెడివారని వెనుక చెప్పబడినది. వీరి పద్యము లెట్లుండునో అన్న కుతూహలము పాఠకులకుండుట సహజము. అందుకు రెండుపద్యము లుదాహరింతము :-

కీ.శే. సురవరం ప్రతాపరెడ్డిగారిని గూర్చి వ్రాసిన పద్యమిది :

అతడు ప్రతాపరెడ్డి; యురులై పడియున్న తెలుంగువారి గుం
డెతెరలదుల్చి వెల్గులను నిచ్చినమిత్రుడు; మూర్ఛవోయిన
ట్టి తెలుగుజాతి సంస్కృతికి టీకలుదీసిన మల్లినాథుడె
న్నితరములైన వ్రాతపడనేరని సృష్టికి నాద్యదాతడే!

దాశరథితో తనకుగల అద్వైతమును ప్రకటించుచు వ్రాసిన పద్యమిది:

కలకాలమ్ములు నీవు నేనిటులె స్నిగ్ధస్నేహబంధాల బ
ద్ధులమైయుందము, ఏకగీతి నిరుగొంతుల్ విప్పి విన్పింతమాం
ధ్రులచైతన్య విపంచికావళులు విద్యున్నాదముల్ సేయగా
జలపాతమ్ములవోలె దూకుదము విశ్వక్సాహితీ శృంగముల్.

ఇది, హైదరాబాదు నగర తెలుగు భాషాసాహిత్య వికాసచరిత్ర. ఇందు అజ్ఞాతులును, అనుక్తులును అయిన మహనీయులకు క్షమాపణ పూర్వకముగ వందనములు సమర్పించుచు విరమించటమైనది.



# ప్రసక్త గ్రంథ సూచిక


యాభై సంవత్సరాల జ్ఞాపకాలు 1929-1979 : దేవులపల్లి రామానుజరావు. సంయుక్తప్రచురణ - సాహితీబంధుబృందం, చైతన్యసాహితి, హనుమకొండ-వరంగల్లు, నవంబరు 1981.

మాడపాటి హనుమంతరావు జీవిత చరిత్ర : కే. శే. ఆదిరాజు వీరభద్రరావు. ప్రచురణ - మాడపాటి హనుమంతరావు ఎనుబదియొకటవ జన్మదినోత్సవ సంఘము, మార్చి 1985.

బూర్గుల రామకృష్ణారావు జీవిత చరిత్ర : ఉమ్మెత్తల కేశవరావు, H. No. 3-4-830 బర్కత్‌పురా, హైదరాబాదు-500 027.

సురవరం ప్రతాపరెడ్డి జీవితము—రచనలు : ముద్దసాని రామిరెడ్డి. ప్రచురణ-ఆంధ్రసారస్వతపరిషత్తు, తిలక్‌రోడ్, హైదరాబాదు, జులై 1974.

సురవరం ప్రతాపరెడ్డి జీవితము-సాహిత్యము : ఎల్లూరి శివారెడ్డి. ప్రచురణ - కువవెల్లి పుల్లారెడ్డి మరియు శ్రీమతి ఇ. లక్ష్మీదేవి, కల్లూరు, మహబూబ్‌నగర్ జిల్లా.

పండిత ఆదిరాజు వీరభద్రరావుపంతులుగారి జీవిత చరిత్ర : పుల్లాబొట్ల వెంకటేశ్వర్లు, ప్రచురణ - విజ్ఞానస్రవంతి, ఖమ్మం. డిసెంబరు 1962.

యాత్రాస్మృతి : డా॥ దాశరథి.

50 సంవత్సరాల హైదరాబాదు : మందుముల నరసింగరావు. ప్రచురణ-మందుముల నరసింగరావు స్మారకసమితి, 1977.

ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు శతజయింతి సంచిక : ప్రచురణ శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము, హైదరాబాదు, 1985.

ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు సంక్షిప్త జీవిత చరిత్ర : ఎం. ఎల్. నరసింహారావు, ప్రచురణ - శతజయంతి ఉత్సవ సంఘం హైదరాబాదు.

ఆంధ్రోద్యమచరిత్ర-రెండుభాగములు : మాడపాటి హనుమంతరావు.
మహబూబ్ కాలేజి : (హైస్కూల్) సికిందరాబాదు, శతజయంతి సంచిక, 1862-1962.

మన తెలంగాణము : ఆదిరాజు వీరభద్రరావు.

షితాబ్‌ఖాను అను సీతాపతిరాజు-శాసనము : ఆదిరాజు వీరభద్రరావు. ప్రచురణ-లక్ష్మణరాయ పరిశోధకమండలి, హైదరాబాదు. 1961.

ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము : మల్లంపల్లి సోమశేఖరశర్మ. ప్రచురణ-పరమేశ్వర పబ్లికేషన్సు, హైదరాబాదు. 1967.

స్తంభాద్రి (ఖమ్మంపట్టణం) : కొదమసింహం సత్యనారాయణాచార్య, శాంతినగర్, ఖమ్మంజిల్లా.

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ రజతోత్సవ సంచిక, 1927.

గోలకొండ కవుల సంచిక : సంపాదకులు-సురవరం ప్రతాపరెడ్డి, 1934.

ఆంధ్ర సారస్వతపరిషత్తుచరిత్ర 1943-1973 : గడియారం రామకృష్ణశర్మ, ప్రచురణ - 1973.

వజ్రోత్సవసంచిక 1918-1978 : తెలుగు విభాగము, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు. సంపాదకవర్గము : ఆచార్య డా॥ బి. రామరాజు, ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డి, ఆచార్య డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం మొ॥.

అయ్యంకి వెంకటరమణయ్యగారి సన్మానసంచిక.

తెలుగునాటకవికాసం : డా॥ పి. యస్. ఆర్. అప్పారావు.

ఆంధ్రనాటకరంగ చరిత్ర : మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి. ప్రచురణ-1969. రేణుకా గ్రంథమాల.

ఆంధ్రసప్తశతి : (ఏడువందలమంది కవుల సంక్షిప్తచరిత్ర).

సమగ్రాంధ్రసాహిత్యం-8 వ సంపుటం-నవాబుల యుగం : ఆరుద్ర. ప్రచురణ-ఎమ్. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు, మచిలీపట్టణం, సికిందరాబాదు.

చరిత్రకెక్కని చరితార్థులు : ఆచార్య డా॥ బి. రామరాజు. ప్రచురణ - ఆచార్య డా॥ బిరుదురాజు రామరాజుగారి షష్ట్యబ్ది పూర్తి సన్మానసంఘం, 1985.

సారస్వత వ్యాసముక్తావళి : బూర్గుల రామకృష్ణరావు, ఆంధ్రసారస్వత పరిషత్తు ప్రచురణ.

ఆంధ్రశతక సాహిత్యవికాసము : పి. హెచ్. డి. సిద్ధాంత గ్రంథము. ఆచార్య డా॥ కె. గోపాలకృష్ణారావు, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు.

నారాయణరెడ్డి సాహితీమూర్తి : డా॥ తిరుమల శ్రీనివాసాచార్య. ప్రచురణ- యువభారతి-సాహితీసాంస్కృతిక సంస్థ, 5-కింగ్స్‌వే, సికింద్రాబాదు. 1981.

దాశరథి కవిత : దాశరథి. మహాంధ్ర ప్రచురణలు 13 (సి) రాజారామ్‌కాలనీ, కోడంబాకం, మద్రాసు-24. 1977

దాశరథి కవితాదర్శనము : డా॥ డి. లలితకుమారి, తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, విశాఖ, 1981.

పూలపాటలు : రాజశ్రీ సాహిత్య కళాపీఠం ప్రచురణ, సికిందరాబాదు. 1952.

పాలవెల్లి, గంగిరెద్దు (కావ్యములు) : డా॥ పల్లామర్రయ్య, ప్రచురణ-తెలంగాణా రచయితల సంఘం హైదరాబాదు. 1950-1956 మధ్య.

పచ్చతోరణము (స్వీయకవితాసంపుటి) : దేవులపల్లి రామానుజరావు. ప్రచురణ 1953.

పాంచజన్యము (కవితాసంపుటి) : గడియారం రామకృష్ణశర్మ. ప్రచురణ- జ్యోతిర్మయి-సాహిత్య సాంస్కృతిక సమితి, వనపర్తి, మహబూబ్‌నగర్‌జిల్లా.

ప్రత్యూష (పద్యసంకలనము) : ప్రచురణ - సాధనసమితి. ఈసామియాబజారు, హైదరాబాదు. 1950.

వైజయంతీవిలాసము : సారంగు తమ్మయ్య.

హరిశ్చంద్రోపాఖ్యానము : శంకరకవి.

తపతీసంవరణోపాఖ్యానము : అద్దంకి గంగాధరకవి.

చాటుపద్యమణిమంజరి.

యయాతి చరిత్ర : పొన్నిగంటి తెలగన్న.

సత్యహరిశ్చంద్రీయము : బలిజేపల్లి లక్ష్మీకాంతకవి.

WHO'S WHO : Editor - Veluri Sahajanand. The first All India Telugu Writers Conference 1960, Sponsored by Navya Sahiti Samiti, 208, Boyiguda, Secunderabad.

THE GRAND REBEL : By Dennis C. A. Kincaid.

AN ELEGY written in a Country Church - Yard : By Gray Thomas (1716 - 1771).

PICTORIAL HYDERABAD : Volume I. by K. Krishnaswamy Mudiraj. 1929.

గోలకొండ - తెలుగు దినపత్రిక : కొన్ని పాతపత్రికలు.

శోభ - తెలుగు సాహిత్యపత్రిక : కొన్ని పాతసంచికలు.

హైదరాబాదాంధ్ర సాహిత్యపరిషత్పత్రిక (మూడునెలలకొకసారిప్రచురణ) హైదరాబాదు, దక్కన్, ఏప్రిల్ 1945, సంపుటి 1, సంఖ్య 1. సంపా కీయవర్గము : రాయప్రోలు సుబ్బారావు, కురుగంటి సీతారామయ్య, మొహ మ్మద్ ఖాసింఖాన్ ప్రభృతులు.

సుజాత : సంపుటము 2, సంచిక 1, 15 ఆగస్టు 1951, జన్మదిన ప్రత్యే తె [illegible] సంచిక; సంపాదకుడు : గడియారం రామకృష్ణశర్మ.

ఆంధ్రప్రదేశ్ : ప్రభుత్వ తెలుగు మాసపత్రిక. సంచికలు, ఆగస్టు-సెప్టెంబ 1973, మార్చి 1974, నవంబరు 1974, మొదలైనవి.

ఆంధ్రప్రభ : తెలుగు దినపత్రిక. సంచికలు - నవంబరు 3 గురువారం 197 ఆ.వారం, 1983 ఆగస్టు 21, 28 ఏప్రిల్ 1985 మొదలైనవి.

ఆంధ్రపత్రిక : తెలుగు దినపత్రిక - ఆదివారం మే, 27, 1984 నాటి సంచిక.
DECCAN CHRONICLE : Sunday, November 27, 1983. e. t.

# ముఖ్య పదానుక్రమణిక

ఈ యనుక్రమణిక యందు ప్రధానముగ కవులు ప్రముఖసంస్థలు ప్రముఖ పత్రికలు ఉల్లేఖింపబడినవి.

రెడ్డిగారే స్వయముగ సెలవిచ్చి సభాసదులను ఆశ్చర్యచకిత మొనర్చిరి. శ్రీ రామ రాజుగారు తొలుత కవితలనే వెలయించు చుండెడివారు. కాలక్రమమున పరిశోధనవైపు దృష్టిని సారించిరి. పరిశోధన వారికి ప్రాణము. ఇప్పుడు వారు తొలినాళ్ళలో వెల యించిన కవితా సౌందర్యమును దర్శింతము. ఇది "పూల పాటలు" అను కవితా సంపుటమునుండి గ్రహింపబడినది. దీనికి పేరు శీర్షిక పేరు పెట్టలేదు. "?" అను ప్రశ్నార్థక చిహ్నమే దీనికి శీర్షిక. ఆ కవిత ఇది :

బాలపల్లవ ఖాదినీపిక
జాల చైత్రారంభ కుహూరుత
లీలలం గనుపించు దుఃఖపు
కీల లెందులకో ?

నీరజాసన శరధి తరగల
పారవశ్యము నంభ్రమించెడు
షట్పదీ ఝుంకారమందు-వి
షాద మెందులకో ?

నీలనీరద మందిరాంతర
తూలికాతల్పమున దూగెడు
శంపాలతిక జీవితపు రుచిలో
క్షణిక మాధురులా ?

క్షాళితాఖిల లోక కల్మష
నీలగళ మంగళ గళమ్మున
హాల హల నీలాతినీల
జ్వాలలెందులకో ?

ఎత్తుపల్లము లొక్క తీరుగ
మెత్తగా సరిదిద్దుకొనుచు
వేరువేరి సుమంతలేదని
ఏరు పారుటలా ?